శ్రీః

# అన్నమయ్య కౌముది

## సంస్కృత సంకీర్తనలు

## అర్థ విశేషాలు - డా॥ తాడేపల్లి పతంజలి




ప్రకాశకులు

**రావి కృష్ణకుమారి మోహనరావు దంపతులు**

చీరాల

శ్రీః

# అన్నమయ్య కౌముది
# సంస్కృత సంకీర్తనలు

**అర్థవిశేషాలు - డా॥ తాడేపల్లి పతంజలి**


ముద్రణ : *26-12-2015 - శివ ముక్కోటి ఆరుద్రోత్సవము*

ప్రతులు : *300*

పేజీలు : *216*

వెల రూ. : *120-00*




Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
**Andhra Pradesh.**
Cell : 9440115411

ప్రతులకు : Dr. **TADEPALLI PATANJALI,**
Flat No : 201, Sai Keerthi Residency,
Satya Enclave,
CHANDANAGAR,
HYDERABAD -500 050
**Telangana State.**
Cell : 9866691587



***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**

# అఘమర్షణ

ఫలపుష్పాలతో కళకళలాడే చెట్టును చూస్తూ, వేళ్ళను గురించి ఆలోచించే మనుషులు పెరగాలని ఆశించే డా॥ తాడేపల్లి పతంజలి గారి చేజాలువారిన నవ నవోన్మేషణ గ్రంథమీ అన్నమయ్యకౌముది.

శ్లోకం, పద్యం, వచనం, కీర్తన – ఏ దుస్తులు వేసుకున్నా, ఆలోచింపజేసి, ఆనందింపజేసే సాహిత్యమంటే వీరికిష్టం.

అధ్యయనం, అధ్యాపనం, అనుష్ఠానాలతో జీవితాన్ని పండించుకొన్న అన్నమయ్యకు నమస్కరిస్తూ...

రామోరా

సంపాదకుడు

# అక్షరాల మాలతి

జన్మనిచ్చిన తల్లిదండ్రులు తాడేపల్లి సుశీల, పార్వతీశ శాస్త్రి, తల్లిదండ్రులయిన అత్తామామలు పిల్లలమర్రి రాజేశ్వరి, సత్య సాగర్ పాద పద్మములకు నమస్సులు. ఇది ప్రచురితమవుతున్న నా తొమ్మిదో పుస్తకం.

9ని ఏ అంకెతో గుణించినా 9 మాత్రమే వస్తుంది. అంటేతొమ్మిదిఅంకె మార్పులకు లోను కాని బ్రహ్మతత్వాన్ని సూచిస్తుందని పెద్దల మాట. యాదృచ్ఛికంగా నా తొమ్మిదో పుస్తకం కూడా ఆ బ్రహ్మతత్వాన్వేషణకు సంబంధించినదే.

కలువలు పుష్పించటానికి హేతువైనది కనుక వెన్నెలని కౌముది అంటారని అమరం చెప్పింది. భూజనులను సంతోషపెట్టే ఆ కౌముదికి జ్యోత్స్న, జ్యోత్స్నిక, నెలవెలుగు, మాలతి, రేయెండ ఇలా ఎన్నో పర్యాయ పదాలున్నప్పటికీ వెన్నెలకు సరియైన పర్యాయ పదము ఆనందమని నేను అభిప్రాయపడుతున్నాను. అన్నమయ్య సంస్కృత కీర్తనలు చదివిన తర్వాత ఈ అభిప్రాయం బలపడింది. అందుకే ఆనందకారకమయిన కౌముదిని అన్నమయ్య కీర్తనల పక్కన చేర్చి"అన్నమయ్య కౌముది "అని ఈ పుస్తకానికి పేరు పెట్టాను.

ఈ సంస్కృత కీర్తనలను ఒకచోట చేర్చి వీటిలోని విశేషాలు వివరించమని నన్ను మొదట కోరిన వారు మిత్రులు శ్రీ పూర్ణదయాళ్, శ్రీ కల్లూరి శ్రీనివాస్ గారలు. పెద్దలు ఆకెళ్ల విభీషణ శర్మ గారు వీటికి కేవలం అర్థాలు మాత్రమే వ్రాసారని, వీటికి అర్థాలతో పాటు విశేషాలు కూడా వ్రాయమని నన్ను వారు కోరారు. అలా మొదలయింది ఈ సంస్కృత కీర్తనల సేవ. ముఖ పుస్తక (ఫేస్ బుక్ )పరిచయం ఏర్పడిన తర్వాత ప్రతి శనివారం ఒక సంస్కృత కీర్తన అర్థ విశేషాలతో పోస్ట్ చేయాలనినిర్ణయించుకొన్నాను. ముఖ పుస్తకములో అనేకమంది పెద్దలు, మిత్రులు చదివి నన్ను ప్రోత్సహించారు.

"తాడేపల్లి పతంజలి
పాడే అన్నయ్య పదపు ప్రతిపద వ్యాఖ్యల్
ఈడో సుజనులు మెచ్చగ
లేడాతని బోలు దిట్ట లేడిక జుమ్మీ !"

అన్నమయ్యకు నే చెప్పిన అర్థం : నడిపించే అన్న ప్రేమించే అమ్మ,మార్గ దర్శనం చేసే అయ్య అన్న అమ్మ అయ్య – అన్నమయ్య ఆయన పదాలను విశ్లేషించడం

సులభమైన విషయం కాదు. ఆ పై వాడి కటాక్షం ఉంటే తప్ప. అందుకే మీకీ ఆశీర్వచనం" అని చెన్నై మ్యూజిక్ అకాడమీ సెక్రటరీ, ప్రముఖ సంస్కృతాంధ్ర విద్వాంసులు డా. పప్పు వేణుగోపాలరావు గారు ఆశీర్వదించారు.(21-07-2015). ఇలాగే ఆచార్య వేటూరి ఆనందమూర్తి గారు కూడా కొన్ని కీర్తనల విశ్లేషణను మెచ్చుకొని ఆశీర్వదించారు. ఇంకా ఎంతోమంది మిత్రులు వారం వారం స్పందించారు. వారందరికీ నమస్సులు .ఈ రచనలో నాకు ఎన్నో పుస్తకాలు సహకరించాయి. ఆ పుస్తక రచయితలందరికి ధన్యవాదములు.

ఈ పుస్తకాన్ని ప్రచురిస్తున్న శ్రీ రావి మోహనరావు గారితో నా పరిచయం జిల్లేళ్లమూడి సంస్కృతాంధ్ర కళాశాలలో నాకు చదువు చెప్పిన డా. శ్రీ తూములూరి శ్రీదక్షిణామూర్తి శాస్త్రి గారి వలన ఏర్పడింది. నమక చమకాలకు నేను అర్థ తాత్పర్య విశేషాలు రాస్తున్న విషయం వారికి శ్రీదక్షిణామూర్తి శాస్త్రి గారు చెప్పారట. వారు తమ గౌరవసంపాదకత్వంలో వెలువడుతున్న **ఆత్మజ్యోతి** మాసపత్రికకు నమకం పంపించమని చెప్పి నెలనెలా ఒక అనువాక వివరణను ప్రచురిస్తున్నారు.

"పెద్దనగారి ఉత్పల మాలికకు అర్థాలు వ్రాయండి.." "కమలా కుచ చూచుక.. శ్లోకంలో ఆంతర్యము పంపండి..." అంటూ వాటిని పత్రికలో ప్రచురిస్తూ నన్ను ప్రోత్సహిస్తున్న పెద్దలు శ్రీ మోహనరావు గారు ఉన్నట్టుండి ఒకరోజు సాయంత్రం ఫోన్ చేసి " మీరు వ్రాసిన అన్నమయ్య సంస్కృత కీర్తనలు ప్రచురిద్దాం. మొత్తం ఫైల్ పంపండి.." అన్నారు.

అన్నమయ్య వేంకటేశుడు నా తల మీద చేయి వేసి స్పర్శించిన అనుభూతి.

శ్రీ రావి మోహనరావు గారు స్వయంగా పండితులు. ఒక్క చేతితో నూట ఇరవైకి పైగా తన పుస్తకాలు, ఇతరుల పుస్తకాలు ప్రచురించిన వదాన్యులు .నాకు తెలిసి ఏ వావిళ్ల సంస్థ లాంటిదో ఇన్ని ఆధ్యాత్మిక పుస్తకాలు ప్రచురించి ఉంటుంది. కాని ఒక వ్యక్తి ఇన్ని ఆధ్యాత్మిక, వైజ్ఞానిక పుస్తకాలు ప్రచురించటం సామాన్యమైన విషయం కాదు.ఇది అపూర్వమైన విషయం.

శ్రీ రావి కృష్ణకుమారీ మోహనరావు దంపతులకు హృదయపూర్వక నమోవాకములు.అన్నమయ్య వేంకటేశుడు వారికి , వారి కుటుంబానికి ఆయురారోగ్య భాగ్యాభివృద్ధులు కలిగించాలని హృదయ పూర్వకంగా ప్రార్థిస్తున్నాను.

ఈసందర్భంలో అన్నమయ్య అన్నమాట, అన్నమయ్య గీతోపదేశాలు తమ

సంస్థ తరపున ప్రచురించి, 'అన్నమయ్య పదసేవక' బిరుదుతో నన్ను సత్కరించిన సుజనరంజని సీతారామ శర్మగారు, పద్మ భూషణ్ వరప్రసాద్ రెడ్డిగార్ల సౌజన్యాన్ని వందనములతో సంస్మరిస్తున్నాను. అన్నమయ్య ఆత్మీయులు శ్రీగంధం శంకరరావు, శ్రీ వేణు మాధవ్ ,పివి రమణమూర్తి, సాయిరాం ప్రసాద్ ప్రభ ృతులకు ప్రేమ ప్రశ్రయములు.

నా కుటుంబ జీవితంలో నా సాహిత్య సేవకు ఆటంకం కలిగించకుండ ప్రోత్సహిస్తున్న జీవన సహచరి మీనాకు, చిరంజీవినులు దీప్తి, కావ్యలకు ఆశిషములు.

అన్నమయ్య వేంకటేశుని అనుగ్రహంతో నాకు చేతనయినంతవరకు అర్థ విశేషాల వివరణకు ప్రయత్నించాను. భాషని చాలావరకు వ్యావహారికంలో తేవటానికి ప్రయత్నించాను. గ్రాంథిక ఛాయలు పూర్తిగా నన్ను పూర్తిగా విడవలేదనే విషయం నాకు తెలుసు.

ఈ పుస్తకంలో ఎక్కడయినా పదము తొౖట్రిలబడితే – సహేతుకంగా విబుధులు వివరిస్తే మలి ముద్రణములో సవరించుకొంటాను.

ధన్యవాదములు

డా॥ తాడేపల్లి పతంజలి
9866691587
patanjali1576@gmail.com



## విషయసూచిక | పుట

శ్రీః

## *1. అంజలి రంజలి రయం తే (05-289)*

**అంజలి రంజలి రయం తే ।**
**కిం జనయసి మమ ఖేదం వచనైః ॥**

**1.మాం కిం భజసే మయా కింతే ।**
**త్వం కోవా మే తవ కాఽహం ।**
**కిం కార్యమితో గేహే మమతే ।**
**శంకాం వినా కిం సమాగతోసి । ।అం।**

**2.నను వినయోక్తేర్న యోగ్యాఽహం ।**
**పునః పునస్త్వం పూజ్యోసి ।**
**దినదిన కలహ విధినా తే కిం ।**
**మనసిజ జనక రమారమణ । ।అం।**

**3.దైవం బలవత్తరం భువనే।**
**నైవ రోచతే నర్మమయి।**
**ఏవమేవ భవదిష్టం కురు కురు।**
**శ్రీ వేంకటాద్రి శ్రీనివాస ।అం।**

వేంకటేశ్వర స్వామికి భక్తులకు దర్శనమివ్వటంలో చాలా సమయం గడిచిపోయింది. అమ్మ అలమేలుమంగమ్మతో పొద్దు పుచ్చటానికి ఏకాంత ప్రదేశానికి చేరుకొన్నాడు. అమ్మ అయ్యని కాస్త ఎగతాళి మాటలతో చురుకు పుట్టించాలనుకొంది. ఆయన పాపం ఇంకా మాట్లాడటం ఇంకా మొదలు పెట్టలేదు. అమ్మ అంజలి అంజలి అంటూ పల్లవి మొదలు పెట్టింది.

స్వామీ! నీకొక నమస్కారం! ఎందుకయ్యా మాట్లాడాలని చెప్పి నాకు వేదన కలిగిస్తావు. నీకు నీ మాటలకు ఒక దండం బాబూ! వేంకటేశ్వరుడు అమ్మవారి సేవ చేయాలని కొంచెం వంగాడు. అమ్మ రెచ్చిపోయింది.

1. ఎందుకయ్యా! నన్ను సేవిస్తావు. నువ్వెవరివి? నేనెవరిని? నీకు నేనేమవుతాను. నాకు నువ్వేమవుతావు? భక్తులకు దర్శనమిస్తూ కొండ మీదనే ఉండకపోయావా ! అలమేలుమంగాపురంలోని నా ఇంట్లో నీకేం పని? ఔరా! ఆలస్యమయితే ఏమన్నా అనుకొంటుంది అన్న భయం భక్తి లేకుండా వచ్చేసావు.

2. వినయపు మాటలు చెప్పే యోగ్యత నాకు ఎక్కడ ఉందిలే? అందుకు నేను తగను. నువ్వు పూజ్యుడివి. నేను కాదు. ఓ మన్మథ జనకా! మనిద్దరి మధ్య ఈ తగువులేంటి? నువ్వు ఆలస్యం గా రావటం. నేనేదో అనటం. ఎందుకొచ్చిన తగవులు! వీటివల్ల మనకి ఏమి ప్రయోజనము ఉంది?

3.అయినా నేను ఎంత చెప్పినా దైవమే బలవత్తరమైనది. నేను తొందరగా రావయ్యా మగడా! అంటాను. నువ్వు ఆలస్యం చేస్తూనే ఉంటావు. నా విషయంలో శృంగారం నీకు ఇష్టం కాదులే. నీ ఇష్టం స్వామీ! ఇకనుంచి నేను ఏమీ చెప్పను. నీ ఇష్టం వచ్చినట్లు చేయి. నీకొక దండం.

**విశేషాలు :**

1. దేని చేత భక్తి వ్యక్తం చేయబడుతుందో దానిని అంజలి అంటారు.

2. 'దోసిలి పట్టి నమస్కారం చేయటం అంజలి' అని పారమార్థిక పద కోశం.

3. నీకో నమస్కారం అనే తెలుగు జాతీయానికి అందమైన సంస్కృత అనువాదం 'అంజలిరంజలిరయం తే'.

4. నాయిక జీవాత్మ. నాయకుడు పరమాత్మ. ఇద్దరి మధ్య సయోధ్య కుదరదు. తగాదాలు వస్తూనే ఉంటాయి. దీనినే అన్నమయ్య ప్రతిరోజూ మనిద్దరి మధ్య ఈ తగాదాలేమిటి (దిన దిన కలహ విధినా) అన్నాడు.

5. జీవుడు భగవంతుడు నిర్దేశించిన శరణాగతి మార్గంలోనే నడవాలని 'నీ ఇష్టం వచ్చినట్లు చేయి (భవదిష్టం కురు)' అంటూ అన్నమయ్య భక్త మార్గాన్ని నిర్దేశించాడు. అసలు అంజలికి 'శరణు' అని ఒక పర్యాయ పదముంది. అందుకే స్వామికి 'శరణు' అంటూ స్వామితో నాయికా రూపంలో అన్నమయ్య ఈ గీతంలో ఆత్మీయ సంభాషణ చేసాడు.



## *2. అంబుజాక్ష నమో ప్రహ్లాద వరద (18-300)*

**అంబుజాక్ష నమో ప్రహ్లాద వరద**
**పీతాంబరధర ప్రహ్లాద వరద**

**1.హరి వేషావతార ప్రహ్లాద వరద**
**హరి విరించినుత ప్రహ్లాద వరద**
**అరిదానవాంతక ప్రహ్లాద వరద**
**పరమ పురుష నమో ప్రహ్లాద వరద ॥అంబు॥**

**2. అమిత గుణాకర ప్రహ్లాద వరద**
**అమర వందిత ప్రహ్లాద వరద**
**అమృతమయ రూప ప్రహ్లాద వరద**
**ప్రమదాంక నమో ప్రహ్లాద వరద ॥అంబు॥**

**3. అహిరాజశయన ప్రహ్లాద వరద**
**అహోబలేశ ప్రహ్లాద వరద**
**సహజ శ్రీ వేంకటాచలనివాస నిత్య**
**బహురవితేజ నమో ప్రహ్లాద వరద ॥అంబు॥**

హిరణ్యకశిపుని సంహరించిన తరువాత ప్రహ్లాదుని ఏదైనా వరం కోరుకొమ్మన్నాడు నరసింహస్వామి. 'నన్ను అనేకమంది అనేక కోరికలు కోరుతుంటారు. నువ్వు కూడా ఏదైనా కోరుకో' అని స్వామి అంటే ప్రహ్లాదుడు ఇలా రెండు వరాలు కోరుకొన్నాడు.– "1. కోరికలు వృద్ధి పొందని వరాన్ని ప్రసాదించు. 2. నా తండ్రి హిరణ్యకశిపుడు పవిత్రుడు అయ్యే వరం ప్రసాదించు". నరసింహుడు ప్రహ్లాదునికి ఆ వరాలు ప్రసాదించాడు. ప్రహ్లాదునికి వరాలు ఇచ్చిన ప్రహ్లాద వరదుని అన్నమయ్య ఈ కీర్తనలో పొగుడుతున్నాడు.

పద్మాలవంటి విశాలమైన కన్నులు కలవాడా! (భక్తులకు వరాలు ఇచ్చేటప్పుడు కూడా నీది విశాలమైన దృష్టి.) ప్రహ్లాదునికి వరములిచ్చిన వాడా! పసుపు పచ్చని బట్టలు ధరించినవాడా! (మా జీవితాలను కూడా శుభంగా చేయి) నీకు నమస్కారము.

1.సింహము యొక్క వేషాన్ని ధరించిన వాడా! (మా సమస్యలను చీల్చి చెండాడే భారం కూడా నీదే.!) శివుడు, బ్రహ్మ మొదలైన వారిచే నమస్కరింపబడువాడా! (ఆ శివుడు ఇచ్చే శుభాన్ని, ఆ బ్రహ్మ చేసే మంచి ఆలోచనల సృష్టిని మాకు కల్పించు స్వామీ!) పరమాత్మా! నీకు నమస్కారము .

2. నీకున్న గుణాలు ఇన్నని చెప్పలేము (మహానుభావా! కేవలం రజో, తమో గుణాలు అనే రెండు గుణాలు నా దగ్గరినుంచి తీసేయి స్వామీ!) దేవతలందరూ నీకు ఎప్పుడూ నమస్కరిస్తుంటారు. (స్వామీ! ఆ శని దేవత అప్పుడప్పుడు నాతో, నా అరోగ్యంతో చిలిపిగా ఆడుకొంటుంటాడు. నీకు నమస్కారం చేసే సమయంలో ఆయనను నా జోలికి రావద్దని చెప్పు స్వామీ!) శాశ్వతమైన స్వరూపము నీది. (తాత్కాలికమైన నా స్వరూపముతో నీ భక్తుడిగా శాశ్వత కీర్తిని కల్పించు తండ్రీ!) సంతోషమే నీగుర్తు కనుక నిన్ను ప్రమదాంకుడంటారు. (నా ఖర్మ కొద్దీ ఎప్పుడూ అన్నిటికి ఏడుస్తుంటాను. నన్ను కూడా ప్రమదాంకునిగా చేయి స్వామీ!) నీకు నమస్కారము.

3. అదిశేషుడు నీకు పడక. (నేను కూడా ఎప్పుడూ కోర్కెల సర్పాల పడకల మీద పడుకొంటుంటాను. అయితే ఒకటే బాధ. నీకు ఆదిశేషుడు లొంగి ఉంటాడు. నేను కోర్కెలకు లొంగిపోతుంటాను.) అహోబల క్షేత్రానికి నాయకుడా! శ్రీ వేంకటాచల పర్వతంపై ఉండేవాడా! అనేకమంది సూర్యుల కాంతి ఒకచోట కలిగిన వాడా! (గాఢమైన అజ్ఞాన తిమిరములో ఉన్నాను. నా అజ్ఞానపు చీకట్లు తొలగించు దేవా!) నీకు నమస్కారము.



## *3. అహెూ సాధు తవాగమనం (6-24)*

**అహెూ సాధు తవాగమనం**
**బహుళ వైభవైః ప్రతివచనైః కిమ్**

**1.తతోపసర మిథ్యాశఠవచనై**
**రితస్తవైర్మమ హితం కిమ్**
**బత మమ దేహాత్ప్రాణ స్తథాపి**
**గత ఏవై తత్ కారణమిహ కిమ్ ॥అహెూ॥**

**2.సంవృతి చేలం జహి చపల త్వం**
**సంవాదేమే సతతం కిమ్**
**త్వం వా మమ చిత్తం సాంత్వయసి**
**కిం వా కురు మమ ఖేలనమిహ కిమ్ ॥అహెూ॥**

**3.అతి బిభేమి భవదాచరణాదిహ**
**చతుర వేంకటాచలరమణ**
**సతీం మా మనుసరసి కిమర్థం**
**రతిరాజ విభవ రచన మిదం కిమ్ ॥అహెూ॥**

అన్నమయ్య ఈ గీతంలో స్వామి వారితో తగాదా పడే ఒక నాయిక అయ్యాడు. వేంకటేశ్వరుడు అనుకొన్న సమయానికి రాకుండా ఆలస్యంగా వచ్చాడు. ఒళ్లు మండిపోతున్న నాయిక మాటల వడ్డన మొదలు పెట్టింది.

నీరాక ఎంత బాగుంది స్వామీ! (బాగా లేదని ఎత్తి పొడుపు). ఎక్కువ వైభవం ఉన్న మారు మాటలతో ఇంకా ఏమిటి ప్రయోజనం?

1. తప్పుకోవయ్యా మగడా! నీ డాబుసరి మాటలతో నాకు ఏమి లాభం? అయ్యో! అయినప్పటికీ శరీరమునుంచి ప్రాణము పోయింది. దీనికి కారణము ఏమిటబ్బా!

2. ఓ చపలబుద్ధీ! నా పైటచెంగు విడు. నువ్వా నా మనస్సును ఉపశమింపచేసేది?! (నీవల్ల కాదని ఎత్తి పొడుపు.) ఏమైనా చేసుకో! ఇక్కడ ఆటలు ఎందుకు?

3. నేర్పరీ! వేంకటాచలపతీ! నిన్ను పూజించటం వల్ల నాకు ఏమి ఒరిగింది? నేను పతివ్రతని. ఎందుకయ్యా! నన్ను అనుసరిస్తావు? మన్మథుని తండ్రీ! ఈ రచనా క్రమం ఏమిటి? ఎందుకు?

**విశేషాలు :**

**ఎక్కువ వైభవం ఉన్న మారు మాటలు** – మారు మాటలు అంటే ఎదురు మాటలు.

వైభవమంటే ఠీవి. వేంకటేశ్వరుడు ఠీవిగా ఎదురు మాటలు మాట్లాడుతున్నాడని దానివల్ల ప్రయోజనం ఉండదని నాయిక ఎత్తి పొడుపు.

**శరీరమునుంచి ప్రాణము పోయింది –** నాయకుడు డాబుసరి మాటలు, బొంకులు మాట్లాడినా నాయిక బింకంగా ఉంది. అవి అబద్ధాలని వాదించింది. కాని స్వామి వారిపై ఉన్న అధికమైన ప్రేమ వల్ల ఆయన ప్రేమను తానొక్కతె నే దక్కించుకొనలేకపోతున్నాననే బాధ వల్ల ప్రాణం పోయినంత పని అయిందని నాయిక ఆక్రోశం. ఇది జీవుడు దేవుని పట్ల చూపించవలసిన ఆప్యాయత. తనకొక్కరికే ఆ ప్రేమ దక్కాలనుకోవటంలో స్వార్థం ఉంది. ఎంతో ప్రేమ కూడా ఉంది.

**రచనా క్రమం –** నాయకుడు నాయిక పట్ల చేసిన ఓదార్పు చేష్టలనన్నింటిని అన్నమయ్య రచనమిదం (రచనా క్రమం) అను పదబంధంలో తెలియ చేసాడు. నాయకుడు నాయిక కోపం తగ్గించటానికి గడ్డం పట్టుకోవటం, కాళ్లు పట్టుకోవటం మొదలైన చర్యలన్నీ 'రచన' అను పదంలో తెలియ చేసిన కవికి జోహారు.



## *4. అతిశోభితేయం రాధా (6-48)*

**అతిశోభితేయం రాధా**
**నతతవిలాసవశా రాధా**

**1.దర్పక బలబోధా రాధా**
**తర్పణ గంధవిధా రాధా**
**దర్ప యుతక్రోధా రాధా**
**దర్ప కరసవేధా రాధా ॥అతి॥**

**2.తారితావరోధా రాధా**
**తారుణ్యోద్బోధా రాధా**
**ధారితానురోధా రాధా**
**దారితాపరాధా రాధా ॥అతి॥**

**3.తరుణీమరుగాధా రాధా**
**ధరసమకుచబాధా రాధా**
**తరణసదనుబోధా రాధా**
**ధరణిదుస్సాధా రాధా ॥అతి॥**

**4.తనుభవగురుగాధా రాధా**
**స్తనకృతగిరిరోధా రాధా**
**తనువరవచనసుధా రాధా**
**ధ్వనిజితపికమేధా రాధా ॥అతి॥**

**5.తరుణసఖీసవిధా రాధా**
**దరశశిరుచిసౌధా రాధా**
**తరళితతటిద్విధా రాధా**
**దరహసనవరోధా రాధా ॥అతి॥**

**6.ధన గర్వ నిషేధా రాధా**
**స్తవతత్పర విబుధా రాధా**
**ద్రవధునీకృతసుధా రాధా**
**దవమదనవ్యాధా రాధా ॥అతి॥**

**7.తరుణత్వ పురోధా రాధా**
**తరుణస్మరయోధా రాధా**
**తరుపశుమణిగుణధారక బహుల వి**
**తరణపరా బహుధా రాధా ॥అతి॥**

**8.దైవికసుఖోపధా రాధా**
**ద్రావకనిజాభిధా రాధా**
**శ్రీ వేంకట గిరి దేవ కృపాము**
**ద్రావైభవ నాథా రాధా ॥అతి॥**

ఈ రాధ బాగా ప్రకాశిస్తోంది. వినయం కలిగిన విలాసానికి వశురాలు ఈ రాధ.

1. మన్మథుని బలాన్ని బాగా బోధించేది రాధ. కృష్ణునికి తృప్తి కలిగించటానికి గంధం పూసుకొన్నది రాధ. గర్వంతో కూడిన క్రోధము కలిగినది రాధ. మన్మథుని రసము అనగా శృంగార రసానికి బ్రహ్మ వంటిది రాధ.

2. అవరోధాలను పోగొట్టేది రాధ. యౌవనాన్ని మేలుకొలిపేది రాధ. శ్రీకృష్ణుడు చేసే ప్రార్థనము, వేడికోలు ఇటువంటి అనునయాలను పట్టించుకోనిది రాధ. అపరాధాల అంతు చూసేది (చీల్చేసేది) రాధ.

3. తరుణులకు చెందిన మన్మథుని చరిత్ర రాధ. అందమైన , సమంగా ఉన్న స్తనములతో బాధ పడేది రాధ. భవసాగరాన్ని దాటించే ప్రబోధము కలిగినది రాధ. ఈ భూలోకంలో పొందుటకు అసాధ్యమైనది రాధ.

4. తరుణులకు చెందిన మన్మథుని చరిత్ర రాధ. తన స్తనములతో పర్వతాలను అడ్డగించునది రాధ. శ్రేష్ఠమైన మాటలనే అమృతము కలిగినది రాధ. చక్కని కంఠముతో తియ్యని కోకిల కంఠాన్ని జయించినది రాధ.

5. అందమైన చెలికత్తెలతో కూడియుండునది రాధ. అందమైన వెన్నెలల మేడవంటిది రాధ. మిరుమిట్లు గొలిపే మెరుపు తీగవంటిది రాధ. తన చిరునవ్వుతో కష్టాలను తొలగించేది రాధ.

6. భర్తయైన కృష్ణుని గర్వాన్ని నిషేధించేది రాధ. తనను పొగడాలని ఆసక్తులై యుండు పండితుల సమూహములు కలది రాధ. తన సరసాలతో ప్రవహించే అమృత ప్రవాహాలు కలిగినది రాధ. చెరకు కొమ్ము కలిగిన మన్మథుడనే కిరాతుడు కలిగినది రాధ.

7. యౌవనానికి ఒక ఉపాధ్యాయునిలా దారి చూపించేది రాధ. యౌవన మన్మథ సంగ్రామ యోధురాలు రాధ. కల్ప వృక్షము, (తరు) కామధేనువు (పశు) చింతామణి (మణి) మొదలైన వాటి దాన గుణములు కలిగి అనేక వరములు ఇచ్చునది రాధ.

8. దైవము వలన కలిగే సుఖాన్ని పరీక్షించునది రాధ. తన పేరును (అభిధా) తలచిన

వారి కష్టమనే ద్రవ్యమును ఎక్కువ సులభముగా కరగునట్టు చేయు ద్రవ్యము (Flux) రాధ. శ్రీవేంకటేశుని దయా ముద్రతో వైభవమునకు అధిపతి రాధ.

**విశేషాలు :**

1. వైష్ణవులు రాధను శక్తి అవతారంగా భావిస్తారు.
2. బ్రహ్మలోకం మీదుగా వైకుంఠం, రుద్రలోకం. దానిపైన సుదర్శన చక్రం, ఆపైన గోలోకం ఉన్నది. ఆ లోకంలో రాధాకృష్ణులు ఉంటారు..
3. గోకులంలో శ్రీకృష్ణుని పక్కన ఉండే హ్లాదినీ శక్తి రాధ. (రాధోపనిషత్)
4. రాధ శ్రీకృష్ణుని పంచప్రాణాధిదేవి.
   రాధ కృష్ణ భక్తిని ప్రసాదిస్తుంది.
5. శ్వేత వరాహ కల్పంలో ఆ గోలోక రాధ భూలోకంలో వృషభానుని కుమార్తెగా అవతరించింది. (దేవీభాగవతం)
6. రాధా పూజాపద్ధతి, రాధా కవచం ప్రకృతి ఖండంలో వున్నాయి (బ్రహ్మ వైవర్త మహాపురాణంలోని శ్రీకృష్ణ జన్మఖండం)

   శ్రీదాముడు శ్రీకృష్ణుని గోలోక భక్తుడు. ఒక కారణంవల్ల రాధ, శ్రీదాముడు ఒకరినొకరు శాపంపెట్టుకొన్నారు. శంఖచూడుడనే రాక్షసునిగా శ్రీదాముడు నందవ్రజంలో కలావతి, వృషభానుడు అనే వైశ్యదంపతులకు కుమార్తెగా రాధ పుట్టింది.
7. రాసంబునుండి పుట్టి హరి ఎదుట ధావనము చేసింది కనుక రాధ అని పేరు. రాధ శరీర రోమ కూపాలనుండి గోపికలు పుట్టారు. రాధ శ్రీకృష్ణుని ఎడమ భాగమునుండి పుట్టగా గంగా కుడి పార్శ్వమునుండి పుట్టినది (బ్రహ్మవైవర్తే మహాపురాణ ద్వితీయ ప్రకృతిఖండే నారాయణ సంవాదే గంగోపాఖ్యానం)
8. రాధా కృష్ణులు ప్రకృతి పరమాత్మలు.
9. ఆ ప్రకృతిని అంటే ఉపాసన శక్తిగా చేసి, ఆ ఉపాసన ద్వారా భక్తుల హృదయాలను ఆకర్షించి, వారికి ముక్తినీ, మోక్షాన్ని శ్రీకృష్ణుడు కలిగిస్తుంటాడు.
10. మధుర భక్తి సంప్రదాయంలో భక్తుడు తనను నాయికగా భావిస్తాడు.

భగవంతుని పొందుకోసం ఆరాట పడతాడు. రాధ జీవాత్మ, కృష్ణుడు పరమాత్మ.

11. జీవాత్మ పరమాత్మల కలయిక , ఆ కలయిక కోసం పడే ఆరాటం జయదేవుని అష్ట పదులుగా, అన్నమయ్య 'అతిశోభితేయం' కీర్తనగా రూపుదిద్దుకొన్నాయి.

12. అష్ట పదిలా అన్నమయ్య కీర్తనలోను ఎనిమిది చరణాలు ఉన్నాయి.

13. అమ్మవారి కుచాల వర్ణన భక్త కవుల వర్ణనలలో కొంచెం ఇబ్బంది కలిగించే విషయంగా చాలామంది భక్తులు భావిస్తుంటారు. అన్నమయ్య ఈ అష్ట పది కీర్తనలో కూడా రాధ స్తనాల వర్ణన చేసాడు. ఇది కొంచెం పరిశీలిద్దాం.

శ్రీ సాయి సచ్చరిత్రలో ఒకచోట ఈ కుచముల ప్రసక్తి ఉంది.

శ్యామ తల్లి కుచములపై తామర లేచి ఆమె అమితంగా బాధపడింది. తనకు నయమైతే రెండు వెండి కుచములు సమర్పిస్తానని అప్పుడు ఇంకొక మ్రొక్కు మ్రొక్కింది. ఆమె చనిపోయేటప్పుడు ఈ సంగతి శ్యామాకి చెప్పి రెండు మ్రొక్కులు చెల్లించే భారాన్ని అతనిపై వేసి ఆమె మృతిచెందింది. శ్యామా ఒక కంసాలిని పిలిచి, రెండు వెండి కుచములను చేయించాడు. మసీదుకి వెళ్ళి బాబా పాదాలపై పడి, రెండు కుచములను అక్కడ పెట్టి, తన మ్రొక్కులను చెల్లజేయుమని, బాబాయే తన సప్తశృంగి దేవత అవటంతో వాటిని ఆమోదించమని వేడుకున్నాడు. (శ్రీసాయిసచ్చరిత్రము ముప్పైవ అధ్యాయము)

సచ్చరిత్రను భక్తితో చదివే భక్తులు కుచాల ప్రసక్తి ఏమిటని తలువరు. దాని విశ్లేషణ మొదలుపెట్టరు. అన్నమయ్య లాంటి భక్తకవుల స్తన వర్ణనలలో కూడా అంతే. విశ్లేషణ చేయకూడదు. అది వర్ణనలో ఒక భాగంగా తలవాలి.



## *5. అస్మదాదీనాం అన్యేషాం (1-357)*

**అస్మదాదీనాం అన్యేషాం**
**తస్మిన్ తస్మిన్ తత్రచ పునశ్చ**

**1.సతతాధ్యయన నిష్ఠాపరాణాం ద అథ-**
**ప్రతినాం యతీనాం వనవాసినాం**
**గతిరిహ స్మర్తుం కా జగత్యాం పర**
**స్థితిరియం కా విష్ణు సేవా పునశ్చ ॥అస్మ॥**

**2.మోహినామత్యంత ముష్కరాణాం గుణ-**
**గ్రాహిణాం భువనైక కఠినానాం**
**దేహ సంక్షాళన విదేశకోవా సదా**
**శ్రీ హరి స్మరణ విశేషః పునశ్చ ॥అస్మ॥**

**3.కింకుర్వాణ దుఃఖిత జీవినాం**
**పంకిల మనోభయ భ్రాంతానాం**
**శంకాం నిరురుతి స్సరసా కా, శ్రీ-**
**వేంకటాచలపతేర్వినుతిః పునశ్చ ॥అస్మ॥**

మా వంటి భక్తులకు, మాకు సంబంధించినవారికి, ఇతరులకి, రకరకాల విషయాల్లోను, రకరకాల సమయాల్లోను మళ్లీ, మళ్లీ కోరదగినదేది? (దీనికి జవాబు మూడు చరణాల్లోను కవి ఇలా వివరిస్తున్నాడు.)

1.ఎప్పుడూ వేదము చదువుకొనేవారికి, దృఢ వ్రతము కలిగినవారికి, సన్యాసులకి, వాన ప్రస్థులకి ఈ ప్రపంచంలోని వారందరికి, విష్ణు సేవ మాత్రమే ఉత్తమమైన స్థితిని మళ్లీ, మళ్లీ కలిగిస్తుంది.

2. మోహము కలిగిన వారికి, దుష్టులకు, గుణములను గ్రహించే లక్షణము కలిగినవారికి, కఠినమైన స్వభావము కలిగినవారికి, సరిగా స్నాన సంధ్యాదులు చేయనివారికి ఎప్పుడూ శ్రీహరిని స్మరించటమే మళ్లీ, మళ్లీ చేయ దగినది.

3. ఇతరులను ఎప్పుడూ సేవిస్తూ బాధలు పడుతుండేవారికి, మాలిన్యాలు నిండిన మనస్సులతో సందేహాలు పడేవారికి, ఎప్పుడూ వేంకటేశ్వరుని నుతి మాత్రమే మళ్లీ, మళ్లీ శరణము.

**విశేషాలు :**

1. అన్నమయ్య ఈ సంస్కృత గీతపు పల్లవిలో చరణాలకు సంబంధించిన పదాలను ఒకచోట చేర్చి కొత్త శైలిని ప్రవేశపెట్టాడు. అందరికి సేవింపదగినదేది? అంటే సరిపోతుంది. కాని అన్నమయ్య అలా అనకుండా మా వంటి భక్తులకు, మాకు సంబంధించినవారికి, ఇతరులకి, రకరకాల విషయాల్లోను, రకరకాల సమయాల్లోను, మళ్లీ, మళ్లీ (అస్మదాదీనాం అన్యేషాం తస్మిన్ తస్మిన్ తత్ర చ పునశ్చ) అన్నాడు. సేవింపదగినదేది? అని మనం పల్లవికి జత కలుపుకోవాలి.

2. సంసార జీవితం ముగించుకొని అడవికి వెళ్లి, వనవాస వ్రతాన్ని చేసేవాడు వానప్రస్థుడు. ఆ విధమైన జీవితం వానప్రస్థం.

3. గురుముఖమున ఆనుపూర్విగ (ముందు వెనుకలనే క్రమ పద్ధతితో) వేదము జదువుట ఇదివరకటి రోజుల్లో అధ్యయనము అనేవారు. ఇలా చదివేవారిని అన్నమయ్య సతతాధ్యయననిష్ఠాపరులు అన్నాడు.

4. యతి అంటే సర్వసంగ పరిత్యాగి. సన్యాసి. ఇంద్రియాలను జయించినవాడు. యతులలో కూడా రకరకాల సంప్రదాయాల వారున్నారు. వైష్ణవ యతికి జందెము, త్రిదండం, (మనోదండము, వాగ్దండము, కర్మదండము) చర్మవస్త్రం, శిక్యం (ఉట్టి), బ్రుసి (యతులు కూర్చునే ఆసనం), కౌపీనం(గోచి), కటి వేష్టనం (నడుముకు చుట్టు) ఉంటాయి. ఈ యతులకు కూడా విష్ణు సేవ మాత్రమే ఉత్తమమైన స్థితిని కలిగిస్తుందని అన్నమయ్య హిత బోధ.

5. భౌతిక అవసరాలకొరకు రకరకాల ఉద్యోగాలు చేస్తున్న వారికి , భగవంతుని సేవ చేయటానికి తగిన సమయము దొరకదు. వారిని మనస్సులో భగవంతుని పొగడమని, తద్వారా స్వామి సేవ చేసిన ఫలితము లభిస్తుందని అన్నమయ్య కలియుగంలోని ఉద్యోగ జీవులకు మూడో చరణంలో తరుణోపాయం చూపించాడు.



## *6. అహెూ సురత విహారోయం (5-78)*

అహెూ సురత విహారోయం
సహజ పరాజయ శంకా నాస్తి ॥పల్లవి॥

**1.** యమునా కూలే సుమలతా గృహే
విమల సైకత వివిధ స్థలే
రమణీ రమణౌ రమత స్తయోః
ప్రమదస్య పరాత్పరం నాస్తి ॥అహెూ॥

**2.** రజనీ కావా ప్రాతః కింవా
త్యజనం భజనం తత్కింవా
విజయః కోవాపజయః కోవా
భుజ పరిరంభ స్ఫుటం నాస్తి ॥అహెూ॥

**3.**చీనాంశుక రంజిత మేఖలాని
తానే జఘనం తరతి సతి
మానవికలనే మానినీమణేః
హీనాధికపరిహృతిః నాస్తి ॥అహెూ॥

**4.**కింవా మిళనం కింవాఽ మిళనం
త్వం వాఽహంవా తన్నాస్తి
సంవాదో వా సరసః కోవా
కింవా వాచ్యా క్రియా నాస్తి ॥అహెూ॥

**5.**ఆదిదేవ పీతాంశుక బద్ధా
స్వేద సురభి కాశ్మీర జలం
సాదురూహ్యలజావివశతయా
ఖేదేన వచఃకించిన్నాస్తి ॥అహెూ॥

**6.**వరకుచాగ్ర సంవ్యానం కరేణ
హరౌ పరం పరిహరతి సతి
సరసలోచననాంచల వివశతయా
తరుణ్యాం చైతన్యం నాస్తి ॥అహెూ॥

**7.**సురతాంత శ్రమ సుఖం కింవా
వరలజ్జా సావా కావా
పరవశతను వైభవం కింవా
నిరతాం తయో నికృతిం నాస్తి ॥అహెూ॥

**8.**పరిమళ భరిత ప్రచుర సుశీతల
వరమృదువాయౌ వాతి సతి
తిరు వేంకట గిరి దేవ రాధయో
స్సరసరతి సుఖశ్రాంతిర్నాస్తి ॥అహెూ॥

ఆహా ! రాధా కృష్ణుల ఈ శృంగార విహారానికి సహజమైన ఓటమి వలన సందేహము లేదు.

1. యమునా నది ఒడ్డులో పూల తీగలతో కూడిన పొదరింటిలో, స్వచ్ఛమైన అనేక విధములైన ఇసుక తిన్నెల స్థలాలలో రాధా కృష్ణులు రమిస్తున్నారు. వారి ఆనందము కంటే ఇంకొక దివ్యానందము లేదు.

2. రాత్రేమిటి? పగలేమిటి? విడుచుట ఏమిటి? కొలుచుట ఏమిటి? విజయమేమిటి? అపజయమేమిటి? రెండు భుజాలు కలుసుకొన్నట్లుగా కూడా–ఆ కౌగిలి – లేదు. (ఏకత్వం ప్రస్ఫుటమవుతోందని భావం)

3. రతి బంధాలలో మొలనూలి పేటలు తెగిపోయి నడుముకు చుట్టుకొన్న వస్త్రము మీద మెరుస్తున్నాయి. గర్వాన్ని దూరం చేసుకొంటూ వాటిని సర్దుకోవటం నాయిక చరిత్రలో లేదు. (అంటే తెగిపోయిన మొలనూలి గంటలను సర్దుకొని మళ్లీ చుట్టుకొనేటంత సమయం లేదని భావం)

4. ఎప్పుడు కలుస్తున్నారో తెలియదు. ఎప్పుడు కలవకుండా ఉంటున్నారో తెలియదు. నువ్వని కాని, నేనని కాని భావాలు లేవు. వారిద్దరూ మాట్లాడుకొంటుంటే అది సంవాదమో, లేక సరసమో తెలియదు. క్షమాపణ చెప్పుకొనే మాట కాని, క్రియ కాని లేదు.

5. మొదటి దేవుడయిన వేంకటేశ్వరుని యొక్క (కృష్ణుని యొక్క) పట్టుబట్టలు రతి శ్రమలో అలసిపోయిన చెమటతో నిండాయి. కుంకుమ జలం నిండిన ఆ చెమట పరిమళించింది. అటువంటి వాసనతో నిండిన కౌగిట్లో ఉన్న ఆ రాధ సిగ్గుతో, అలసటతో ఏ మాట మాట్లాడటం లేదు.

6. స్తనముల మీది పైటను శ్రీకృష్ణుడు తన చేతులతో తొలగిస్తుండగా, సరసవతియై, కన్నుల చివర ఉబికి వస్తున్న పారవశ్యంతో రాధలో స్పృహ లేదు.

7. సంభోగం చివర్లో వచ్చిన శ్రమ సుఖం వల్లనా! చక్కటి సిగ్గు వలన వచ్చిన ఆరాధన వల్లనా! పరవశించిన శరీర వైభవం వల్లనా! ఏమో! ఎప్పుడూ ఆ రాధాకృష్ణుల నడుమ మోసము లేదు.

8. పరిమళముతో కూడిన పిల్లగాలులు బాగా వీస్తున్నాయి. ఆ రాధా కృష్ణులకు (అలమేలుమంగా వేంకటేశ్వరులకు) సరసమైన సంభోగ సుఖం వల్ల శ్రమ లేదు.

**విశేషాలు :**

1. నాస్తి (ఏమీ లేదు) పదంతో అన్నమయ్య కట్టిన అందమైన అష్టపది ఇది. ప్రతి చరణం చివర నాస్తి మళ్ళీ, మళ్లీ వస్తుంటుంది. తీగ లాగితే డొంకంతా కదులుతుందన్నట్లు ఈ నాస్తి పదంతో ఆ చరణం అర్థం అంతా వస్తుంటుంది. ఉదాహరణకు పల్లవి తీసుకొందాం...

లేదు. ఏమి లేదు? సందేహం లేదు. ఏ రకమైన సందేహం లేదు? సహజమైన ఓటమి వలన సందేహము లేదు. సహజమైన ఓటమి వలన ఎవరికి సందేహము లేదు? రాధా కృష్ణుల శృంగార విహారానికి. సహజమైన ఓటమి వలన సందేహము లేదు. సహజమైన ఓటమి అంటే? ఎప్పుడైన ఒక యుద్ధం జరుగుతుంటే ఒకరికి గెలుపు, ఇంకొకరికి ఓటమి తప్పదు. ఈ ఓటమినే సహజమైన ఓటమి అంటారు. ఏయుద్ధంలోనైనా గెలుపు ఓటమి అని రెండు ఉంటాయి. కాని ప్రేయసీ ప్రియులు చేసుకొనే శృంగార యుద్ధంలో గెలుపొక్కటే ఉంటుంది. శృంగారంలో ఇద్దరూ గెలుస్తారు. ఒకరు గెలిచి, ఇంకొకరు ఓడిపోవటమంటూ ఉండదు. అందుకే అన్నమయ్య సొగసుగా రాధాకృష్ణుల శృంగార విహారానికి సహజమైన ఓటమి వలన సందేహము లేదు అన్నాడు. యుద్ధాన్ని ఆ మహానుభావుడు 'విహారము' అన్నాడు.

2. ఇది మధుర భక్తి. జీవాత్మ, పరమాత్మల క్రీడ. జీవాత్మ కు రాధ అని, పరమాత్మకు కృష్ణుడు అని పేరు. జీవాత్మ పరమాత్మతో కలిసిమురిసిపోతుంది. సాఫల్యత పొందుతుంది. ఈ కలవటాన్నే కవి ఇక్కడ సంభోగం అంటున్నాడు. శృంగార పదాల చాటున ఆధ్యాత్మికత ఎందుకు? విషయం సూటిగానే చెప్పవచ్చు కదా! రుచితో భోజనం అలవాటు పిల్లవానికి ఏర్పరుస్తాము. కొంచెం కొంచెం రుచి అలవాటు చేస్తే నెమ్మదిగా వాడు తిన్నది అరిగించుకొనే స్థాయికి చేరుకొంటాడు. శృంగారపు రుచితో మొదలయిన ఆధ్యాత్మిక ప్రయాణం లక్ష్యం వైపు సరిగా ప్రయాణం చేస్తుంది. శృంగారంలో కలిగినంత తాదాత్మ్యత మరి ఏ ఇతర రసాలలోనూ కలగటం కష్టం. జీవాత్మ పరమాత్మల ఐక్యానుసంధానానికి పడే తాపత్రయంలో ఈ తాదాత్మ్యత చాలా అవసరం. అందుకే జయదేవుడు, అన్నమయ్య మొదలైన సంకీర్తనాచార్యులు శృంగారపు రుచిలో తాదాత్మ్యత అలవాటు చేసి జీవునికి తమ కీర్తనల ద్వార మోక్ష సోపానాలు ఏర్పాటు చేసారు. ఇష్టమైన శృంగార మార్గంలో క్రమక్రమంగా అసలు సంగతిని తెలుసుకొనే ప్రయాణంలో చదువరి ప్రయత్నించాలి. లేదూ! స్తనాల దగ్గరే ఆగిపోతే వాడికి ఆ భక్త కవులు ఆ స్తన వర్ణనలలో పారమార్థికంగా సంకేతించిన ద్వంద్వాలు

(కష్టసుఖాలు, కలిమిలేములు, ఆశనిరాశలు, రాగద్వేషాలు, వెలుగునీడలు) తెలియవు. వాటిని అధిగమించాలనే ప్రయత్నాలు తెలియవు. అన్నమయ్య శృంగార కీర్తనల వెలుగులో ద్వంద్వాతీతమైన ఏక స్థితి ప్రయాణం జరగాలి.



## *7. ఆదిదేవ పరమాతుమా (1-289)*

**ఆదిదేవ పరమాతుమా**
**వేదవేదాంతవేద్య నమో నమో**

**1.పరాత్పరా భక్త భవ భంజనా**
**చరాచర లోకజనక నమోనమో ॥ఆది॥**

**2.గదాధరా వేంకటగిరి నిలయా**
**సదానంద ప్రసన్న నమో నమో ॥ఆది॥**

**తాత్పర్యము :** మొదటి దేవుడు, పరమాత్ముడు, వేద వేదాంతములచే తెలియబడే వేంకటేశ్వరా! నమస్కారము.

1.శ్రేష్ఠులకందరికి శ్రేష్ఠుడా! పుట్టుక లేకుండా చేయువాడా!
కదిలే, కదలని జీవులందరికీ తండ్రిలాంటి వాడా! నమస్కారము

2.గదను ధరించినవాడా ! వేంకటాచలములో నివసించువాడా !
నిరంతరము ఆనందముగా ఉండేవాడా !నిర్మలుడా ! నమస్కారము

**విశేషాలు :**

పరమాతుమా

అన్నమయ్య ఆత్మని ఆతుమ అంటాడు. ఈ పదాన్ని అనేకులు అనేక రకాలుగా చెప్పారు. అందులో కొన్ని : 1. స్వయం ప్రకాశం కలిగి, జ్ఞానరూపమైన ఆత్మ. 2. కార్యకారణాలకంటే భిన్నమై, క్షరాక్షరాల కంటే కూడావేరుదై, స్వాభావికంగా నిత్యమై, శుద్ధమై, బుద్ధమై, ముక్తమైన పదార్థం. 3. అవిద్య వల్ల ఆత్మగా తలచిన దేహం మొదలు బుద్ధివరకు ఉన్న తత్త్వాలకు అతీతమైనది. సర్వోత్కృష్టమైనదీ, ఉపద్రష్టృత్వాది విశేషణ విశిష్టమై ప్రకాశించే ఆత్మ. 4. ఆత్మగా కల్పితాలైన పంచ కోశాలకు, విరాట్, హిరణ్య గర్భ, అవ్యాకృత తత్త్వాలకు అతీతమై, బ్రహ్మకు పూర్వం నుంచి ఉన్న పదార్థం. 5. సమస్త భూతాలలోని ప్రత్యక్చేతనం. 6. మాయాశక్తికి ఆశ్రయం. 7. సర్వానికి అధిష్ఠానమైనది. 8. పర దేవత. 9. దైవం / పరబ్రహ్మం.



## *8. ఆనంద నిలయ ప్రహ్లాద వరదా (03-502)*

**ఆనంద నిలయ ప్రహ్లాద వరదా**
**భాను శశి నేత్ర జయ ప్రహ్లాద వరదా ॥పల్లవి॥**

**1.పరమ పురుష నిత్య ప్రహ్లాద వరదా**
**హరి యచ్యుతానంత ప్రహ్లాద వరదా**
**పరిపూర్ణ గోవింద ప్రహ్లాద వరదా**
**భరిత కల్యాణ గుణ ప్రహ్లాద వరదా ॥ఆనం॥**

**2.భవరోగ సంహరణ ప్రహ్లాద వరదా**
**అవిరళకేశవ ప్రహ్లాద వరదా**
**పవమాననుత కీర్తి ప్రహ్లాద వరదా**
**భవ పితామహవంద్య ప్రహ్లాద వరదా ॥ఆనం॥**

**3.బలయుక్త నరసింహ ప్రహ్లాద వరదా**
**లలిత శ్రీ వేంకటాద్రి ప్రహ్లాద వరదా**
**ఫలిత కరుణా రస ప్రహ్లాద వరదా**
**బలివంశ కారణ ప్రహ్లాద వరదా ॥ఆనం॥**

**తాత్పర్యము :**

ఆనంద నిలయములో ఉండేవాడా! సూర్యుడు, చంద్రుడుకన్నులుగా కలవాడా! నువ్వు జయింపుము. శ్రేష్ఠమైన దైవమా! ఎల్లపుడూ ఉండేవాడా!

1. పాపాలను హరించేవాడా! విష్ణుమూర్తీ! అంతము లేనివాడా! పరిపూర్ణుడా! శ్రీకృష్ణుడా! శుభమైన గుణములతో ప్రకాశించేవాడా! ప్రహ్లాదునికి వరములిచ్చిన వాడా! నీకు జయము!

2. సంసారమనెడి రోగమును నశింపచేసే వాడా! దట్టమైన (గంభీరమైన వాడా!) మంచి వెంట్రుకలు కలిగిన వాడా! వాయుదేవుని చేత పొగడబడిన కీర్తి కలిగిన వాడా! శివుడు, బ్రహ్మ మొదలైన వారి చేత నమస్కరింపదగిన వాడా! ప్రహ్లాదునికి వరములిచ్చిన వాడా! నీకు జయము!

3. బలముతో కూడుకొన్న వాడా! నరసింహుడా! మనోహరమైన వేంకటాద్రిలో ఉండేవాడా! దయ రసము ఫలించుటకు కేంద్రమైన వాడా! ప్రహ్లాదుడు మొదలైన వారున్న బలివంశము పెరుగుటకు కారణమైన వాడా! ప్రహ్లాదునికి వరములిచ్చిన వాడా! నీకు జయము!

**విశేషాలు :**

**ఆనందనిలయా**

స్వామి వారు ఉన్న గర్భాలయానికి ఆనందనిలయమని పేరు. ఈ ఆలయం ద్వారా

అందరూ అనందాన్ని పొందుతుంటారు కనుక దీనికి ఆనంద నిలయము. అందులో ఉండే వాడు కనుక అన్నమయ్య స్వామిని ఆనంద నిలయా అన్నాడు.

**ప్రహ్లాదవరదా**

ఇందులో ప్రహ్లాద వరదుడా అని సంబోధన 12 సార్లు మళ్లీ మళ్లీ వస్తుంది. ప్రహ్లాదుడు అంటే భక్త కవులకు చాల ఇష్టం.

1.పోతన గారు ప్రహ్లాదుని గురించి చెప్పిన ఈ పద్యము చాలా ప్రసిద్ధమైనది.

తన యందు నఖిల భూతము లందు నొకభంగి/ సమహితత్వంబున
జరుగువాడు; పెద్దలబొడగన్న భృత్యునికైవడి/జేరి నమస్కృతుల్ చేయువాడు;
కన్నుదోయికి నన్యకాంత లడ్డం బైన/ మాతృభావము జేసి మరలువాడు;
తల్లిదండ్రుల భంగి ధర్మవత్సలతను/ దీనులఁ గావజింతించువాడు
సఖుల యెడ సోదరస్థితి జరుపువాడు;
దైవతము లంచు గురువులఁ దలఁచువాడు
లీల లందును బొంకులు లేనివాడు;
లలితమర్యాదుఁ డైన ప్రహ్లాదుడధిప! (పోతన భాగవతం-7-115-సీ)

తనయందు, ఎల్ల ప్రాణులయందు ఒకే విధముగ సమత్వభావముతో మెలగువాడు; పెద్దలను చూస్తే సేవకుని వలె దగ్గరకు వెళ్ళి నమస్కారములు చేసెడివాడు; ఇతరస్త్రీలు ఎదురుపడితే తల్లి యను భావముతో మెలిగే వాడు; తల్లిదండ్రులవలె న్యాయబుద్ధితో బీదలను కాపాడాలని భావించే వాడు; స్నేహితులయందు తోడబుట్టినవాడివలె ఉండేవాడు; దేవుళ్ళు అంటూ గురువులను భావించేవాడు; ఆటలలో అయినా అబద్ధాలు చెప్పనే చెప్పనివాడు; చక్కటి మర్యాదగలవాడు ప్రహ్లాదుడు.

2. త్యాగరాజస్వామి రచించిన మూడు నృత్యనాటికల్లో ప్రహ్లాద భక్తి విజయం చాలా పేరు పొందింది. ఇందులో ఎక్కడా నరసింహ స్వామి ప్రస్తావన కనిపించక పోయినప్పటికీ 45 కీర్తనలున్న ఈ నాటిక 'ఆనందమానందమాయెను.' (త్యాగరాజ కృతి) .

3. శ్రీ కృష్ణుని వర్ణిస్తూ 'ప్రహ్లాద పరాశర పరిపాలీ (క్రీడతి వనమాలీ)' అని సదాశివ బ్రహ్మేంద్రులు ప్రహ్లాదుని ప్రముఖంగా పేర్కొన్నారు.

4. ఋణవిమోచన నృసింహస్తోత్రంలో "ప్రహ్లాద వరదం శ్రీశం, దైత్యేశ్వరం విదారిణం' అని ఉంది.

5. తన ఇతర తెలుగు కీర్తనల్లో కూడా అన్నమయ్య ఈ ప్రహ్లాద వరద సంబోధన ఉపయోగించాడు.

'ఔనయ్య జాణడువు ప్రహ్లాద వరద । ఆసలు వెట్టకుము ప్రహ్లాదవరద ।'

6. హిరణ్యకశిపుని సంహరించిన తరువాత ప్రహ్లాదుని ఏదైనా వరం కోరుకొమ్మన్నాడు నరసింహ స్వామి. 'నన్ను అనేకమంది అనేక కోరికలు కోరుతుంటారు. నువ్వు కూడా ఏదైనా కోరుకో' అని స్వామి అంటే ప్రహ్లాదుడు ఇలా రెండు వరాలు కోరుకొన్నాడు. 1. కోరికలు వృద్ధి పొందని వరాన్ని ప్రసాదించు, 2. నా తండ్రి హిరణ్యకశిపుడు పవిత్రుడు అయ్యే వరం ప్రసాదించు. నరసింహుడు ప్రహ్లాదునికి ఆ వరాలు ప్రసాదించాడు. ప్రహ్లాదునికి వరాలు ఇచ్చిన ప్రహ్లాద వరదుని అన్నమయ్య ఈ కీర్తనలో పొగుడుతున్నాడు.

### గోవింద

గోవిందుడంటే కృష్ణుడు. కాని, ఆ పేరు రావడానికి కారణం ఇది - ఇంద్రునికి కోపం వచ్చి గోగణాల వీరీద శిలలతో కూడిన పెద్ద వర్షాన్ని కురిపిస్తే కృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని ఎత్తి దాని కింద గోగణాలకు ఆశ్రయం కల్పించాడు. ఇంద్రుడు కృష్ణుడి శక్తిని తెలుసుకొని, అతడితో స్నేహాన్ని కోరి, గోగణాలకు కృష్ణుడిని అధిపతి కావించాడు. అప్పటి నుంచి కృష్ణుడు గోవిందుడైనాడనీ కథ.



## *9. ఆదిపురుషా అఖిలాంతరంగా (04-37)*

**ఆదిపురుషా అఖిలాంతరంగా**
**భూదేవతా రమణ భోగీంద్రశయనా**

**1.భవపాథోనిధి బాడబానల**
**భవజీమూత ప్రభంజనా**
**భవపర్వత ప్రళయ భయదనిర్ఘాత**
**దుర్భవ కాలకూటభవ బహువిశ్వరూప ॥ఆది॥**

**2.భవఘోరతిమిరదుర్భవకాలమార్తాండ**
**భవభద్రమాతంగపంచానన**
**భవ కమల భవ మాధవరూప శేషాద్రి**
**భవన వేంకటనాథ భవరోగవైద్య ॥ఆది॥**

ఈ ప్రపంచానికి మూలమైన వాడా! అందరి మనస్సులలోను ఉండేవాడా! భూదేవతకు ఇష్టమైన వాడా! ఆదిశేషునిపై శయనించువాడా! నీకు నమస్కారము.

1. సంసారమను సముద్రమును హరించు బడబానలమా ! సంసారమనే మహా మేఘాన్ని తరిమికొట్టే జంఝూనిలమా ! సంసార పర్వతానికి ప్రళయముతో సమానమైన

వజ్రాయుధమా! దుర్భరమైన సంసారమనే కాలకూట విషాన్ని హరించే పరమ శివుడా! అనేకమైన విశ్వ రూపములు కలిగిన వాడా!

2. సంసారము అనే భయంకరమైన చీకటిని నాశనం చేసే భరించలేని ప్రళయ కాలములోని సూర్యుని లాంటి వాడా! ( విష్ణు మూర్తి ప్రళయ కాలములోని సూర్యుని వలె వెలుగుతూ ఈ సంసారమనే కష్టాల చీకటిని నశింప చేస్తాడని భావం) సంసారమనే భద్ర జాతి ఏనుగుకు సింహములాంటి వాడా! ( ఏనుగును సింహము చంపినట్లుగా ఈ సంసారమనే ఏనుగును విష్ణుమూర్తి అనే సింహము నశింప చేస్తుందని భావం ) శివుడు, బ్రహ్మ, విష్ణు స్వరూపములు కలిగిన వాడా! శేషాచలమును నివాసముగా కలిగిన వాడా! సంసారమనే రోగానికి వైద్యునిలాంటి వాడా! వేంకటేశ్వరా! నీకు నమస్కారము.

**విశేషములు :**

**1. భవపాథోనిధి బడబానల**

వాడబము మొదలైన ఇతర పేర్లున్న ఈ బడబాగ్ని యొక్క అసలు కథ శివ మహా పురాణములో ఇలా ఉంది. శంభుని మూడవ కంటిలోనుంచి పుట్టిన అగ్ని, మన్మథుని కాల్చి వేసి, అంతటా వ్యాపించటం మొదలుపెట్టింది. ముల్లోకాలను తగులబెట్టే ఆ క్రోధమనే అగ్నిని, బ్రహ్మ సౌమ్యమైన జ్వాలలు వెదజల్లు ముఖము గల బడబా (గుర్రము) అగ్నిగా మార్చివేసాడు. లోకముల మేలు ఆశించి ఆ బడబాగ్నిని తీసుకొని సముద్రము వద్దకు వెళ్లాడు. "ఈ అగ్నికి నీ నీరు నిత్యము భోజనమవుతుంటుంది. ఈ అగ్ని నీ గర్భములోకి వెళ్లకుండునట్లు నీవు ప్రయత్న పూర్వకముగా ధరించు" అని చెప్పాడు. సముద్రుడు అంగీకరించాడు. (శివ మహాపురాణములో రుద్ర సంహితలోని పార్వతీ ఖండములో బడబాగ్ని చరితమనే ఇరవై అధ్యాయము) బడబాగ్ని సముద్రములోని నీటిని హరించునట్లుగా ఈ సంసార సముద్రమును నువ్వు ఇంకింప చేయమని "భవపాథోనిధి బడబానల" అను సంబోధనలోని అర్థం.

**2. భవజీమూత ప్రభంజనా**

ఇటువంటి సంబోధనే భాగవతంలో కూడా కనబడుతుంది. ప్రళయ ఝంఝా ప్రభంజన స్వామి నేను! సంసార జీమూత సంఘంబు విచ్చునే? చక్రి దాస్యప్రభంజనము లేక; (పెనుగాలి విసురు లేకుండా నల్లటి మబ్బుల గుంపులు విడిపోవు. అలాగే చక్రధారి విష్ణువు సేవ చేయకుండ సంసారబంధాలు పోవు) ఝుఞ్ఝా అంటే వానగాలి

అని సంస్కృత – తెలుగు నిఘంటువు (వావిళ్ల) 1943 చెబుతుంది. దీనినే జంఝా మారుతముగా, జీమూతముగా పిలుస్తారు.

### 3. భవపర్వత ప్రళయ భయదనిర్ఘాత

త్వష్ట అనే ప్రజాపతి వృత్రాసురుని సృష్టించాడు. వాడు రోజు రోజుకి నూరు బాణాల ఎత్తు పెరగసాగాడు. 'ఇంద్రుడు నీ అన్నను చంపాడు. నువ్వు ఇంద్రుణ్ణి చంపి, నా పగ చల్లార్చు. లోకంలోని ఏ లోహంతో చేసినదైనా, తడిదైనా, పొడిదైనా ఏ ఆయుధమూ నిన్నేమీ చేయలేదు' అని త్వష్ట చెప్పాడు. దేవతలను వృత్రాసురుడు హింసించుట మొదలుపెట్టాడు. ఇంద్రుడు బ్రహ్మ సలహాతో దేవతలతో దధీచి ఆశ్రమానికి వెళ్లి, ఆయన ఎముకలు ఇమ్మని అర్థించాడు. దధీచి ప్రాణాలు వదిలాడు. విశ్వకర్మ – దధీచి వెన్నెముకతో వజ్రాయుధాన్ని నిర్మించి, ఇంద్రుడికిచ్చాడు. ఆ వజ్రాయుధం కూడా వృత్రాసురుణ్ణి ఎదిరించలేకపోయింది. ఇంద్రుడు జగదంబను ప్రార్థించాడు. ఆమె మాటతో ఇంద్రుడు సముద్రతీరానికి వెళ్లి, సముద్రపు నురుగును వజ్రాయుధానికి పట్టించి ప్రయోగించాడు. లోహంతో చేయనిదీ, తడిదీ, పొడిదీ కాని ఆ ఆయుధంతో వృత్రాసురుడు చనిపోయాడు. ఈ సంసారము కూడా అటువంటిదే. దీనికి స్వామి నామస్మరణ వజ్రాయుధములాంటిదని అన్నమయ్య అభిప్రాయము.

### 4. దుర్భవ కాలకూట భవ

అన్నమయ్య ఇక్కడ విష్ణువును శివునిగా పిలుస్తున్నాడు. ఇద్దరి మధ్య భేదం లేదు. ఈ విషయాన్ని స్పష్టీకరించటానికి ఆ సంబోధన. కాళహస్తీశ్వర శతకంలో ఈ పద్యం ఈ సందర్భంలో స్మరింపదగినది.

వన్నెయేనుఁగు తోలుదుప్పటము బువ్వా కాలకూటంబు చే
గిన్నే కపాల ముగ్రమగు భోగే కంఠహారంబు మే
ల్నిన్నీలాగున నుంటయుండెలిసియు న్నీపాదపద్మంబు చే
ర్చెన్నారాయణుఁడెట్లు మానసముఁ దా శ్రీకాళహస్తీశ్వరా!

(ఓ శివా! ఏనుగు చర్మము నీ ఉత్తరీయము. కాలకూటం నీ ఆహారము. బ్రహ్మకపాలం నీ చేతి భిక్షాపాత్ర. పాము నీ కంఠహారం. ఇవన్నీ భయంకరాలు. నీవిలా ఉంటావని తెలిసికూడా శ్రీ మన్నారాయణుడు తన మనస్సును నీ పాదపద్మముల దగ్గరికి ఎలా చేర్చాడో తెలియుటలేదు.)

ఇద్దరూ ఒకటే. కాకపోతే ఒకసారి శివ భక్తునిగా విష్ణువుని, ఇంకొకసారి విష్ణు భక్తునిగా శివుని చెబుతుంటారు. పురాణాలను సమన్వయించుకోవాలి కాని సంక్లిష్ట పరుచుకోకూడదు. 'కింకాలకూటః కిము వా' అని తిక్కన గారు చూపిన హరిహరాద్వైతం (విష్ణువు, శివుడు ఒకటే) అందరికి శిరోధార్యం. ఆ బాటలోదే 'దుర్భవ కాలకూట భవ' అను అన్నమయ్య సంబోధన.

5. భవ ఘోరతిమిరదుర్భవ కాల మార్తాండ

చైతన్యము నశించిన బ్రహ్మాండాన్ని బ్రతికిస్తాడు కనుక సూర్యునికి మార్తాండుడు అని పేరు.

6. భవ భద్ర మాతంగ పంచానన

భద్ర జాతి ఏనుగును శుభకార్యాలలో వినియోగిస్తారు. 1. భద్రము, 2. మందము, 3. మృగము. అని మూడు రకాల ఏనుగులు ఉంటాయని శాస్త్రం చెబుతోంది. మతంగుడనే ఋషి వలన కలిగిన ఏనుగును మాతంగము అంటారు. వైశాఖపురాణంలో ఈ మాతంగ జన్మ వృతాంతం వస్తుంది. భూషణుడు అనేవాడు కిరాతకుకిచెప్పే వైశాఖమాహాత్మ్యం చెవిన పడి, ఈ మాతంగమనే ఏనుగు దేవతా మూర్తిగా మారుతుంది. ఆచార వ్యవహారాలు పాటించనందువలన తండ్రి మాతంగుడు ఏనుగుగా మారమని శపించాడని మాతంగము వివరిస్తుంది.



## *10. అయమేవ అయమేవ ఆదిపురుషో (4-313)*

**అయమేవ అయమేవ ఆదిపురుషో**
**జయకరం తమహం శరణం భజామి**

**1. అయమేవ ఖలుపురా అవనీధరస్తుసో**
**హ్యయమేవ వటదళాగ్రాధిశయనః**
**అయమేవ దశవిధైరవతార రూపైశ్చ**
**నయమార్గభువిరక్షణం కరోతి**

**2. అయమేవ సతతం శ్రియఃపతిర్దేవేషు**
**అయమేవ దుష్ట దైత్యాంతకస్తు**
**అయమేవ సకల భూతాంత రేష్వాక్రమ్య**
**ప్రియభక్త పోషణం ప్రీత్యా తోతి**

**3. అయమేవ శ్రీ వేంకటాద్రౌ విరాజతే**
**అయమేవ వరదోపి యాచకానాం**
**అయమేవ వేదవేదాంతైశ్చ సూచితో**
**హ్యయమేవ వైకుంఠాధీశ్వరస్తు**

**తాత్పర్యము :**

ఇతడే ఇతడే (ఈ మహావిష్ణువే) సృష్టిలో మొదటి పురుషుడు. జయాన్ని ఇచ్చే అతనిని నేను శరణు కోరుచున్నాను.

1. ఇతడే పూర్వం భూమిని మోసిన వాడు. ఇతడే మఱ్ఱి ఆకు మీద పడుకొన్నవాడు. ఇతడే దశావతారాలు ధరించి, నీతి మార్గములో భూమిని, ప్రజలను రక్షించుచున్నాడు.

2. ఇతడే ఎప్పుడు దేవతలలో లక్ష్మీపతి. ఇతడే దుష్టులైన రాక్షసులను అంతము చేసినవాడు. ఇతడే అన్ని రకాలైన జీవులలో అంతర్యామిగా ఉండి ప్రేమతో తన ప్రియ భక్తులను పోషించుచున్నాడు.

3. ఇతడే వేంకటాద్రి పర్వతంలో ప్రకాశించుచున్నాడు. ఇతడే యాచకులకు వరములిచ్చు శ్రేష్ఠుడు. ఇతడే వేద వేదాంతములలో సూచింపబడినవాడు. ఇతడే (ఈ మహావిష్ణువే) వైకుంఠానికి అధిపతి.

**విశేషాలు :**

**ఏవ**

ఏవ అంటే 'ఏ' అని తెలుగులో అర్థం. అయమేవ అంటే 'ఇతడే' అని అర్థం. అంటే ఆది పురుషుడని ఇంకొకరిని, ఇంకొకరిని చెప్పకు. శ్రీ మహావిష్ణువే ఆదిపురుషుడు; మిగతావాళ్లు కాదు అని చెప్పటానికి 'ఏవ' అని అన్నమయ్య వాడాడు. ఈ 'ఏవ' మీద ఒక అందమైన కథ ప్రచారంలో ఉంది. భవభూతి అనే కవి తన ఉత్తర రామ చరిత కావ్యాన్ని కాళిదాసు దగ్గర ఒక దూత ద్వారా వినిపించాడట. దూత వినిపిస్తున్నంతసేపు కాళిదాసు చదరంగం ఆడుతున్నాడట. తను పంపిన దూత తిరిగి రాగానే భవభూతి 'కాళిదాసు ఏమన్నాడు?' అని అడిగాడు. అంటే ఏమన్నా పొగిడాడేమో అని భవభూతి ఆతృత. "నేను కావ్యం వినిపిస్తున్నంతసేపు కాళిదాసు చదరంగం ఆడుతున్నారండి. ఆ ఆట మధ్యలో

'కిమపి కిమపి మందం మందమాసక్తి యోగా
దవిరళిత కపోలం జల్పతో రక్రమేణ
అశిథిల పరిరంభ వ్యాపృతైకైకదోష్ణో
రవిదిత గతయామా రాత్రి రేవం వ్యరం సీత్'

(రాముడు ఒక చేతితో సీతను, సీతయు ఒక చేతితో రాముని మాటి మాటికి

జారిపోనీయకుండా కౌగిలించుకొనుచున్నారు. ఒకరి చెక్కిలికి, మరొక చెక్కిలికి మధ్య దూరం లేకుండా పోయింది. మెల్లమెల్లగా వారు ఏమోమో మాటలాడుకొంటూనే ఉన్నారు. వారి మాటలు ముగియలేదు. రాత్రి ఈవిధంగా గడచిపోయింది.) అనేశ్లోకం వినిపిస్తున్నప్పుడు ఒక సేవకురాలు కాళిదాసుకి తమలపాకులు, వక్క, సున్నం తెచ్చి ఇచ్చింది. ఆయన వాటితో తాంబూలం వేసికొని, 'అబ్బ! సున్నం ఎక్కువయ్యింది! అన్నాడు, అంతే!' అంతకుమించి మీకావ్యం గురించి ఒక్క మాట అనలేదు" అని దూత జవాబిచ్చాడు. తను 'ఏవం' అని సున్న ఎక్కువ రాసానని, అందుకే కాళిదాసు సున్నం ఎక్కువయిందని అన్నాడని భవభూతి గ్రహించి, 'ఏవం' ను 'ఏవ' గా మార్చాడట. ఏవ అని మార్చటం వలన రాత్రియే గడిచిపోయింది అని అర్థం వచ్చింది. అంటే ఎలా గడిచిందో తెలియకుండా తెల్లవారింది అని అర్థం. ఏవం అంటే ఈ అద్భుతమైన అర్థం రాదు. ఏవ అంటేనే వస్తుంది.

బ్రహ్మర్షి పత్రిజీ సేవ అనే పదంలో స, ఏవ అని రెండు పదాలున్నాయని చమత్కరించారు. స అంటే అతడు లేక అది, ఏవ అంటే మాత్రమే. ( ఉన్నదంతా అతదు మాత్రమే) నేను అనేది లేకుండా చేసేదంతా సేవ. ఉన్నదంతా అతడే – ఆ దేవుడే అని భావించాలి. తమను తాము జీరో చేసుకోవాలి. ఇంత అర్థాన్ని సేవ అనే పదం ఇస్తుందని వారి భావన.

**జయాన్ని ఇచ్చే అతనిని నేను శరణు కోరుచున్నాను**

జయమంటే ఆధ్యాత్మిక విజయం. ఇంద్రియాలమీద విజయం. ఇంద్రియాలకు తాను లొంగకుండా, తను ఇంద్రియాలను లొంగదీసుకోవడం. ఈ విజయాన్ని ప్రసాదించేవాడు మహావిష్ణువు. అందుకని విజయాన్ని ఇచ్చే అతనిని శరణు కోరుచున్నాను అని అన్నమయ్య భావన.

**అవనీధర**

వరాహావతారంలో భూమిని విష్ణు మూర్తి ధరించాడు. అందుకే అవనీధరుడయ్యాడు. "ఓ విష్ణుమూర్తీ! వరాహావతారం ధరించి మహా భీకరాకారుడవై శరీరాన్ని విపరీతంగా పెంచి నీ ముట్టెతో ప్రళయసముద్రంలోని నీటిని పెళ్లగించినప్పుడు అందులోని నీళ్లు పైకి చిమ్మి వంపు తిరిగి మళ్లీ క్రిందపడుతున్నాయి. ఆ దృశ్యం ఎలా ఉందంటే, నువ్వు ప్రకృతియనే స్త్రీకి, బ్రహ్మాండమనే బంగారు ముక్కెరను అలంకరించినట్టు కనిపిస్తుంది" అని రాయలవారు వరహావతారాన్ని వర్ణించారు.

(ఆముక్త మాల్యద) ఈ రాయలవారి వర్ణనతో పోటీ పడేటట్లుగా 'తలకక నేలదవ్వేటి దొంగ' (వీడివొ యిదె వింతదొంగకీర్తన) 'కవగూడ గోరి భూకాంతముంగిటితలపు' (తలపులోపలి తలపు దైవ మితడు కీర్తన) అని వివిధ కీర్తనల్లో వరాహ స్వామిని వర్ణించిన అన్నమయ్య ఈ గీతంలో మాత్రం 'అవనీధర' అని సామాన్యంగా చెప్పాడు.

**శ్రియః పతి**

శ్రియః అంటే లక్ష్మీదేవి. ఆవిడకు భర్త శ్రియఃపతి. శ్రీ సూక్తమ్ లో 'యః శుచిః ప్రయతో ...(16 వ మంత్రం....)అని ఉన్నది. ఎవరైతే లక్ష్మీదేవి దయ కోసం ప్రార్థిస్తున్నారో వారుశుచిగా ఉండాలని చెప్పబడింది. శుచి అంటే బాహ్యాభ్యంతర శు చిః ఇంటా బయటా శరీరం, మన మనస్సు ఇవన్నీ శుభ్రం గా ఉండాలి. అటువంటి పవిత్రమైన మనస్సుతో కొలిచేవారిని లక్ష్మి అనుగ్రహిస్తుంది. అటువంటి వారిని లక్ష్మీనాథుడు కూడా అనుగ్రహిస్తాడు. ఈ అంతర్గత భావన శ్రియఃపతి శబ్ద ప్రయోగంలో ఉంది.

ఇతడే వేద వేదాంతములలో సూచింపబడినవాడు

దేనిచేత ధర్మాధర్మములను తెలుసుకొంటామో అది వేదము. ఇవి నాల్గు– ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, 1.ఋగ్వేదము:–, వేదము లన్నిటిలోను పురాతనమైనది, ధ్యానశ్లోకములు ఎక్కువ. 2.సామవేదము:– వేదమంత్రాలకు స్వరాలు కల్పించి గానరూపమును చూపు సంహిత. 3.యజుర్వేదము: – వైదిక తంత్రాలను గురించి చెప్పు సంహిత. 4.అధర్వణవేదము:– ఈ భూత ప్రేత మంత్రములతో చారిత్రక విషయములతో ఉన్న సంహిత.

వేదాలలో విష్ణువు

విష్ణువు, గాయత్రి మొదలయిన ఏడు ఛందస్సులతో భూమిపై పదవిన్యాసము చేసాడు. విష్ణువు పాదధూళితో ఈ సమస్త ప్రపంచం నిండి ఉంది. (ఋగ్వేదం 22వ సూక్తము 16 నుండి 21 వరకు ఉన్న మంత్రాలు) ఇలా వేదాలలో విష్ణువు సూచింపబడ్డాడు.

వేదాంతమునకే ఇంకొక పేరు ఉపనిషత్తు. మొత్తం 108 ఉపనిషత్తులు.

ఉపనిషత్తులు వేదాల చివరి భాగంలో ఉంటాయి గనుక వాటికి వేదాంతములని పేరు. అకారాది వర్ణ క్రమంలో 108 ఉపనిషత్తులు ఇవి.

కుండలీకరణములలో అవి ఏవేదములో ఉన్నాయో చెప్పబడ్డాయి. 1. అక్షమాలికోపనిషత్తు (ఋగ్వే), 2. అక్షి ఉపనిషత్తు(యజు), 3. అథర్వశిఖోపనిషత్తు (అథర్వ), 4. అథర్వశిరోపనిషత్తు (అథర్వ), 5. అద్వయతారకోపనిషత్తు (యజు), 6. అధ్యాత్మోపనిషత్తు (యజు), 7. అన్న పూర్ణోపనిషత్తు (అథ), 8. అమ అత బిందూపనిషత్తు (యజు), 9. అమ అతనాదో పనిషత్తు (యజు), 10. అరుణోపనిషత్తు (సామ), 11. అవధూతోపనిషత్తు (యజు), 12. అవ్యక్తోపనిషత్తు (సామ), 13. ఆత్మ బోధోపనిషత్తు (ఋగ్వే), 14. ఈశ ఉపనిషత్తు (యజు), 15. ఈశావాస్య ఉపనిషత్తు (యజు), 16. ఏకాక్షరోపనిషత్తు (యజు), 17. ఐతరేయోపనిషత్తు (ఋగ్వే), 18. కఠ రుద్రోపనిషత్తు (యజు), 19. కఠోపనిషత్తు (యజు), 20. కలిసంతరణ ఉపనిషత్తు (యజు), 21. కాలాగ్నిరుద్రో పనిషత్తు (యజు), 22. కుండినోపనిషత్తు (సామ), 23. క్షురికోపనిషత్తు (యజు), 24. క అష్ణో పనిషత్తు (అథర్వ), 25.కేనోపనిషత్తు (సామ), 26. కైవల్యోపనిషత్తు (యజు), 27. కౌషీతకీ బ్రాహ్మణ ఉపనిషత్తు (ఋగ్వే), 28. గణపతి ఉపనిషత్తు (అథ), 29. గరోపే నిషత్తు (యజు), 30. గారుడోపనిషత్తు (అథ), 31. గోపాల తాపస్యుపనిషత్తు (అథ), 32. ఛాందోగ్యోపనిషత్తు (సామ), 33. జాబా లోపనిషత్తు (యజు), 34. జాబాలి ఉ పనిషత్తు (సామ), 35. తారసారోపనిషత్తు (యజు), 36. త్రిపురాతాపస్యుపనిషత్తు (అథ), 37. త్రిపురోపనిషత్తు (ఋగ్వే), 38. త్రిశిఖ బ్రాహ్మణోపనిషత్తు (యజు), 39. తురీయాతీత అవధూత ఉపనిషత్తు (యజు), 40. తేజోబిందూపనిషత్తు (యజు), 41. తైత్తిరీయోపనిషత్తు (యజు), 42. దక్షిణామూర్తి ఉపనిషత్తు (యజు), 43. దత్తాత్రేయోపనిషత్తు (అథ), 44. దర్శనో పనిషత్తు (సామ), 45. దేవీ ఉపనిషత్తు (అథ), 46. ధ్యానబిందు ఉపనిషత్తు (యజు), 47.నాదబిందు ఉపనిషత్తు (ఋగ్వే), 48.నారద పరివ్రాజకోపనిషత్తు (అథ), 49.నారాయణోపనిషత్తు (యజు), 50.నిరాలంబోపనిషత్తు (యజు), 51.నిర్యాణోపనిషత్తు (ఋగ్వే), 52. న అసింహతాపసీయోపనిషత్తు (అథ), 53. పంచబ్రహ్మోపనిషత్తు (యజు), 54. పరబ్రహ్మోపనిషత్తు (అథ), 55. పరమ హంసపరివ్రాజకోపనిషత్తు (అథ), 56. పరమహంసోపనిషత్తు (యజు), 57.ప్రశ్నోపనిషత్తు (అథ), 58. పాశుపత బ్రహ్మోపనిషత్తు (అథ), 59. ప్రాణాగ్నిహోత్రో పనిషత్తు (యజు), 60. పైంగలోపనిషత్తు (యజు), 61. బహ్వనోపనిషత్తు (ఋగ్వే), 62. బృహత్ జాబాలోపనిషత్తు (అథ), 63. బృహదారణ్యకోపనిషత్తు (యజు), 64.బ్రహ్మోపనిషత్తు

(యజు), 65. బ్రహ్మవిద్యోపనిషత్తు (యజు), 66. బ్రహ్మ జాబాలోపనిషత్తు (ఎళీళీగ్వే), 67. భావనోపనిషత్తు (అథ), 68. భిక్షుకోపనిషత్తు (యజు), 69. మహానారాయణోపనిషత్తు (అథ), 70. మహావాక్యోపనిషత్తు (అథ), 71. మహోపనిషత్తు (సామ), 72. మండల బ్రాహ్మణోపనిషత్తు (యజు), 73. మంత్రకోపనిషత్తు (యజు), 74. మాండూక్యోపనిషత్తు (అథ), 75. ముక్తికోపనిషత్తు (యజు), 76. ముద్గలోపనిషత్తు (అథ), 77. ముండకోపనిషత్తు (అథ), 78. మైత్రాయుణ్యపనిషత్తు (యజు), 79. మైత్రేయోపనిషత్తు (యజు), 80. యాజ్ఞవల్క్యోపనిషత్తు (యజు), 81. యోగకుండలి ఉపనిషత్తు (యజు), 82. యోగచూడామణి ఉపనిషత్తు (సామ), 83. యోగతత్త్వోపనిషత్తు (యజు), 84. యోగశిఖోపనిషత్తు (యజు), 85. రామతాపసీయోపనిషత్తు (అథ), 86. రామరహస్యోపనిషత్తు (యజు), 87. రుద్రహృదయోపనిషత్తు (యజు), 88. రుద్రాక్షజాబాలోపనిషత్తు (సామ), 89. వజ్రసూచి ఉపనిషత్తు (సామ), 90. వరాహోపనిషత్తు (యజు), 91. వాసుదేవోపనిషత్తు (యజు), 92. శరభో పనిషత్తు (అథ), 93. శాట్యాయనీయో పనిషత్తు (యజు), 94. శాండిల్యోపనిషత్తు (అథ), 95. శారీరకోపనిషత్తు (యజు), 96. శుక రహస్యోపనిషత్తు (యజు), 97. శ్వేతాశ్వరోపనిషత్తు (యజు), 98. సంన్యాసోపనిషత్తు (యజు), 99. సర్వసారోపనిషత్తు (యజు), 100. స్కందోపనిషత్తు (యజు), 101. సరస్వతీ రహస్యోపనిషత్తు (యజు), 102. సావిత్రి ఉపనిషత్తు (సామ), 103. సీతోపనిషత్తు (అథ), 104. సుబాలో పనిషత్తు (యజు), 105. సూర్యోపనిషత్తు (ఋగ్వే), 106. సౌభాగ్య లక్ష్మి ఉపనిషత్తు (ఋగ్వే), 107. హయగ్రీవోపనిషత్తు (ఋగ్వే), 108. హంసోపనిషత్తు (యజు).

వీటిలో ఈశావాస్యము, కేనము, కఠవల్లి, ప్రశ్న, ముండకము, మాండూక్యము, తైత్తిరీయము, ఐతరేయము, ఛాందోగ్యము, బృహదారణ్యము అను పది ప్రసిద్ధమైన ఉపనిషత్తులు. వీటన్నింటిలోను పేర్లు మార్పుతో ఉన్నప్పటికి, అన్నీ శ్రీ మహావిష్ణువునే చెప్పాయని 'అయమేవ వేదవేదాంతైశ్చ సూచితో' అంటూ అన్నమయ్య తీర్మానం. అలాగే అంటూ ఈ గీతం చివరిలో చెప్పిన అస్తు (అగుగాక) అను పదాన్ని మనం కూడ పలుకుదాం.



## *11. ఏవం దర్శయసి హితమతిరివ (5-167)*

ఏవం దర్శయసి హితమతిరివ
కేవలంతే ప్రియసఖీవా తులసీ ॥పల్లవి॥

**1.** ఘటిత మృగమద మృత్తికా స్థాపకం
పటు శరీరే తే ప్రబలయతి
కుటిల తద్ఘన భార కుచవిలగ్నంవా
పిటర స్థలే మృత్త్రీతా తులసీ ॥ఏవం॥

**2.** లలిత నవ ఘర్మలీలా విలసనో
జ్జ్వలనం తవ తనుం వంచయతి
జల విమల కేలీవశా సతతం
అలిక ఘర్మాంచిత విహారా తులసీ ॥ఏవం॥

**3.** సరస నఖచంద్రలేశా స్తే సదా
పరమం లావణ్యం పాలయతి
తిరువేంకటేశ తత్కరుణా గుణా వా
వర రూప నవచంద్ర వదనా తులసీ ॥ఏవం॥

**తాత్పర్యం :**

అలమేలుమంగమ్మ విష్ణు మూర్తిని  ఒక దులుపు దులుపుతోంది ఈ కీర్తనలో.

ఓ వేంకటేశ్వరా! అరే! ఎంత అమాయకుడిలా, నాకు మేలు చేకూర్చేవాడిలా (= హితమతి) కనబడుతున్నావు. నాకు తెలుసులే. ఇది కేవలం నటన. నీకు అసలైన ప్రియ సఖి ఆ తులసీ దేవి.

1. ఆ తులసికి తిలకంగా మట్టి ఇష్టం. తమరికి కూడా మట్టితో తయారయిన కస్తూరి తిలకం ఎంతో ఇష్టం. భూమిని తవ్వే గునపానికి అంటుకొనే మట్టిని ఆవిడ గారు తన అందమైన, బరువైన స్తనములయందు పూసుకొంటే, తమరు మట్టితో తయారయిన కస్తూరిని ఒళ్లంతా రాసుకొన్నారు. (ఆవిడన్నా, ఆవిడ వాడకాలన్నా తమరికి బోలెడు ఇష్టం. అందుకే ఆవిడ ఒక్క చోట రాసుకొంటే తమరు రెచ్చిపోయి ఒళ్లంతా రాసుకొన్నారు.)

2. చెమట ఆరేటట్లుగా తులసిని నీ ఒంటి మీద వేస్తారు. నీకు చెమటను పోగొట్టటం తులసి ఉద్దేశం కాదయ్యా! నీకు చెమటను తగ్గించేటట్లుగా, ప్రకాశింపచేసేటట్లుగా నలుగురికి ఆమె కనబడుతున్నది. కాని అసలు కథ వేరు. ఆవిడ గారు స్వచ్ఛమైన జలక్రీడలలో ఆనందించి, తుమ్మెదల చెమట జలాలలో విహరించి వచ్చింది. నీకు చెమటను తగ్గించే మిషతో నిన్ను కౌగిలించుకొని ఆవిడగారు పరవశిస్తున్నారు. మీ ఇద్దరి మోసం నాకు అర్థం కాదనుకొన్నావా!

3. ఓ వేంకటేశ్వరా! కరుణా నిధీ! (ఆవిడ మీద మీకు ఎంత దయ తండ్రీ!) మనోహరమైన చంద్రునివంటి ముఖంతో వయ్యారాలు ఒలికిస్తూ, అందమైన రూపము కలిగిన ఆవిడగారు, తమరి ఒంటి మీద ఉన్న నఖ క్షతాలను నాకు కనబడనీయకుండా కప్పేస్తూ ఎంత చక్కగా తమరిని పరిపాలిస్తున్నది స్వామీ!

**విశేషాలు :**

1. తులసి అన్నా, అలమేలుమంగమ్మ అన్నా ఇద్దరూ ఒకటే. మరి ఈ తిరకాసు ఏమిటయ్యా....? అలమేలుమంగమ్మ తులసితో ఉన్నావని వేంకటేశ్వరుని నిలదీస్తోంది? దీని భావమేమి తిరుమలేశా? !

2. "ధారుణిపతికిని తలబాలో బహుదారారతునకు తలబాలో" అని ఒక కీర్తనలో తులసీదామునకు హరికి తలబాలో అని ఒక కీర్తనలో అన్నమయ్య స్వామిని తులసీ మాలలు కలవానిగా కొలిచాడు. ఆ కీర్తనలో తులసీమాలలు వేయించాడు. ఈ శృంగార కీర్తనలో తులసిని సవతిగా అలమేలుమంగమ్మతో చెప్పించాడు. రెండు చోట్లా స్వామికి తులసీ పూజే. కాకపోతే ఒకచోట శృంగారం. ఇంకొకచోటా తలబాల శృంగారం.

3. నదులన్నీ సముద్రంలో కలవడానికే అన్నట్లు, అన్నమయ్య ఎలా చెప్పినా అది స్వామి పూజే. కాకపోతే చెప్పటంలో దారులు మారుస్తుంటాడు. గమ్యం ఒకటే.



## *12. ఏవం శ్రుతిమత మిదమేవ (01-04)*

**ఏవం శ్రుతిమత మిదమేవ**
**తద్భావయితు మతఃపరం నాస్తి ॥పల్లవి॥**

**1.అతుల జన్మభోగాసక్తానాం**
**హితవైభవ సుఖ మిదమేవ**
**సతతం శ్రీ హరి సంకీర్తనం త-**
**ద్వ్యతి రిక్త సుఖం వక్తుం నాస్తి ॥ఏవం॥**

**2.బహుళ మరణ పరిభవ చిత్తానా-**
**మిహ పర సాధన మిద మేవ**
**అహిశయన మనోహర సేవాత**
**ద్విహరణం వినా విధిరపి నాస్తి ॥ఏవం॥**

**3.సంసార దురిత జాడ్యపరాణాం**
**హింసా విరహిత మిదమేవ**
**కంసాంతక వేంకటగిరిపతేః ప్ర-**
**శంసైవ పశ్చా దిహ నాస్తి ॥ఏవం॥**

**తాత్పర్యము :**

ఈ విధంగా (= ఏవం) బాగా పేరు పొందిన (= తత్) వేదమతము (= శ్రుతిమతం) ఇదే (= ఇదమేవ). భావించటానికి (= భావయితుం) ఇంతకంటే మేలయినది (= అతఃపరం) ఇంకొకటి లేదు.(= నాస్తి)

1. సాటిలేని జన్మ భోగములందు ప్రీతి కలిగిన వారికి, ఎప్పుడూ మేలును కలిగించే వైభవాలతో కూడిన సుఖము శ్రీ విష్ణు మూర్తి సంకీర్తన తప్పించి ఇంకొకటి ఇవ్వలేదు. దీనికంటే గొప్పదయిన ఇంకొక సుఖం ఉంటుందని చెప్పటానికి లేదు.

2. పలుమార్లు మరణమనే అవమానము పొందిన వారికి, ఇహ పరాలను సాధించే సాధనము శ్రీహరి సంకీర్తన. శేషునిపై శయనించిన విష్ణుమూర్తి యొక్క సేవ కంటె, ఇంకొక కర్తవ్యము లేదు.

3. ఈ సంసారము వలన ఏర్పడిన పాపమనే జాడ్యములో నిండా మునిగిపోయిన వారికి హింసనుంచి తప్పించేది శ్రీహరి సంకీర్తన. కంసుడిని చంపిన వేంకటేశ్వరుని సంకీర్తన (= ప్రశంసైవ) కంటె వెనకాముందు ఇంకొక లోకం లేదు.

**విశేషాలు :**

మహావిష్ణువును కీర్తించటం, పొగడటం చాలా గొప్ప మార్గమని వేదాలలో ప్రసిద్ధి. ఇంతకంటే గొప్ప మార్గము, వేదమతము ఇంకొకటి లేదని అన్నమయ్య పల్లవిలో దృఢంగా ప్రతిపాదిస్తున్నాడు. అన్నమయ్య కీర్తనలోని పల్లవి విత్తనమయితే, చరణాలు ఆ విత్తనంలోనుంచి మొలచిన రమణీయ కవితా వృక్షము యొక్క పుష్పఫలాలు.

ఈ విధంగా (= ఏవం) అని పల్లవి మొదలు. "ఏవిధంగా" అంటే చరణాలు చదవాలి. ఇంతకంటే మేలయినది ఇంకొకటి లేదు అంటాడు. అసలు నువ్వు చెప్పిన మేలయినది ఏది అంటే చరణాలలో జవాబు వెతుక్కోమంటాడు కవి. ఇదొక విశిష్టమైన శైలి. ఋగ్వేదంలో అనేక స్తోత్రాలు కనబడతాయి. ఋగ్వేదంలోని దశమ సూక్తంలో పురుష సూక్తంలో నారాయణుని మహిమ పురుష సూక్తంలో ఇలా విశేషంగా ప్రశంసింపబడింది.

ఓం సహస్రశీర్షా పురుషః । సహస్రాక్షః సహస్రపాత్ ।
స భూమిం విశ్వతో వ అత్వా । అత్యతిష్ఠద్దశాంగులమ్ ।
పురుష ఏవేదగ్ం సర్వమ్ । యద్భూతం యచ్చ భవ్యమ్ ।
ఉతామ అతత్వస్యేశానః । యదన్నేనాతిరోహతి ।

ఏతావానస్య మహిమా । అతో జ్యాయాగ్శ్చ పూరుషః ।
పాదోఽస్య విశ్వా భూతాని । త్రిపాదస్యామ అతం దివి ।

(భగవంతుడు అనేక తలలు కలవాడు, అనేక కన్నులు కలవాడు, వేలాది అనేక పాదాలు కలవాడు; భూమండలం అంతటా వ్యాపించి పది అంగుళాల హృదయ మందిరంలో అధిగమించి అలరారుతున్నాడు. ఇదివరకు ఏది ఉన్నదో, రాబోయేది అంతా భగవంతుడే. మరణం లేని గొప్ప స్థితికి అధిపతి ఆయనే. ఎందుకంటే ఆమహానుభావుడు ఈ జడ ప్రపంచాన్ని అతిక్రమించిన వాడు కాబట్టి. ఈ ప్రపంచంలో మనకు కనబడుతున్నదంతా విష్ణు మహిమే. ఆ విష్ణువు వీటికంటే శ్రేష్ఠుడు. పుట్టినవన్నీ ఆయనలో పావు భాగమే. మిగతా ముప్పాతిక భాగం నశించని ఆకాశములో ఉంది.) వేదంలో ఇలా స్వామి సంకీర్తన కనబడుతున్నది కనుక సంకీర్తన కంటె గొప్ప మార్గం లేదని అన్నమయ్య ప్రతిపాదన.

వైభవ సుఖ మిదమేవ

1. ఐశ్వర్యము, 2. ధైర్యము, 3. కీర్తి, 4. తేజస్సు, 5. జ్ఞానము, 6. వైరాగ్యము అను వాటిని షడ్విధ - ఐశ్వర్యములు అంటారు. (సంకేత పదకోశము (రవ్వా శ్రీహరి) 2002) 1. దాసీజనము, 2. భృత్యులు, 3. పుత్రులు, 4. మిత్రులు, 5. బంధువులు, 6. వాహనము, 7. ధనము, 8. ధాన్యము అనువాటిని అష్ట - ఐశ్వర్యములు అంటారు. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అను వాటిని అష్టైశ్వర్యములుగా కొందరు చెబుతారు. వీటన్నింటి కంటె స్వామివారి సంకీర్తన గొప్పదని, ఈ ఐశ్వర్యాలు ఇచ్చే సుఖం కంటే సంకీర్తన గొప్ప సుఖం ఇస్తుందని అన్నమయ్య బోధ. ఆ హితవు పాటించి తరిద్దాం.



## *13. కందర్ప జనక గరుడ గమన (04-05 అను)*

**కందర్పజనక గరుడ గమన**
**నందగోపాత్మజ నమో నమో**

**1.**వారిధిశయన వామన శ్రీధర
నారసింహ కృష్ణ నమో నమో
నీరజనాభ నిగమ గోచర
నారాయణ హరి నమో నమో ॥కంద॥

**2.**పరమపురుషా భవ విమోచన
వరద వసుధావధూవర
కరుణాకాంతా కాళిందీరమణ
నరసఖ శౌరీ నమో నమో ॥కంద॥

**3.దానవదమన దామోదర శశి**
**భానునయన బలభద్రానుజ**
**దీనరక్షక శ్రీ తిరు వేంకటేశ**
**నానా గుణమయ నమో నమో ॥కంద॥**

**తాత్పర్యము :**

మన్మథునికి తండ్రీ ! గరుత్ అంటే రెక్కలు. ఆ రెక్కలచేత ఎగిరేవాడు గరుడుడు. అతడు వాహనముగా కలవాడా! నంద గోపాలకుని కుమారుడా! నీకు నమస్కారము.

1.క్షీర సముద్రమునందు శయనించువాడా! వామనావతారమెత్తిన వాడా! నరసింహుడా! అన్నింటిని చేయువాడు, రాక్షసులను నలిపివేయువాడు, నల్లనివాడు కృష్ణుడు. ఇటువంటి అర్థాలున్న కృష్ణ పదాన్ని పేరుగా కలిగిన వాడా! నీకు నమస్కారము.

2. పరమాత్ముడా! సంసారము నుండి విముక్తి చేయువాడా! (= భవ విమోచన) వరములిచ్చువాడా! భూదేవికి ఇష్టమైన వాడా! (= వసుధావధూవర) భక్తులపై చూపించే కరుణతో మనోహరమైనవాడా! కృష్ణుని ఎనిమిదిమంది భార్యలలో ఒకభార్య కాళింది. ఆమెకు ఇష్టమైనవాడా! అర్జునుని స్నేహితుడా! పరాక్రమము కలిగినవాడా! నీకు నమస్కారము.

3. దనువనెడి స్త్రీవలన పుట్టిన వారు కనుక రాక్షసులకు దానవులని పేరు. వారిని అణచువాడా! యశోద బాల్యములో కృష్ణుని నడుమున త్రాడువేసి రోటితో కట్టింది కనుక స్వామికి దామోదరుడు అని పేరు. (దామము అంటే తాడు) దామోదరుడు అను పేరు కలవాడా! చంద్ర సూర్యులు కన్నులుగా కలిగిన వాడా! బలరాముని తమ్ముడా! దీనులను రక్షించు వాడా! అనేక గుణములు కలిగిన రూపము కలిగిన వాడా ! శ్రీ వేంకటేశ్వరా! నీకు నమస్కారము.



## *14. కరుణానిధిం గదాధరం (1-342)*

**కరుణానిధిం గదాధరం**
**శరణాగత వత్సలం భజే**

**1.శుక వరదం కౌస్తుభాభరణం**
**అకారణ ప్రియ మనేకదం**
**సకల రక్షకం జయాధికం సే**
**వక పాలక మేవం భజే ॥కరు॥**

**2.ఉరగశయనం మహోజ్జ్వలం తం**
**గరుడారూఢం కమనీయం**
**పరమపదేశం పరమం భవ్యం**
**హరిం దనుజ భయదం భజే ॥కరు॥**

**3.లంకా హరణం లక్ష్మీ రమణం**
**పంకజ సంభవ భవ ప్రియం**
**వేంకటేశం వేద నిలయంశు**
**భాంకం లోకమయం భజే ॥కరు॥**

**తాత్పర్యము :**

దయకు నిధివంటి వాడు, గదను ధరించిన వాడు, శరణు అన్నవారిని వాత్సల్యముతో రక్షించువాడయిన శ్రీ వేంకటేశుని సేవిస్తాను.

1. శుకమహర్షిని కరుణతో చూచినవాడు, కౌస్తుభమును ఆభరణముగా కలిగినవాడు, కారణము లేకుండానే భక్తులయందు ప్రేమ చూపించువాడు, అనేకమైన శుభాలను కలిగించేవాడు, అన్ని లోకాలను రక్షించేవాడు, ఎప్పుడూ విజయాలతో అధికునిగా ఉండేవాడు, తనను సేవించేవారిని పాలించేవాడయిన శ్రీ వేంకటేశుని ఇలా నామ స్మరణతో సేవిస్తాను.

2. ఆదిశేషునిపై శయనించినవాడు, గొప్పదైన ప్రకాశము కలవాడు, గరుత్మంతునిపైకి ఎక్కినవాడు, అందమైన వాడు, వైకుంఠము స్థానముగా కలవాడు (= వైకుంఠమునకు నాథుడు,) శ్రేష్ఠమైనవాడు, గొప్పవాడు, దానవులను భయపెట్టువాడయిన విష్ణు స్వరూపుడయిన శ్రీ వేంకటేశుని సేవిస్తాను.

3. రామావతారంలో లంకను హరించిన వాడు (జయించినవాడు), లక్ష్మీదేవికి ఇష్టమైన వాడు, పద్మములో పుట్టిన బ్రహ్మకు, శివునకు ఇష్టమైన వాడు, వేదాలకు నిలయుడు, శుభమైన గుర్తులు కలిగినవాడు, లోకములో అంతట నిండిన వాడు అయిన శ్రీవేంకటేశుని సేవిస్తాను.

**విశేషాలు :**

**వత్సలం**

వాత్సల్యము అంటే వత్సలభావము, పుత్రాదులయందు ఉండే స్నేహము.

తనను శరణు అన్నవారి పట్ల శ్రీ వేంకటేశునికి అంత అభిమానం ఉంటుందని అన్నమయ్య భావం.

**నిధిం**

ఒక అవసరము కోసం ప్రత్యేకముగా నిలువచేసిన ధనమును నిధి అంటారు. (ఏ అవసరం కోసం ఆనిధి ఉపయోగిస్తారో ఆపేరు దానికి పెడతారు. దయ అనుదానికి వేంకటేశుడు నిధి.) ఎవరైనా ఆనిధిని వాడుకోవచ్చు.

గదాధరం

విష్ణుమూర్తి గద కౌమోదకి. కుం భూమిం మోదయతి హర్షయతీతి కుమోదకో విష్ణు తస్యేయం కౌమోదకీ. భూమిని సంతోషింపజేయు విష్ణు సంబంధ మయినది కనుక ఆ గదకు కౌమోదకి అని పేరు వచ్చింది. శ్రీమహావిష్ణువు తన ఎడమ కింది చేతిలో గదను ధరించి ఉంటారు. భూతయోగి (పూదత్తాళ్వార్) అను ఆళ్వార్ కౌమోదకి అనే గద అంశంతో జన్మించాడని ప్రసిద్ధి. ఖాండవ వన దహన సమయంలో అగ్నిదేవుడు వరుణుని ప్రార్థించి కృష్ణునికి కౌమోదకి ఇప్పించాడని ప్రసిద్ధి.

కౌస్తుభా భరణం

విష్ణువక్షస్థలము నందలి మణి కౌస్తుభము. (వ్యు. కుస్తుభ = సముద్రమందు బుట్టినది.) విశ్వములోని విలువలకు, సంపదలకు కౌస్తుభము గుర్తు.

అకారణ ప్రియమ్

సాధారణంగా ప్రేమ చూపించటానికి ఒక కారణము ఉంటుంది. ఇంతకుముందు చేసిన మేలో, లేక భవిష్యత్తులో చేస్తాడనే ఆలోచనో.. ప్రేమకి కారణాలు. ప్రయోజనము లేకుండా మూర్ఖుడు కూడా ఏ పని చేయడని చెబుతారు. కాని భగవంతుని ప్రేమ కారణ రహితమైనదని అన్నమయ్య పొగుడుతున్నాడు. ఉద్యోగ పర్వంలో తన కారణ రహితమైన ప్రేమను స్వామి నిరూపించుకొన్న ఘట్టాన్ని గుర్తు చేసుకొందాం. శ్రీకృష్ణుడు రాయబారిగా వచ్చిన సందర్భంలో దుర్యోధనుడు భోజనమునకు పిలిచాడు. స్వామి నిరాకరించి ఇలా చెప్పాడు – "సంప్రీతి భోజ్యాన్యన్నాని, ఆపద్భోజ్యాని వా పునః । న చ సంప్రీయసే రాజన్ న చైవాపద్గతా వయమ్ ॥ (ఉద్యోగ పర్వం 91/25) భోజనము చేయటానికి రెండుకారణాలు. ప్రేమ గలచోట ఏది పెట్టినా అది తృప్తిగా ఉంటుంది. రెండవది ఆకలికి నకనకలాడే సమయంలో ఎదుటివాడు ఏ భావముతో పెట్టినా తినవచ్చు. ఇప్పుడు ఈ రెండు

కారణాలు మన మధ్య లేవు. మీలో నామీద ప్రేమ లేదు. నాకు ఆకలి లేదు." అని చెప్పాడు. ఇలా చెప్పినవాడు పిలువకుండా విదురుని ఇంటికి భోజనానికి వెళ్లాడు. అంటే స్వామికి తన భక్తుల విషయంలో కారణాలు అక్కరలేదు. భక్తులు కాని వారి విషయంలోనే కారణాలు. అందుకే అన్నమయ్య స్వామిని అకారణ ప్రియమ్మన్నాడు.



## *15. కరేణ కిం మాం గ అహీతుం తే (6-171)*

**కరేణ కిం మాం గ అహీతుం తే**
**హరే ఫణిశయ్యా సంభోగ ॥పల్లవి॥**

**1.జలే తవ సంచరణ మిహాధః**
**స్థలే భవనం తవ సంతతం**
**బలే రూప ప్రకటన మతులా**
**చలే స్థానం చల చల రమణా ॥కరేణ॥**

**2.పదే భువన ప్రామాణ్యం తవ**
**హ్రదే ప్రచురవిహరణ మిదం**
**ముదేమునీనాం మోహనం తనుం**
**మదే తవ నర్మ చ మాం విసృజ ॥కరేణ॥**

**3.స్మరే విజయ స్తవ విమలతురగ**
**ఖురే రతిసంకుల రచన**
**పురే తవ విస్ఫురణం వేంకట**
**గిరేఃపతే తే ఖేలాఘటిత ॥కరేణ॥**

**తాత్పర్యము :**

ఓ శేషతల్పము మీద హాయిగా సుఖాలనుభవించే హరీ! పెళ్లి చేసుకొన్నవాడివి ఇంటి పట్టున ఉండకుండా అనేకచోట్ల ఉన్నావు. అలాంటప్పుడు నువ్వు నా పాణి గ్రహణం చేయటం దేనికి?

1. ఇక్కడ నీటికింద తిరుగాడుతావు- (1.మత్స్యావతారం). ఎప్పుడూ నీటి కిందే భవనంలా ఉంటావు (2.కూర్మావతారం). బలంలో సాటిలేని రూప ప్రకటన చేస్తావు (3.వరాహావతారము). మనస్సును హరించినవాడా! పెద్ద స్థానంలో (స్తంభంలో) ఉండి పిలిచినప్పుడు చలిస్తావు (4.నరసింహావతారం).

2. నీ పాదం- ప్రపంచాన్ని కొలవ గల పెద్ద ప్రామాణ్యపు బద్ద(5. వామనావతారం). నెత్తుటి మడుగులో నీ వీర విహారం (6. పరశురామావతారం). మునులకు సంతోషం కలిగించే చక్కని శరీరాన్ని ధరించావు (7. శ్రీరామావతారం). నీ రహస్యము మొత్తం నీ మద్య సేవనంలో ఉందని నాకు తెలుసులేవయ్యా! నన్ను విడిచిపెట్టు (8.

బలరామావతారం).

3. త్రిపుర యువతుల మన్మథ స్మరణములో నీ విజయము ఉన్నది (9.బుద్ధావతారము). నీ స్వచ్ఛమైన గుఱ్రపు గిట్టలలో, అసక్తితో కూడిన నీ పురములో నీ ప్రకాశము కనబడుతోంది (10. కల్క్యావతారము).

శ్రీ వేంకట పతీ! ఇవి అన్నీ నీ లీలా విలాసాలు. నా చెయ్యి పట్టుకోవడం ఎందుకు?

**విశేషాలు :**

అన్నమయ్య దశావతార కీర్తన ఇది. ఒక నాయిక వేంకటేశ్వర స్వామిని ప్రశ్నిస్తున్నట్లుగా, గదమాయిస్తున్నట్లుగా అన్నమయ్య కీర్తన మొదలుపెట్టాడు. అన్నమయ్య దశావతారాల వర్ణనలు ప్రత్యేకంగా అధ్యయనం చేయదగినవి. ఒక చిన్న పదంలో, లేదా చిన్న వాక్యంలో ఆ అవతారం సారాంశం మొత్తం చెప్పేస్తాడు.

ఇక్కడ నీటికింద తిరుగాడు తావు– (1.మత్స్యావతారం)

నాలుగు వేదాలు దొంగిలించుకొని కొని వెళ్లి సముద్రం అడుగున దాక్కున్న సోమకాసురుడి నుంచి ఆ వేదాలను కాపాడేటందుకు మత్స్యావతారం వచ్చింది. సోమకాసురుడు ఉన్నది నీటి అడుగున. అందుకోసం అన్నమయ్య జలేఅథః (నీటికింద) అని ప్రయోగించి అవతారప్రయోజనం చెప్పాడు.

ఎప్పుడూ నీటి కిందే భవనంలా ఉంటావు (2.కూర్మావతారం).

కూర్మావతారం ఎత్తినప్పుడు తాబేలు లక్ష యోజనముల విస్తీర్ణములో ఉందని, భాగవతంలో ఉంది. యోజనమంటే సుమారుగా ఎనిమిది మైళ్లు. అందుకే కళ్లు తిరిగిపోయే వెడల్పుతో ఉన్న స్వామిని అన్నమయ్య భవనం (= ఇల్లు) అన్నాడు.

బలంలో సాటిలేని రూప ప్రకటన చేస్తావు (3.వరాహావతారము)

బ్రహ్మ ప్రళయ జలములో మునిగిన భూమిని గురించి ఆలోచిస్తుంటే, అకస్మాత్తుగా ముక్కునుండి బొటనవ్రేలు అకారమంత ఒక వరాహ శిశువు బయట పడ్డాడు. ఆయన చూస్తుండగానే అది పర్వతాకారముగా మారింది. వరాహస్వామి ఇలా తన రూపాన్ని ప్రకటించిన వైనాన్ని 'బలే రూప ప్రకటన మతులా' (బలంలో సాటిలేని రూప ప్రకటన చేస్తావు) అని అన్నమయ్య ప్రస్తుతించాడు.

పెద్ద స్థానంలో (స్తంభంలో) ఉండి పిలిచినప్పుడు చలిస్తావు(4.నరసింహావతారం)

స్థిరమై ఉన్నదానిని స్తంభమంటారు. అనేక సాధనల ద్వారా యోగ సంబంధమైన స్తంభాన్ని ఛేధిస్తే మన హృదయంలో నరసింహస్వామి జన్మిస్తాడని చెబుతారు. స్తంభాన్ని అన్నమయ్య 'స్థానం' అన్నాడు. దేనియందు ఉంటారో అది స్థానం. నరసింహ స్వామి ఉన్నాడు కనుక స్తంభాన్ని – స్థానముతో పోల్చటంలో ఔచిత్యముంది.

మునులకు సంతోషం కలిగించే చక్కని శరీరాన్ని ధరించావు (7.శ్రీ రామావతారం)

'పుంసాం మోహనరూపాయ' (పురుషులకు కూడా మోహము కలిగించేవాడు) అని వాల్మీకి రామాయణం. మహర్షులు కూడా అరణ్యంలో రామచంద్రమూర్తి వెళ్తూంటే ఆయనయొక్క రూపాన్ని చూసి మోహ పడ్డారట. అంత అందమైన రూపం రామచంద్రమూర్తిది. ఈ విషయాన్ని అన్నమయ్య ఈ పాదంలో ప్రస్తావించాడు.

రహస్యము మొత్తం .....( 8.బలరామావతారం)

మద్యానికి హలిప్రియ అనే పేరు బలరామునివల్లే వచ్చింది. హలి అంటే బలరాముడు. నాగలిని ఆయుధంగా ధరించినవాడు హలి. హలికి ఇష్టమైనది అనే అర్థంలో మద్యానికి 'హలిప్రియ' అనే పేరు వచ్చింది. ఉత్తర హరివంశం అనే ప్రబంధంలో నాచన సోమన బలరాముడిని శివునితో పోలుస్తూ హాలాహలము స్వీకరించాడని చెబుతాడు. (పాతాళాధిపుడైన...పద్యం) బలరాముడు హాల (మద్యం), హలము (నాగలి) స్వీకరించాడు. ఆ రెండింటిని కలిపి హాలాహలము బలరాముడు స్వీకరించాడని కవి చమత్కరించాడు. కాళిదాసు మేఘసందేశంలో బలరాముడి మద్యపాన విషయం ఇలా చెప్పాడు – బంధువుల మీద ప్రేమతో, యుద్ధానికి ఇష్టపడని బలరాముడు, సురను (మద్యం) విడిచి, సరస్వతీనదీజలాలను సేవించి, పవిత్రుడయ్యాడు. ఓ సౌమ్యమైన మేఘుమా! నువ్వు కూడా, ఆ సరస్వతీనది యొక్క నీళ్లను సేవించు. నీ అంతరాత్మ పరిశుద్ధం అవుతుంది. (అప్పుడు) రంగుచేత మాత్రమే నల్లనివాడవు అవుతావు. (హిత్వా హాలామభిమతరసాం 51వ శ్లోకం).

పూర్వం, కురు పాండవ యుద్ధంలో ఎవరి పక్షాన చేరడానికీ బలరాముడు ఇష్టపడక, తీర్థయాత్రలకు వెళ్లిపోయాడు. ఆ సమయంలో తనకు బాగా ఇష్టమైన మద్యాన్ని విడిచి పరమపవిత్రమయిన సరస్వతీ నదీ నీటిని తాగి పరిశుద్ధుడయ్యాడు. ఇలా మహాకవులందరూ వర్ణించిన మద్యపాన ప్రియుడైన బలరాముని అన్నమయ్య 'నీ రహస్యము మొత్తం నీ మద్య సేవనంలో ఉందని నాకు తెలుసులేవయ్యా' అని వెక్కిరించాడు.

ఉపసంహారం

చెలికత్తె వేంకటేశుని ఆటపట్టిస్తున్నట్లుగా చెబుతూ ఈ దశావతారాలు వ్యంగ్యంగా చెప్పటం దేనికి? హాయిగా సూటిగా దశావతారాలు ఇవి అని చెప్పవచ్చు కదా! ఈ ప్రశ్నకి జవాబు ఉత్తమమైన అన్నమయ్య కవిత్వం. అన్నమయ్య కవిత్వంలోని వ్యంగ్యంలో ఆ తీపి, హాయి ఉంటాయి. సూటిగా చెబితే ఆ కమ్మదనం రాదు.



## *16. కింకరిష్యామి కింకరోమి*

ఇటు వాంఛలు వదులుకోలేక - అటు వేంకటేశుని కొలువలేక - మధ్యలో నలిగిపోయేవారి మనస్తత్వాన్ని అన్నమయ్య ఈ కీర్తనలో చిత్రిస్తున్నాడు. (కీర్తన సంఖ్య 01-265).

**కిం కరిష్యామి కిం కరోమి బహుళ**
**శంకా సమాధానజాడ్యం వహామి**

**1.నారాయణం జగన్నాథం త్రిలోకైక-**
**పారాయణం భక్తపావనం**
**దూరీకరోమ్యహం దురితదూరేణసం**
**సార సాగరమగ్న చంచలత్వేన**

**2.వేంకటాచలాధీశ్వరం కరి రాజ-**
**వరదం శరణాగత వత్సలం**
**పరమ పురుషం కృపాభరణం న భజామి**
**మరణ భయ దేహాభిమానం వహామి**

స్వామీ వేంకటేశా! నేనేమి చేయగలను? ఏమి చేసెదను? అంతా అయోమయంగా ఉంది. అనేక సందేహాలకు జవాబు దొరకటం లేదు. ఒక జడత్వం నన్ను ఆవరించుకొని ఉంది.

1. నారాయణుని, జగన్నాథుని, మూడు లోకాల వాళ్లు నిత్యము జపించే పవిత్రమైన పేరు కలిగిన వానిని భక్తులను పవిత్రము చేసేవాడిని నేను ఈ జన్మలో కూడా దూరము చేసుకొంటున్నాను. అనేక జన్మలలో నేను చేసుకొన్న నా పాపాల వలన స్వామికి, నాకు దూరము ఏర్పడింది. సంసారమనే సముద్రములో నా చంచల బుద్ధితో మునిగి పోవటమే దీనికి కారణము.

2. వేంకటాచలపతిని, గజేంద్రుని రక్షించినవానిని, శరణు అన్నవారిని ప్రేమతో కాపాడేవానిని, పరమపురుషుని, దయ ఆభరణముగా కలిగినవానిని నేను కొలుచుట లేదు. మరణ భయము ఉన్నప్పటికీ ఈ శరీరమునందు అభిమానాన్ని వదులుకోలేక పోతున్నాను.

**విశేషాలు :**

కరిష్యామి, కరోమి

అన్నమయ్య ఈ కీర్తన ప్రారంభంలో కరిష్యామి, కరోమి అను రెండు సంస్కృత క్రియలు (= ధాతువులు) వాడాడు. కరిష్యామి అనునది లృట్టునకు సంబంధించిన ధాతువు. కరోమి లట్టునకు సంబంధించిన ధాతువు. సంస్కృత ధాతువులలో భవిష్యత్తును రెండు రకాలుగా చెబుతారు. ఒకటి అనద్యతన భవిష్యత్తు (లుట్). ఇంకొకటి సామాన్య భవిష్యత్తు (లృట్). అనద్యతన భవిష్యత్తు నిశ్చయము కాదు. అనిశ్చితము. ఎప్పుడో జరుగుతుంది. ఎప్పుడు జరుగుతుందో చెప్పలేము. ఇది లుట్. ఇక రెండవది సామాన్య లేదా సాధారణ భవిష్యత్తు. దీనిని లృట్ అంటారు. అన్నమయ్య వాడిన కరిష్యామి లృట్ కు సంబంధించినది. అన్నమయ్య ఈ కీర్తనలో అల్లకల్లోలంగా ఉన్న సాధారణ మానవుని సందేహాల మనస్సును ఆవిష్కరించాడు. సామాన్య మానవుడు సుదీర్ఘమైన భవిష్యత్తును గురించి ఆలోచించడు. అయిదు సంవత్సరాల తర్వాత ఏమవుతుంది? తన భవిష్యత్తు అప్పుడు ఎలా ఉండబోతుంది? దానికి ఇప్పటినుంచి ఏమి చేయాలి? ఈ ఆలోచనలు సాధారణ మానవుడు చేయడు. అతనికి ఈ రోజు రేపు గడిస్తే చాలు. అన్నమయ్య కవిత్వం సాధారణ మానవునికి, స్వామికి మధ్య వంతెన. అందుకే సాధారణ భవిష్యత్తుకు సంబంధించిన 'కరిష్యామి' (ఏమి చేయబోతున్నాను) అన్నమయ్య వాడాడు. వర్తమానకాలానికి (లట్టునకు) సంబంధించిన 'కరోమి' (ఏమి చేస్తున్నాను) వాడాడు.

చంచల బుద్ధి, శారీరక అభిమానము

తను ఇలా చేయలేక పోతున్నానని ఆవేదనతో చెప్పిన విషయాలను వ్యతిరేకంగా తీసుకొని భక్తులు స్వామితో దగ్గరితనం పెంచుకోవాలని కవి ఆంతర్యం. చంచల బుద్ధి, శారీరక అభిమానము ఇలాంటివి వదులుకొంటే స్వామికి దగ్గరవుతామని కవి ప్రబోధం.



## *17. కిన్నజానేహం కేశవాత్పరమహో*

కేశవునికంటె వేరుగా ఇంకొకటి తనకు తెలియదని స్వామిపై ఉన్న తన ఏకాగ్ర భక్తిని అన్నమయ్య ఈ గీతంలో ఆవిష్కరిస్తున్నాడు. (కీర్తన సంఖ్య 02-083)

కిన్నజానేఽహం కేశవాత్పర మహో
సన్నుతిం కరోమి మహీభరణాయ తస్మై

1.వేదాంత వేద్యాయ విశ్వ రూపాయ నమో
ఆది మధ్యాంత రహితాధికాయ
భేదాయ పునరప్య భేదాయ నమో నమో
నాద ప్రియాయ మమ నాథాయ తస్మై

2.పరమ పురుషాయ భవబంధ హరణాయ నమో
నిరుపమానందాయ నిత్యాయ
దురితదూరాయ కలి దోష విధ్వస్తాయ
హరయేచ్యుతాయ మమ ఆత్మనే తస్మై

3. కాలాత్మకాయ నిజ కరుణాకరాయ నమో
శ్రీలలామాకుచాశ్రిత గుణాయ
హేలాంక శ్రీ వేంకటేశాయ నమో నమో
పాలితాఖిల మమాభరణాయ తస్మై

**తాత్పర్యము :**

కేశవునికంటె వేరయిన ఇంకొక విషయం నాకు తెలియదు. భూమిని భరించిన ఆ స్వామి కొరకు నేను ప్రార్థన చేస్తున్నాను.

1. ఉపనిషత్తులచేత తెలియదగినవానికొరకు, ప్రపంచమే తన రూపమయిన వానికొరకు, మొదలు, మధ్య, తుది లేని గొప్పవాడయిన వానికొరకు భేదస్వరూపము కలిగిన వానికి, మరియూ భేద స్వరూపము లేనివానికి నమస్సులు. నాద ప్రియుడైన, నా ప్రభువయిన విష్ణువు కొరకు ప్రార్థన చేస్తున్నాను.

2. పరమపురుషుడైన స్వామి కొరకు, సంసార బంధాలను తొలగించువానికొరకు నమస్సులు. పోలికలేని ఆనందస్వరూపునికొరకు, నిత్యుడైన వానికొరకు నమస్సులు. పాపములను తొలగించువానికొరకు, కలిదోషాలను పోగొట్టువానికొరకు నాశనములేని హరికొరకు, నా ఆత్మలో ఉన్న దేవునికొరకు నమస్సులు.

3. కాలస్వరూపుడైన స్వామి కొరకు, నిజమైన దయకు స్థానమైన వానికొరకు నమస్సులు లక్ష్మీదేవియొక్క కుచములను ఆశ్రయించే గుణము కలిగిన వానికొరకు నమస్సులు. విలాసములే గుర్తుగా కలిగిన శ్రీవేంకటేశునికి నమస్సులు. నమస్సులు. అన్నింటిని పరిపాలించుచు, నాకు ఆభరణమైన వాని కొరకు నమస్సులు.

**విశేషాలు :**

"ఇంకొకటి నాకు తెలియదయ్యా! నాకు తెలిసింది ఇదొక్కటే" అని తెలుగువారి

పలుకుబడిని స్వామివారికి ఈ కీర్తనలో అన్నమయ్య అన్వయించాడు. కేశవుడు తప్పించి ఇంకొకటి నాకు తెలియదనుటలో ఆ స్వామిపై అన్నమయ్యకున్న విశేష భక్తి తెలుస్తుంది. “అంత పెద్ద భూమినే భరించావు. నేను ఆ భూమితో పోలిస్తే ఎంతయ్యా! నన్ను, నాకష్ట సుఖాలను కూడా భరించి కాపాడవయ్యా” అనే భావం ‘మహీభరణాయ’ (= భూమిని భరించిన స్వామి) అను విశేషణంలో ధ్వనిస్తోంది.

దైవమొక్కటే. అదే వివిధరూపాలలో మనకు కనిపిస్తోంది. విష్ణువు, దుర్గ, శివుడు ఇలా అందరూ ఒక్కటే. ఇలా రకరకాల భేద రూపాలతో కొలిచినా ఉన్న ఆ ఒక్క దైవానికే ఆ పూజ చేరుతుంది. ఇష్ట దైవాన్ని కొలిచినా ఉన్న ఆ ఒక్క దైవానికే పూజ చేరుతుంది. ఇలా భేదస్వరూపము కలిగిన వానిని మరియూ భేద స్వరూపము లేనివానిని అన్నమయ్య ఈ కీర్తనలో వేంకటేశునిగా కొలిచాడు.

విద్యాఽవిద్యా స్వరూపిన్యైనమః – అని లలితా సహస్రనామంలోఒక పేరు. విద్య ఆమె, అవిద్యకూడా ఆమె. రెండు రూపాలలో ఉన్నది ఆ తల్లియే అని అర్థము. విద్య అంటే పరబ్రహ్మస్వరూపాన్ని తెలిపే జ్ఞానము, అవిద్య అంటే భేద భ్రాంతి రూప జ్ఞానము (సంసార బంధానికి గురిచేసే మాయ.) “విద్యాఽవిద్యేతి దేవ్యా ద్వే రూపే జానీహి పార్థివ, ఏకయా ముచ్యతే జంతు రస్యయా బద్ధ్యతే పునః” అని దేవీభాగవతం. అవిద్య ఉంటే సంసారబంధము, విద్య ఉంటే మోక్షము. భేదాయ పునరప్య భేదాయ నమో నమో అని అన్నమయ్య రెండు సార్లు నమో అన్నాడు. విద్యకి, అవిద్యకి నమస్కారము. అన్ని నువ్వేనయ్యా స్వామీ! నాలో అవిద్యనిపోగొట్టి, విద్యని ప్రసాదించమని స్వామికి నమస్కార పునరుక్తి చేయుటలో అంతరార్థం. అరణ్యంలో సింహగర్జన విని సాధుజంతువులు భయంతో పారిపోయినట్లు, భాగవత పఠనము వల్ల కలిదోషాలు నశించిపోతాయంటారు. భాగవత పఠనములాంటిదే కేశవ సంకీర్తన.

కలిదోషాలను గురించి పెద్దలు చెప్పే ఒక ఆసక్తి కరమైన కథ ఇది.

ద్వాపర యుగం చివరిలో కలియుగం ప్రవేశించే రోజులలో ఒక బ్రహ్మచారికి దాహం వేసింది. బ్రహ్మచారి చెరకురసం చేస్తున్న ఒక రైతును సమీపించి తన దాహం తీరడానికి చెరకు రసం అడిగాడు. రైతుకోరిక మన్నించాడు. బ్రహ్మచారి డబ్బులు ఇవ్వబోతే మనిషిగా అది తన ధర్మమని, ప్రతిఫలం ఆశించకూడదని రైతు చెప్పాడు.

ఇంటికి తిరిగి వచ్చిన బ్రహ్మచారి వెనుక నల్లగా లావుగా మీసాలతో ఉన్న

వ్యక్తి ఉన్నాడు. బ్రహ్మచారి తల్లి అతనెవరని కుమారుడిని అడిగింది. తనకు తెలియదని బ్రహ్మచారి చెప్పాడు. అప్పుడా వ్యక్తి బ్రహ్మచారి అసత్యం చెబుతున్నాడని, తన కల్లు పాకవద్ద తాగి డబ్బులు ఇంటి వద్ద ఇస్తానని, తనవెంట రమ్మన్నాడని చెప్పాడు.

బ్రహ్మచారి తల్లితో తనకు ఏ పాపం తెలియదన్నాడు. తాగలేదన్నాడు. ఆ వ్యక్తి బ్రహ్మచారి తల్లితో 'ఉప్పు మింగిస్తే అసలు సంగతి తేలుతుందన్నాడు. అలా చేస్తే బ్రహ్మచారికి వాంతి అయి కల్లులాంటి పుల్లటి వాసన బయటికి వచ్చింది. వెంటనే ఆ వ్యక్తి తల్లితో బ్రహ్మచారి కల్లు తాగిన విషయం సాక్ష్యంతో తెలిసిందదన్నాడు. బ్రహ్మచారి తల్లిదండ్రులు అతనిని ఇంటిలోనుంచి బహిష్కరించారు. బ్రహ్మచారి తనను వెంబడించిన వ్యక్తిని వివరాలడుగగా తాను కలిపురుషుడని చెప్పాడు.

అసత్యం, అధర్మం రాజ్యమేలే దుర్మార్గమైన కలిలక్షణాలు వివరించాడు. ఇటువంటి కలిదోషాలను పోగొట్టేవాడు కేశవుడని, అతనిని ఆశ్రయించమని అన్నమయ్య ఈ కీర్తనలో పేర్కొన్నాడు.



## *18.* కేవల కృష్ణావతార కేశవా

కర్నూలు జిల్లాలోని వెలుగోడు మండలకేంద్రంలో వెలసిన చెన్న కేశవస్వామిపై అన్నమయ్య రచించిన కీర్తన ఇది. (సంపుటము 4 - 391)

**కేవల కృష్ణావతార కేశవా**
**దేవ దేవ లోకనాథ దివ్యదేహ కేశవా**

**1. కిరణార్క కోటితేజ కేశవా**
**హరి లక్ష్మీ నాయక యాదికేశవ**
**గిరిరాజసుతానుత కేశవ నమో**
**శరధిగంభీర శాయి జయ జయ కేశవా**

**2. కేకిపింఛావతంస కేశవ**
**శ్రీకర గుణాభిరామ చెన్న కేశవ**
**కేకి వాహన వరద కేశవ**
**పాక శాసన వంద్య భళి భళి కేశవా**

**3. కింకర బ్రహ్మాది గణ కేశవ నా -**
**మాంకిత శ్రీవేంకటాద్రి కేశవ**
**కుంకుమాంకవక్ష వెలిగోట కేశవ సర్వ -**
**శంకాహరణ నమో జగదేక కేశవా**

**తాత్పర్యము :**

శుద్ధమైన, నిర్వికారమైన పరమాత్మా! (= కేవల) శ్రీకృష్ణునిగా అవతరించినవాడా!

మంచి వెంట్రుకలు కలవాడా! (= కేశవా) దేవతలకు దేవుడా! లోకానికి ప్రభువా! దివ్యమైన శరీరము కలిగిన వాడా! కేశి అను రాక్షసుని చంపిన వాడా! (= కేశవా) నీకు జయము.

1. కోటి సూర్యకిరణాల కాంతి కలిగిన వాడా! బ్రహ్మరుద్రులను పుట్టించిన వాడా! (= కేశవా!) శ్రీహరీ! లక్ష్మీదేవికి భర్తయైన వాడా! ఆదికేశవుడా! పార్వతీదేవిచే పొగడబడినవాడా! కేశవా! నమస్కారము. లోతైన సముద్రములో శయనించువాడా! కేశవా! నీకు జయము. జయము

2. నెమలిపింఛాన్ని ధరించిన వాడా! కేశవా! సంపదను అనుగ్రహించేవాడా! ఉత్తమగుణములచే మనోజ్ఞమైనవాడా! చెన్నకేశవా! నెమలిని వాహనంగా చేసుకొన్న కుమారస్వామికి వరములిచ్చిన వాడా! కేశవా! ఇంద్రుని చేత నమస్కరింపబడిన వాడా! (పాకశాసన = పాకుడను రాక్షసుని చంపినవాడు కనుక ఇంద్రునికి పాకశాసనుడు అని పేరు వచ్చింది) కేశవా! సెబాసు! సెబాసు!

3. బ్రహ్మ మొదలయినవారిని సేవకులుగా చేసుకొన్న కేశవా! వేంకట - అను పేరుతో గుర్తింప బడిన (= నామాంకిత) వేంకట పర్వతముపై ప్రకాశిస్తున్న కేశవుడా! కుంకుమ చేత గుర్తింపబడుతున్న వక్షస్థలము కలవాడా! వెలిగోటలో ఉన్న కేశవుడా! అన్ని సందేహాలను తీర్చేవాడా! జగదేక వీరుడా! కేశవా! నమస్కారము.

**విశేషాలు :**

ఆదికేశవుడు

కన్యాకుమారి పరిసర ప్రాంతాలలో ఉన్న సుమారు అరవై అడుగుల ఎత్తులో ఉండే తిరువట్టారు ఆలయంలో శ్రీ ఆది కేశవ పెరుమాళ్ కొలువు తీరి ఉన్నాడు. ఈ ఆదికేశవ మూర్తి చాల ప్రసిద్ధుడు.

చెన్నకేశవ :

చెన్ను అంటే అందము. కనుక చెన్నకేశవుడు అంటే అందగాడైన కేశవుడు అని ఒక అర్థం. ఛన్న (= కప్పబడిన) శబ్దమునుండి చెన్న శబ్దము పుట్టిందని కొందరి భావన. అంటే అసలు పేరయిన విష్ణు నామాన్ని కప్పివేసి, చెన్నకేశవుడని పిలువబడుతున్నాడని ఒక భావం.

కేకి వాహన వరద

శిరస్సునెత్తి పలికే శబ్దాన్ని కేకా అంటారు. ఈ కేకా రవము చేసేది కేకి

అంటే నెమలి. నెమలి వాహనముగా కలవాడు కుమారస్వామి. కాళిదాసు మహాకవి ఈ నెమలి వాహనముగా కలిగిన కుమారస్వామిని మేఘసందేశ కావ్యంలో ఇలా రమ్యంగా వర్ణించాడు –

జ్యోతిర్లేఖావలయి గళితం యస్య బర్హం భవానీ
పుత్రప్రేమాః కువలయదళప్రాపి కరేః కరోతి,
ధౌతాపాంగం హరశశిరుచా పావకేస్తం మయూరం
పశ్చాదద్రిగ్రహణగురుభి ర్గర్జితై ర్నర్తయేథాః. (మేఘసందేశం 46 వ శ్లోకం)

తన కుమారుని వాహనమైన నెమలిపింఛాన్నే, పార్వతి కర్ణాభరణంగా ధరిస్తుందట. కుమారుడు పుట్టక మునుపు అమ్మవారు కలువదళాన్ని ధరించేది. ఇప్పుడు తన కుమారుని మీద ప్రేమను సూచించడానికి, నెమలిపింఛాన్ని ధరిస్తోంది. తెల్లనైన నెమలి కళ్లు హరుడు ధరించిన శశికాంతితో ఇంకా శుభ్రం అయ్యాయి. మేఘాన్ని ఉరమమన్నాడు యక్షుడు. ఎందుకంటే ఆ ఉరుములకు నెమిళ్లు ఆనందించి, నాట్యం మొదలుపెడతాయి. అదే చేయించమంటున్నాడు. తన వాహనమైన నెమలిని ఆనందింపజేస్తే, కుమారస్వామి దయ చూపిస్తాడని భావం. ఇటువంటి కేకి వాహన ప్రసక్తి తెచ్చి అన్నమయ్య ఆయనకు విష్ణువు వరాలిచ్చాడంటున్నాడు. విష్ణువుకు, కుమారస్వామికి సంబంధం గురించి కొంత ఆలోచించాలి.

పంచాననాబ్జ భవ షణ్ముఖ వాసవాద్యాః–స్త్రైవిక్రమాది చరితం విబుధాః స్తువంతి।
భాషాపతిః పఠతి వాసర శుద్ధి మారాత్–శేషాద్రి శేఖర విభో తవ సుప్రభాతమ్॥6

(శివుడు, బ్రహ్మ, కుమారస్వామి, ఇంద్రుడు మున్నగు దేవతలు త్రివిక్రమావతారము. మొదలైన నీ అద్భుత చరిత్రలను పొగుడుతున్నారు. బృహస్పతి నీ దగ్గరగా ఉండి నేటి తిథి వారాదుల ఫలములను చదువుతున్నాడు. ఓ వేంకటాచలపతీ! నీకు సుప్రభాతమగు గాక.)

ఇక్కడ వేంకటేశుని కొలిచేవారిలో కుమారస్వామిని సుప్రభాత కర్త పేర్కొన్నాడు. నడిచే దేవుడు కంచి స్వామి చెప్పిన మాటలివి – "తిరుపతిక్షేత్రం సుబ్రహ్మణ్యునికి సంబంధించినదని చెప్పుకోవటం మీరు వినేవుంటారు. వెంకటరమణుడు సుబ్రహ్మణ్యుడే అని విశ్వసించే వాళ్ళు వున్నారు. కాని నా అభిప్రాయంలో వెంకటరమణస్వామి సర్వదేవతాత్మకమైన పరమాత్మ అనియే. అయనే విష్ణువు. ఆయనే పరమేశ్వరుడు. అందుచేతనే అక్కడ బిల్వార్చన జరుగుతున్నది. అంబికయు ఆయనే. ఇప్పటికీ ఆయనకు అభిషేకము శుక్రవారమునాడే జరుగుచున్నది. శుక్రవారము అమ్మవారికి వినియుక్తమైన రోజు. వారికి చీరనే కట్టుచున్నారు. అంతా

ఆయనే అని నా అభిప్రాయం. ఆయనను సుబ్రహ్మణ్యస్వామి అని అభిప్రాయపడేవారు చెప్పేకారణము, వారు కొండశిఖరమున ఉండటం. సుబ్రహ్మణ్యస్వామి ఆలయాలు సాధారణంగా కొండమీదనే వుంటాయి. ఉత్తరహిందూస్థానీయులు ఏడుకొండలవానిని బాలాజీ, బాలాజీ అని వ్యవహరిస్తారు. బాలుడు, కుమారుడు అన్నపేళ్ళు శివశక్తులకు పుత్రుడైన సుబ్రహ్మణ్యస్వామినే సూచిస్తున్నవి. తిరుపతిలో కుమారధార అనే ఒక తీర్థముకూడా ఉన్నది. ఆలయానికి ప్రక్కనే ఉన్న తీర్థము పేరుకూడ – స్వామి పుష్కరిణి. స్వామి అనగా కుమారస్వామి, సుబ్రహ్మణ్యుడే. (జగద్గురు బోధలు–తొమ్మిదవ భాగము)"

కంచి స్వామి చెప్పిన మాటలలో వేంకటరమణస్వామి సర్వదేవతాత్మకమైన పరమాత్మ గమనార్హమైనది. అన్నమయ్య దృష్టిలో కూడా అందరి దేవతల స్వరూపము వేంకట రమణుడే. ఎంత మాత్రమున నిన్ను గొలిచిన అనే కీర్తనలో స్వామిని సర్వ దేవతా స్వరూపముగా కొలిచాడు. ఆ భక్తి పారవశ్యములోనుంచి దూసుకు వచ్చిన పద బంధమే 'కేకి వాహన వరద'. కేకి వాహనుడైన కుమారస్వామికి, శివునికి, అంబికకి తేడాలేదు. విష్ణువు లక్ష్మణుని చేత (ఆదిశేషుడు) సేవలు పొందాడు రామావతారంలో. అదే విష్ణువు కృష్ణునిగా కృష్ణావతారంలో బలరామునికి (ఆదిశేషుడు) సేవలు చేసాడు. సేవలు చేసిన కృష్ణుడు, సేవలు పొందిన రాముడు ఇద్దరూ ఒక్కరే. వరాలుపొందిన కుమారస్వామి, వరాలు ఇచ్చిన వేంకటేశ్వర స్వామి ఇద్దరూ ఒక్కరే. ఇద్దరు ఒకటైనప్పుడు, ఎక్కువ తక్కువల ప్రసక్తిలేదు. అన్నమయ్య పదాలను ఇలా అర్థం చేసుకోవాలి.



## *19. గరుడగమన గరుడధ్వజ*

వేంకటేశుని వివిధ విశేషణాలతో కీర్తిస్తూ అన్నమయ్య రచించిన కీర్తన ఇది. (సంపుటము 2 – 391)

**గరుడగమన గరుడధ్వజ**
**నరహరి నమోనమోనమో**

**1.** **కమలాపతి కమలనాభా**
**కమలజజన్మ కారణక**
**కమలనయన కమలాప్తకుల**
**నమోనమో హరి నమో నమో**

**2.** **జలధిబంధన జలధిశయన**
**జలనిధిమధ్య జంతుకలిత**
**జలధిజామాత జలధిగంభీర**
**హలధర నమో హరి నమో**

**3.ఘనదివ్యరూప ఘనమహిమాంక**
**ఘనఘనా ఘనకాయవర్ణ**
**అనఘ శ్రీవేంకటాధిప తేఽహం**
**అనుపమ నమో హరి నమో**

గరుడుని వాహనముగ గలవాడా! గరుడ చిహ్నము ధ్వజమున కలవాడా! నరసింహావతారా! నీకు నమస్కారము. నమస్కారము. నమస్కారము (గరుద్భిఃడయత ఇతి గరుడః = రెక్కలచేత ఎగిరేవాడు అని గరుడ శబ్దానికి అర్థం)

1. కమలము చేతియందు కలిగినది కమల. ఆమెకు నాథుడా! పద్మము నాభియందు కలవాడా! పద్మమునుంచి పుట్టిన బ్రహ్మజన్మకు కారణమైనవాడా! పద్మమువంటి కనులు కలిగినవాడా! కమలమునకు ఇష్టమైన సూర్య వంశములో రామునిగా పుట్టిన వాడా! పాపాలను హరించే వాడా! హరీ! నీకు నమస్కారము. నమస్కారము. నమస్కారము.

2. రామునిగా సముద్రాన్ని బంధించిన వాడా! సముద్రములో శయనించేవాడా! పాల సముద్రపు మధ్యలో శేషునితో కూడిన వాడా! సముద్రములో పుట్టిన లక్ష్మిని పెళ్లి చేసుకొని, సముద్రానికి అల్లుడయిన వాడా! (జామాత = పెండ్లామును వివాహార్థమై కొలుచువాడిని జామాత అంటారు) తెలిసికొనుటకు వీలుకానిది గంభీరము అంటారు. సముద్రములా తెలిసికొనుటకు వీలుకానివాడా! (= జలధి గంభీర) నాగలిని ఆయుధముగా ధరించిన వాడా! హరీ! నమస్కారము. నమస్కారము.

3.గొప్పదయిన దివ్య స్వరూపము కలవాడా! గొప్పవైన మహిమలే గుర్తుగా కలిగినవాడా! వర్షాకాలంలో ఉండే దట్టమైన నల్లని మేఘమువంటి శరీర కాంతి కలిగినవాడా! పరిశుద్ధుడా! శ్రీవేంకట పర్వతానికి అధిపతీ! పోలిక లేనివాడా! నీకు నా నమస్కారము.

**విశేషాలు :**

గరుడగమన గరుడధ్వజ

దేవేంద్రుని జయించి అమృతము తెస్తున్నప్పుడు విష్ణువు అదృశ్యస్వరూపంలో గరుత్మంతునికి వరమిచ్చాడు. తనకు వాహనముగా, తన జెండా మీది గుర్తుగా గరుత్మంతుని కొన్ని పరీక్షల తరువాత విష్ణుమూర్తి స్వీకరించాడు. (అనుశాసనిక పర్వం

ప్రథమాశ్వాసము) శ్రీవారి బ్రహ్మోత్సవాల్లో గరుడ వాహనసేవ గరుడ వాహన సేవ చాలా ప్రధానమైనది. బ్రహ్మోత్సవాల ప్రారంభం నాడు గరుడ ధ్వజారోహణం చేస్తారు.

గరుడధ్వజంబదె ఘన శంఖరవమదె (2-79)
గరుడధ్వజంబాపె కప్పు పయ్యద (8-90)
గరుడనినెక్కిన ఘన రేవంతుఁడుగరుడ కేతనము గల రథుఁడు/
గరుడఁడే తనకును గురియగు బాణము/
గరిమె నీతఁడెపో ఘన గారుడము1-438
ఇటు గరుడని నీవెక్కిననుపటపట దిక్కులు బగ్గనఁ బగిలె (1-92)

ఇలా ఎన్నో కీర్తనలు అన్నమయ్య గరుత్మంతునిపై వ్రాసాడు.

హరి నమో

1. తమోహరతీతి హరిః అని అమరం. తమస్సును హరించేవాడు సూర్యుడు.

2. హరతీతి హరిః. హరించువాడు హరి. పాపాలను హరించేవాడని భావం. ("హరియను రెండక్షరములు హరి యించును పాతకంబు..." అనిపించాడు పోతన భాగవతంలో.)

3. యముడు, వాయువు, ఇంద్రుడు, చంద్రుడు, సూర్యుడు, విష్ణువు, సింహం, కిరణం, గుఱ్ఱం, కోతి మొదలైన అర్థాలు కూడా హరి శబ్దానికి ఉన్నాయి.

జామాత

అల్లుని మీద ఒక ప్రసిద్ధమైన ఒక హాస్య శ్లోకముంది.

కన్యారాశి స్థితో నిత్యం
కుంభరాశి సమీక్షతే
సదా వక్రీ సదా క్రూరః
జామాత దశామో గ్రహః

ఎప్పుడూ కన్యారాశిలోనే ఉంటూ, మామగారి అన్నకుంభాలను, ధన కుంభాలను నిత్యం అదేపనిగా చూస్తూ, నిత్యము వక్రముగ, క్రూరముగా ఉండే అల్లుడు పదవ గ్రహమని దీని భావము.

అసారే ఖలు సంసారే
సారం శ్వశుర మందిరం
హిమాలయే హర శ్శేతే
హరి శ్శేత మహోదధౌ ।

సారహీనమైన ఈ సంసారంలో అల్లుళ్లకి అత్తవారిల్లు ఒక్కటే కొంత సారం గలది. అందుకనే పరమేశ్వరుడంతటి వాడు అత్తవారిల్లయిన హిమాలయంమీది కైలాసములో ఉంటాడు. విష్ణుమూర్తి కూడా అత్తవారిల్లు అయిన పాల సముద్రం లోనే పండుకొని ఉంటాడు అని ఇంకొక చమత్కారము. అందుకనే అన్నమయ్య కూడా జలధి జామత (= సముద్రానికి అల్లుడయిన వాడా) అని ఈ కీర్తనలో ప్రస్తావించాడు.

అనఘుడు

1.దోషము లేనివాడు. 2. పాపము చేయనివాడు. 3. పరిశుద్ధుడు.

ఆ అనఘుడు మనందరిని కాపాడాలని ప్రార్థిద్దాం.



## *20. గోవిందాశ్రిత గోకుల బృందా (15-260)*

**గోవిందాశ్రిత గోకుల బృందా**
**పావన జయ జయ పరమానందా**

**1. జగదభిరామా సహస్ర నామా**
**సుగుణధామ సంస్తుత నామా**
**గగన శ్యామా ఘనరిపుభీమా**
**అగణిత రఘు వంశాంబుధి సోమా**

**2. జననుత చరణా శరణ్య శరణా**
**దనుజ హరణ లలిత స్ఫురణా**
**అనఘా చరణాయత భూభరణా**
**దినకరసన్నిభ దివ్యాభరణా**

**3. గరుడతురంగా కారోత్తుంగా**
**శరధిభంగ ఫణి శయనాంగా**
**కరుణాపాంగా కమలాసంగా**
**వర శ్రీవేంకటగిరిపతి రంగా**

ముఖ్య పదార్థం : గోవిందా = భూమిని, గోవును, స్వర్గాన్ని, వేదాన్ని పొందినవాడా!; శ్రిత = ఆశ్రయించిన; గోకుల బృంద = ఆవులగుంపు కలిగినవాడా!; పావన = పవిత్రమైన వాడా!; జయ = సర్వులను జయించి వశపరచుకొనెడివాడా!; జయజయ

= గెలువుము, గెలువుము (ఇంకొక అర్థం); పరమానంద = ఎక్కువైన ఆనందమే స్వరూపముగా కలిగినవాడా!; జగదభిరామా = ప్రపంచములో ప్రియమైనవాడా!; సహస్రనామా = వేయి పేర్లు కలిగినవాడా!; సుగుణ ధామ = మంచి గుణాలకు నిలయమైనవాడా!; సంస్తుత నామా = పొగడదగిన పేర్లు కలిగినవాడా!; గగన శ్యామా = ఆకుపచ్చన, నల్లన కలిసిన ఆకాశపురంగు కలవాడా!; ఘనరిపుభీమా = ఘనులయిన శత్రువులకు భయంకరమయిన వాడా!; అగణిత = లెక్కించటానికి వీలులేని; రఘు వంశాంబుధి సోమా = గొప్పదయిన రఘువంశ సముద్రమునకు చంద్రుడా!; జననుత చరణా = జనులచేత పొగడదగిన పాదాలు కలవాడా!; శరణ్య శరణా = రక్షకులకు రక్షణ ఇచ్చువాడా!; దనుజ హరణ = రాక్షసులను సంహరించువాడా!; లలిత స్ఫురణా = అందంగా ప్రకాశించువాడా!; అనఘా = పాపము లేనివాడా!; చరణాయత = చరణములచేత విస్తృతమయిన; భూభరణా = భూమిని ధరించినవాడా!; దినకర సన్నిభ = సూర్యునితో సమానమయినవాడా!; దివ్యాభరణా = దివ్యమైన ఆభరణాలు కలిగినవాడా!; గరుడతురంగా = గరుత్మంతుడు వాహనముగా కలిగినవాడా!; ఆకారోత్తుంగా = విశ్వరూపము కలిగినవాడా!; శరధి భంగ = సముద్ర గర్వమును పోగొట్టినవాడా!; ఫణి శయనాంగా = ఆదిశేషుడు పానుపుగా కలిగినవాడా!; కరుణాపాంగా = దయ నిండిన కడకన్ను కలవాడా!; కమలాసంగా = లక్ష్మీదేవియందు అనురాగము కలిగినవాడా!; వర = శ్రేష్ఠమైన; శ్రీవేంకటగిరిపతి రంగా = శ్రీవేంకటాచల ప్రభూ!

భావం : అన్నమాచార్యులవారి రెండో భార్య అక్కలమ్మ. ఆమెకు పుట్టినవారు పెదతిరుమలాచార్యులవారు. ఈయన కూడా తండ్రిలాగా రోజుకో కీర్తన వేంకటేశ్వరునికి అంకితం చేస్తూ రాసారు. వారు వ్రాసిన ప్రసిద్ధమైన సంస్కృత కీర్తన ఇది. గోవర్ధనగిరిని ఎత్తి, గోవులను రక్షించటం చేత గోవిందుడయ్యాడని భారతం చెప్పింది. గోవర్ధనోద్ధరణ సందర్భంలో సురభి పాలతో శ్రీకృష్ణుని అభిషేకించి, ఆయనకు గోవిందుడని నామకరణము చేసినట్లు భాగవతంలో ఉంది. వరాహావతారంలో రసాతలంలో ఉన్న భూమిని, తన కోరలతో పైకి ఉద్ధరించాడు కనుక విష్ణువును గోవిందుడన్నారు. నమ్ముకొన్న భక్తులను కూడా నేటి కలియుగంలో ఆయన ఉద్ధరిస్తాడని మనసారా నమ్ముతూ గోవింద! గోవింద! అంటూ కోట్లాది భక్తులు నోరారా పిలుస్తుంటారు. తనకు సంబంధించిన గోపాలక మిత్రులను, గోగణాలను రక్షించటానికి ఏడు రోజులపాటు శ్రీకృష్ణుడు గోవర్ధన గిరిని చిటికెన వేలిమీద ఎత్తాడు.

వారికోసం ఎందరో రాక్షసులను సంహరించాడు. దీనినే పెదతిరుమలాచార్యులు 'శ్రిత గోకుల బృందా!' అన్నాడు.

ఈ కీర్తనలో కవి ప్రయోగించిన 'జగదభిరామ' ప్రయోగం ఎంతో పేరుపొందింది. ఆధునిక చలన చిత్ర యుగంలో ఈ ప్రయోగంతో మొదలయ్యే పాట విశేషమైన ఆదరణ పొందిన విషయం అందరికి తెలిసిందే. అభిరామ అనే పేరుతో తమిళనాడులో మీనాక్షీదేవికి పూజలు జరుగుతున్నాయి. స్ఫురణ అంటే మనస్సు మీద మెరుపు అన్నారు రమణ మహర్షి. కాంతి, శబ్దం – రెండింటిని ఈ శబ్దం సూచిస్తుందని వారి మాట. ఇంతటి విశేషార్థం కల స్ఫురణ శబ్దాన్ని లలితంగా కవి ప్రయోగించాడు. పెద తిరుమలాచార్యులు 'గరుడ తురంగ' అంటే "జగదానంద కారక" అను ప్రసిద్ధమైన కీర్తనలో త్యాగరాజస్వామి "ఖగతురంగ" అన్నారు. రెండు చోట్లా తురంగమంటే వాహనమనే అర్థం. పదే పదే స్వామి నామస్మరణ చేస్తే తరిస్తాం. ఈ కీర్తనలో ఉద్దేశ్యం అదే. 'జయలిడగా' అని తండ్రి (1–320) పల్కిన రీతిలో స్వామికి 'జయ జయ' అన్న పెదతిరుమలయ్యను కూడా 'జయము జయము' అని సాహితీ పరులు కొనియాడతారు.



## *21. జడమతిరహం*

వేంకటేశుని రకరకాల విశేషణాలతో కీర్తిస్తూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది. (సంపుటము 1 – 481)

**జడమతి రహం కర్మజంతురేకోఽహం**
**జడధి నిలయాయ నమో సారసాక్షాయ**

**1. పరమ పురుషాయ నిజ భక్త జన సులభాయ**
**దురిత దూరాయ సింధుర హితాయ**
**నరకాంతకాయ శ్రీ నారాయణాయ తే**
**మురహరాయ నమో నమో నమో ॥జడ॥**

**2. నగసముద్ధరణాయ నందగోపసుతాయ**
**జగదంతరాత్మనే సగుణాయ**
**మృగ నరాంగాయ నిర్మిత భవాండాయప**
**న్నగ రాజ శయనాయ నమో నమో ॥జడ॥**

**3. దేవ దేవేశాయ దివ్య చరితాయ బహు-**
**భావనాతీతాయ పరమాయ**
**శ్రీ వేంకటేశాయ జితదైత్య నికరాయ**
**భూ వల్లభాయ నమో పూర్ణకామాయ ॥జడ॥**

**తాత్పర్యము :**

నేను మందబుద్ధి కలవాడను (తెలివిలేనివాడిని). నేను నా కర్మ వలన పశు రూపాన్ని పొందినవాడిని. పాలసముద్రము నిలయమైనవానికి, పద్మములవంటి కన్నులు కలవానికి (సారసపక్షి కన్నులవంటి కన్నులు గలవానికి) నమస్కారము.

1. పరమాత్మకి, తనను నిజముగా నమ్మిన భక్తులకు సులభుడైన వానికి, పాపములను దూరము చేయువానికి, గజేంద్రునికి హితము చేసిన వానికి, నరకుని సంహరించిన వానికి, శ్రీ నారాయణుడైన నీకు, మురుడను పేరుగల రాక్షసుని సంహరించిన వానికి నమస్కారము. నమస్కారము.

2. గోవర్ధన పర్వతమును ఎత్తిన వానికి, నందగోపుని కుమారునికి ఈ ప్రపంచమునకు అంతరాత్మగా ఉన్నవానికి, సగుణునికినరసింహ స్వరూపుడైన వానికి, బ్రహ్మాండమును నిర్మించిన వానికి, పాములకు రాజయిన ఆదిశేషునిపై శయనించిన వానికి నమస్కారము.

3. దేవుడా! దేవతలకు ఈశ్వరుడా! దివ్యచరిత్రను కలిగినవాడా! అనేక భావనలు చేసినా అందనివాడా! పరమాత్ముడా! శ్రీవేంకటేశుడా! రాక్షస సమూహమును జయించిన వాడా! భూదేవికి భర్తా! నెరవేరిన కోరికలు కలవాడా! నమస్కారము.

**విశేషాలు :**

కర్మజంతురేకోహం

మానవుడు కూడా జంతువే. పశువే. అందుకని శివుడిని పశుపతి అన్నారు. కనుకనే అన్నమయ్య జీవుడిని కర్మజంతువు అన్నాడు. మానవుడు పశు ప్రవృత్తిని వదిలి, పశుపతి తత్త్వాన్ని అలవరుచుకొని జీవిస్తే గొప్ప శక్తివంతుడు అవుతాడు.

కర్మమున బుట్టు జంతువు
కర్మముసన వృద్ధి బొందు కర్మమున జెడున్
కర్మము జనులకు దైవము
కర్మము సుఖదుఃఖములకు కారణమధిపా!

ఉచ్ఛ్వాస నిశ్వాసములు, కనురెప్పలు వేయుట మొదలైవి ఏ సంకల్పం తోను సంబంధం లేక వాటంతట అవే జరిగిపోతూ ఉంటాయి. వీటిని అనైచ్ఛిక కర్మలు అంటారు. ఇష్టంగా చేసే కర్మ ఫలితం వాసనా రూపంగా శుద్ధవాసన,

మలినవాసన అని రెండు విధాలుగా అంతఃకరణములో ఉంటుంది. పాపకర్మ ఫలితం. మలిన వాసన పుణ్యకర్మ ఫలితం శుద్ధవాసన. సగుణారాధన, దైవదర్శనం, గురు సేవ మొదలైనపుణ్యకర్మలు చేసి, మలినవాసనలను జీవుడు పోగొట్టుకోవాలి. వీటివల్ల శుద్ధవాసనలు వస్తాయి. తిరిగి జన్మ ఎత్తకుండా ఉండాలంటే శుద్ధవాసనలను కూడా సాధన చతుష్టయంతో నిర్గుణ ధ్యానంతో పోగొట్టుకోవాలి.

కర్మ – సంచితం, ప్రారబ్ధం, ఆగామి అని మూడు రకాలు.

సంచితం అంటే కూడబెట్టినది. పూర్వ జన్మలో చేసిన పాపపుణ్యాల ఫలితం వెంట వస్తుంది కనుక అది సంచిత కర్మ ఫలం. మున్ముందు జరిగేది, రాబోయేది ఆగామి. మున్ముందు చేసేది పాపమైతే అది ఆగామి పాపం. పుణ్యమైతే ఆగామి పుణ్యం. జీవిత కాలంలో చేసే పాపపుణ్యాల ఫలితం భవిష్యత్తులో అనుభవానికి వస్తుంది. కనుక అవి ఆగామి పాపపుణ్యాలు.

ఇప్పటి దేహానికి కారణమైన కర్మను ప్రారబ్ధ కర్మ అంటారు. ఇది స్వేచ్ఛా ప్రారబ్ధమనీ, పరేచ్ఛాప్రారబ్ధమనీ రెండు విధాలు. స్వేచ్ఛాప్రారబ్ధంలో తన ఇచ్ఛప్రకారం, పరేచ్ఛాప్రారబ్ధంలో ఇతరుల ఇష్టప్రకారం అనుభవాలు కలుగుతుంటాయి, కార్యకలాపాలు జరుగుతుంటాయి. పరేచ్ఛాప్రారబ్ధం అనుభవిస్తున్నప్పుడు సాధకుడు సమాధిలో ఉన్నప్పటికీ ఇతరుల ఇష్ట ప్రకారమే స్నానపానాదులు సైతం జరుగుతుంటాయి.

అన్నమయ్య ప్రయోగించిన జడ శబ్దము ఒక పక్క తెలివి తక్కువవాడిననే అర్థము ఇస్తున్నప్పటికి, తాను మహాయోగినని అన్నమయ్య ఈ జడ పదము ద్వార తెలియచేస్తున్నట్లనిపిస్తోంది. గొప్పవాడైన సిద్ధపురుషుడు లోకులకు లోకులకి జడునిలా, చెవిటివాడు అనిపిస్తుంటాడు అని ఆత్మ విద్యా విలాసము అనే గ్రంథంలో ఉంది. అవధూత కర్మజాలో/జడ బధిరాంధోపమః కోపి । ఆత్మారామో యతిరాట్ అటవీకోణేష్వట న్నాస్తే ॥ (ఆత్మ విద్యావిలాసము15) అన్నమయ్య మహా అవధూత. కనుకనే కీర్తనలో జడ శబ్దము వచ్చినది.

సగుణాయ

రెండు రకాల ఉపాసనలు ఉన్నాయి. 1.సగుణోపాసన. 2. నిర్గుణోపాసన.

1.సగుణోపాసన

భగవంతునిలో ఏవో కొన్ని మంచి గుణాలను తలచుకొని వాటిని

గుర్తుగాపెట్టుకొని ఉపాసన చేయడం సగుణోపాసన. మనస్సులో అదే ఆలోచనను నిలుపుకొని ధ్యానం చేయడం సగుణ ధ్యానం. సగుణోపాసనను కొందరు సాకారుడైన భగవంతుని ఉపాసనగా భావిస్తారు. మౌలికంగా సగుణోపాసన మానసికమైనదే గాని, విగ్రహారాధన కాదు. ధ్యానంలోనూ అదే పద్ధతి. ఉపాసన అంటే పరమాత్మకు దగ్గర కావడం. ఏ సగుణాలను భగవంతునిలో తలుస్తామో వాటిని ఉపాసకుడు అలవరచుకోవడం ఉపాసన ఫలం.

2. నిర్గుణోపాసన

ప్రకృతివల్ల సత్వరజస్తమో గుణాలకు అతీతుడై, రాగద్వేషాలను వదలి ఆత్మావలోకనం ద్వారా పరబ్రహ్మాన్ని తెలుసుకొనడానికి చేసే సాధన. నిర్గుణం అంటే గుణాలు లేకపోవడం.

నిర్మిత భవాండాయ

బ్రహ్మాండమంటే ప్రపంచము. ఆకాశానికి శబ్ద గుణము ఉంది. వాయువుకి శబ్ద, స్పర్శ గుణాలు ఉన్నాయి. అగ్నికి శబ్ద, స్పర్శ రూప గుణాలు ఉన్నాయి. నీటికి శబ్ద, స్పర్శ, రూప, రస గుణాలున్నాయి. భూమికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ గుణాలున్నాయి. ఇవన్నీ కలిస్తే బ్రహ్మాండమైందని బ్రహ్మ పురాణంలో ఉంది. (23 వ అధ్యాయము) ఈ బ్రహ్మాండము వెలగపండు విత్తనంలా ఉంటుందని పోలిక చెప్పారు. ఈ మానవ శరీరము బ్రహ్మాండము యొక్క సూక్ష్మ రూపం. హరి బ్రహ్మాండములో వ్యాపించినట్లే ఈ శరీరములో కూడా వ్యాపించి హృదయ సీమలో అలంకరించి ఉంటాడని ప్రశ్నోపనిషత్తు చెబుతోంది. (ఆరవ అధ్యాయము). ఇటువంటి బ్రహ్మాండాలు వేలకు వేలు. వీటిని నిర్మించిన వానిగా వేంకటేశుని అన్నమయ్య పొగుడుతున్నాడు.

పూర్ణకామాయ

పూర్ణ కాముడు అనే పదాన్ని నడిచే దేవుడు కంచి స్వామి ఇలా వివరించారు.

(దేవుని) పూర్ణానుగ్రహము కలిగితే "సర్వాన్ కామాన్ సహా" అని కోర్కెలు ఒకేమారు తీరాలి. వానినే ఆప్తకాముడు, పూర్ణకాముడు అంటారు. అట్టి వానికి భవనము, అరణ్యము–మిత్రులు శత్రులు–ఇటుకరాయి, బింబోష్టి అనేవి ఒకే విధముగా "సమ"ముగా కనబడుతాయి. భగవద్గీతలో యిట్టివారిని గూర్చి "సమంపశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్" –అని చెప్పేరు.(జగద్గురు బోధలు – ఎనిమిదవ సంపుటము). స్వామిని ఎన్ని సార్లు పొగిడినా భక్తునికి తనివి తీరదు. ఆ తృప్తికి

పునరుక్తి దోషము ఉండదు. అందుకే అన్నమయ్య స్వామిని పొగిడే జడమతిరహం వంటి కీర్తనలు చాలా ఉన్నాయి.



## 22. జయజయ నృసింహ

నరసింహస్వామిని స్తుతిస్తూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది. (సంపుటము 2-289)

**జయ జయ నృసింహ సర్వేశ**
**భయహర! వీర! ప్రహ్లాదవరద**

**1. మిహిరశశినయన! మృగనరవేష**
**బహిరంతస్థలపరిపూర్ణ**
**అహినాయక సింహాసనరాజిత**
**బహుళగుణగణ ప్రహ్లాదవరద**

**2. చటులపరాక్రమ సమఘనవిరహిత**
**నిటలనేత్ర మౌనిప్రణుత**
**కుటిలదైత్యతతికుక్షివిదారణ**
**పటువజ్రనఖ ప్రహ్లాదవరద**

**3. శ్రీవనితాసంశ్రితవామాంక**
**భావజకోటిప్రతిమాన**
**శ్రీవేంకటగిరిశిఖరనివాస**
**పావన చరిత ప్రహ్లాదవరద**

**తాత్పర్యము :**

ఓ నరసింహుడా! అందరికీ ప్రభువా! గెలువుము. గెలువుము. భయాన్ని హరించువాడా! వీరుడా! ప్రహ్లాదునికి వరములిచ్చినవాడా!

1. సూర్యుడు, చంద్రుడు కన్నులుగా కలిగినవాడా! సింహము, మనిషి కలిసిన అవతారము కలిగిన వాడా! బయటా, లోపల అంతటా బాగా నిండి ఉన్నవాడా! పాములనాయకుడైన ఆదిశేషుని సింహాసనముగా చేసుకొని ప్రకాశించువాడా! అనేక గుణసమూహములు కలిగిన వాడా! ప్రహ్లాదునికి వరములిచ్చినవాడా!

2. తీవ్రమైన పరాక్రమము కలిగినవాడా! నీతో సమానులుకాని, ఎక్కువవారు కాని లేనివాడా! నుదుట కన్ను కలిగిన వాడా! మునులచేత పొగడబడిన వాడా! దుష్టులైన రాక్షస సమూహముల పొట్టలను చీల్చిన వాడా! నేర్పు కలిగిన వాడియైన వజ్రములవంటి గోళ్లు కలిగిన వాడా! ప్రహ్లాదునికి వరములిచ్చినవాడా!

3.లక్ష్మీదేవిచే ఆశ్రయింపబడిన ఎడమతొడ గలవాడా! (ఎడమతొడపై లక్ష్మీదేవి ఉన్నది) అనేకమంది మన్మథులకాంతికి సమానమైన కాంతి కలవాడా! శ్రీవేంకటాద్రి పర్వత శిఖరముపై వేంకటేశునిగా నివాసమున్న వాడా! పవిత్రమైన చరిత్ర కలవాడా! ప్రహ్లాదునికి వరములిచ్చినవాడా! గెలువుము. గెలువుము.

విశేషాలు :

'ఉగ్రం వీరం మహా విష్ణుం జ్వలంతం సర్వతోముఖం ।
నృసింహం భీషణం భద్రం మృత్యు మృత్యుం నమామ్యహమ్ ॥

ఇది నృసింహ గాయత్రీ మంత్రమని 'నృసింహతాపిన్యుపనిషత్తు'లో ఉన్నది. ఈ మంత్ర స్థాయి కలిగిన కీర్తన 'జయ జయ నృసింహ' సర్వేశ కీర్తన.

ప్రహ్లాదవరద (ప్రహ్లాదునికి వరములిచ్చినవాడా)

హిరణ్యకశిపుని సంహరించిన తరువాత ప్రహ్లాదుని ఏదైనా వరం కోరుకొమ్మన్నాడు నరసింహస్వామి. 'నన్ను అనేకమంది అనేక కోరికలు కోరుతుంటారు. నువ్వు కూడా ఏదైనా కోరుకో' అని స్వామి అంటే ప్రహ్లాదుడు ఇలా రెండు వరాలు కోరుకొన్నాడు. 1) కోరికలు వృద్ధి పొందని వరాన్ని ప్రసాదించు, 2) నా తండ్రి హిరణ్యకశిపుడు పవిత్రుడు అయ్యే వరం ప్రసాదించు. నరసింహుడు ప్రహ్లాదునికి ఆ వరాలు ప్రసాదించాడు. ఈ సంబోధన అన్నమయ్యకు చాల ఇష్టమైనది. అంబుజాక్ష నమో కీర్తనలో ప్రతి పంక్తిలో ప్రహ్లాదవరద అని నోరార కీర్తించాడు.

మిహిరశశినయన (సూర్యుడు, చంద్రుడు కన్నులుగా కలిగిన వాడా!)

తానే మేఘ రూపియై ప్రపంచాన్ని తడుపుతాడు కనుక సూర్యునికి మిహిరుడని పేరు. దాటుచు పోయేదానిని శశమంటారు. ఈ శశము (= కుందేలు) కలిగిన వాడు కనుక చంద్రునికి శశి అనిపేరు వచ్చింది.

బహిరంతస్థలపరిపూర్ణ (బయటా, లోపల అంతటా బాగా నిండి ఉన్నవాడా!)

శంకర భగవత్పాదుల శిష్యుడైన పద్మపాదుడు ఒకనాడు శ్రీనృసింహ మంత్రాన్ని జపించటానికి అహోబిలము వెళ్లి తపస్సు చేస్తున్నాడు. నరసింహస్వామి కనబడలేదు. ఒకరోజు తన సేవ చేయాలని వచ్చిన కిరాతునితో ఈ అరణ్యములో కంఠము దాకా మనుష్యాకారము, ఆపిమ్మట సింహాకృతి గల జంతువు కన్పడితే దానిని తనకు చూపించమన్నాడు. పద్మ పాదుడు చెప్పిన ఆ మృగమును అనేక చోట్ల

వెతికి, మృగాన్ని చూపించలేని తన బ్రతుకు వ్యర్థమని నిర్ణయించుకొని ఉరిపోసుకుని మరణించబోయే సమయంలో మానవాకారము, సగము సింహాకృతి గల మృగము కిరాతునికి కన్పించింది. ఆ కిరాతుడు దానిని గట్టిగా కట్టి పద్మపాదుని దగ్గరకు తెచ్చాడు. పద్మపాదునకు ఆ నరసింహ దర్శనము కాలేదు. కేవలము గర్జన వినబడింది. వేటగాడు తన బుద్ధిని స్వామియందు స్థిరముగా ఉంచాడు. పద్మపాదునికి ఆ స్థిరత్వము రాలేదు. అందువలన దర్శనము కాకుండా ధ్వని వినబడింది. పద్మపాదునికి వలె స్థిర చిత్తము లేని మనకు అదృష్టము కొద్దీ అన్నమయ్య పదాలలో నరసింహ ధ్వనులు వినబడుతున్నాయి. బయటా, లోపల అంతటా బాగా నిండి ఉన్న ఆ అసలు రూపం ప్రత్యక్షము కావాలంటే స్థిర చిత్తము కావాలి.



## *23. జానామ్యహంతే సరసలీలాం*

అన్నమయ్య ఒక నాయికగా మారి వేంకటేశ్వర స్వామిని ఎత్తి పొడుస్తూ రచించిన సంస్కృత కీర్తన ఇది. (5-135)

**జానామ్యహంతే సరసలీలాం**
**నానావిధ కపటనాటక సఖత్వమ్**

**1 కింకరోమి త్వాం కితవ పరకాంతన-**
**ఖాంకురప్రకటన మతీవ కురుషే**
**శంకాంవిసృజ్య మమ సంవ్యాన కర్షణం**
**కింకారణమిదం తే ఖేలన మిదానీం**

**2. కింభాషయసి మాం కృతకమానసతయా**
**దాంబికతయా విట విడంబయసి కిం**
**గాంభీర్యమావహసి కాతరత్వేన తవ**
**సంభోగ చాతుర్య సాదరతయా కిం**

**3. కిమితి మామనునయసి కృపణ వేంకటశైల-**
**రమణ భవదభిమతసురతమనుభవ**
**ప్రమదేన మత్ప్రియం ప్రచురయసి మానహర**
**మమతయా మదననిర్మాతా న కిం త్వం**

**తాత్పర్యము :**

నాకు నీ సరస లీలల గురించి బాగా తెలుసులేవయ్యా! అనేక రకాలైన కపట నాటక స్నేహాలు ఇంకా బాగా తెలుసు!

1. ఒరేయ్! మోసగాడా! నిన్ను ఏమి చేయాలి?! పరకాంత నీ ఒంటిపై చేసిన గోటి

గిచ్చుడును బాగా ప్రదర్శిస్తున్నావు. సందేహము విడిచిపెట్టి నా పైట పట్టుకొని లాగుతున్నావు. ఈ నీ ఆటలకు ఇప్పుడు కారణము ఏమిటి?

2. కపటపు మనస్సుతో నన్ను ఎందుకు మాట్లాడిస్తావు?! ఒరేయ్! విటుడా! డాబుసరిని ఎందుకు ప్రదర్శిస్తావు? నీకు లోపల భయము. పైకేమో గాంభీర్యాన్ని చూపిస్తావు. సంభోగ చాతుర్యాన్ని ఆదరించటముతో ఏమి ప్రయోజనముంది చెప్పు?

3. ఒరేయ్ కుత్సితుడా! (లోభీ!) ఎందుకు నన్ను బతిమిలాడతావు? ఓవేంకటాచలపతి! నీకు ఇష్టమైన సంభోగాన్ని అనుభవించు! నా మానాన్ని దోచుకొన్నవాడా! సంతోషముతో నాకు ప్రియాన్ని చెబుతున్నావు. మమకారంతో మన్మథుని పుట్టించిన వాడివి నువ్వే కదా!! అవునా! కాదా!

**విశేషాలు :**

1. ఈ శృంగార మధుర భక్తి కీర్తనలో నాయిక యొక్క రకరకాల అవస్థలలో చేసిన సంభాషణలు కనిపిస్తున్నాయి.

2. వేంకటేశుడు అనే నాయకుడు, నాయికతో ఏమన్నాడో ఈ కీర్తనలో ఎక్కడాలేదు. కాని వివిధ వాక్యాలు ఆయన ప్రశ్నలకు, చేష్టలకు జవాబులుగా రాసినట్లున్నాయి. “నేను మంచివాడిని. నన్ను నమ్ము” అని నాయకుడు అన్నాడని మనము భావించాలి. దానికి ప్రతిగా “జానామ్యహంతే సరసలీలాం” (నాకు నీ సరస లీలల గురించి బాగా తెలుసులేవయ్యా) అని నాయిక ఎత్తిపొడుపు మొదలుపెట్టింది. ఇలా మిగతా జవాబులకు ప్రశ్నలు ఊహించుకోవచ్చు. ఇది అన్నమయ్య కీర్తనల్లో ఉన్న ఒక ప్రత్యేకత.

3. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావలని అయిదు రకాల భక్తి మార్గాలు. అన్నమయ్య ఈ అయిదు భక్తి మార్గాలలో వేంకటేశునిపై కీర్తనలు రచించారు. ప్రస్తుత ‘జానామ్యహం’ కీర్తన మధుర భక్తి మార్గానికి చెందినది. తానే నాయికగా మారి అన్నమయ్యస్వామితో ఈ కీర్తనలో సంభాషించాడు అన్నమయ్య. లౌకిక జగత్తును దాటి అన్నమయ్య అనుభూతి స్థాయిలో అర్థము చేసుకోవలసిన కీర్తన ఇది.



## 24. డోలాయాంచల (02-374)

**డోలాయాంచల డోలాయాం హరే డోలాయాం**

**1. మీన కూర్మ వరాహ మృగపతి అవతారా**
**దానవారే గుణ శౌరీ ధరణి ధర మరజనక**

**2. వామన రామ రామ వర కృష్ణ అవతారా**
**శ్యామలాంగా రంగ రంగా సామజ వరద మురహరణ**

**3. దారుణ బుద్ధ కలికి దశవిధ అవతారా**
**సీరపాణే ఘోషమణే శ్రీవేంకటగిరి కూట నిలయ**

ముఖ్య పదార్థము : హరే = ఓ హరీ!; డోలాయం = ఊయెలలో; చల = ఊగు; మీన = చేప (1. మత్స్యావతారం); కూర్మ = తాబేలు (2. కూర్మావతారం); వరాహ = అడవిపంది (3. వరాహావతారం); మృగపతి = సింహము (4. నరసింహావతారం); దానవారే = రాక్షసులకు శత్రువైనవాడా!; గుణశౌరే = ధైర్యగుణాలున్న విష్ణుమూర్తీ!; ధరణి ధర = భూమిని ధరించువాడా!; మరుజనక = మన్మథునికి తండ్రీ!; వామన = పొట్టివాడు (5. వామనావతారం); రామ = పరశురాముడు (6. పరశు రామావతారం); రామ = శ్రీరామచంద్రమూర్తి (7. రామావతారం); వరకృష్ణ అవతారా = శ్రేష్ఠుడైన 8. కృష్ణావతారం దాల్చినవాడా; శ్యామలాంగా = నల్లగా ఉన్న అవయవాలు కలవాడా!; రంగ రంగా = శ్రీరంగనాథా!; సామజవరద = గజేంద్రునికి వరాలు ప్రసాదించినవాడా!; మురహరణ = మురుడనే రాక్షసుని చంపినవాడా!; దారుణ బుద్ధ = కఠినమైన 9. బుద్ధావతారం దాల్చినవాడా!; కలికి దశవిధ అవతారా = 10. కల్కి మొదలైన దశావతారములు కలవాడా!; సీరపాణే = నాగలి చేతిలో ఉన్నవాడా! (బలరాముడా!); ఘోషమణే = గొల్లపల్లెకు మణివంటివాడా!; శ్రీవేంకటగిరి = శ్రీవేంకట పర్వతం; కూట నిలయ = శిఖరముపై ఉన్నవాడా!

**భావం :** 'జో అచ్చుతానంద' అని తెలుగులో ప్రతి తల్లి పాడుకొనే ఉయ్యాల పాట రాసిన అన్నమయ్య స్వామివారి దశావతారాలను పొగుడుతూ ఈ సంస్కృత కీర్తనలో జంపాల (జోలపాట) పాడుతున్నాడు.

మీన, కూర్మ, వరాహ, నరసింహ అవతారాలు దాల్చిన వాడా! రాక్షసులకు శత్రువైనవాడా! ధైర్య గుణాలున్న విష్ణుమూర్తీ! మన్మథునికి తండ్రీ! వామన, పరశు రామ, శ్రీరామ, శ్రీకృష్ణ అవతారాలు ధరించినవాడా! నల్లనయిన అవయవాలు

కలవాడా! గజేంద్రునికి వరాలు ప్రసాదించినవాడా! మురుడనే రాక్షసుని చంపిన వాడా! కఠినమైన బుద్ధ, కల్కి – ఈ విధంగా 10 అవతారాలు దాల్చిన (దాల్చే)వాడా! బలరాముడా! గొల్లపల్లెకు మణివంటివాడా! శ్రీ వేంకట పర్వతశిఖరముపై ఉన్నవాడా! ఓ హరీ! ఊయెలలో ఊగు.

విష్ణువు సృష్టిని కాపాడటానికి (1. మత్స్యం); మంథరపర్వతము సముద్రంలో కుంగిపోకుండా ఉండటానికి (2. కూర్మం); వేదాలను కాపాడి, హిరణ్యాక్షుడిని చంపటానికి (3. వరాహం); హిరణ్యకశిపుడిని చంపటానికి (4. నరసింహ); బలి గర్వాన్ని అణచివేయటానికి (5. వామన); దుష్టక్షత్రియులను సంహరించటానికి (6. పరశురామ); రావణ వధ చేసే, ఒక ఆదర్శ పురుషుడిని లోకంలో ఆవిష్కరించటానికి (7. శ్రీరామ), కంసాది రాక్షస సంహారముతో పాటు, ఒక ఆచార్యునిగా గీతా ప్రబోధం చేయటానికి (8. శ్రీకృష్ణ); త్రిపురాసుర సంహారం చేయటానికి (9. పురాణబుద్ధ) అవతారాలు ధరించాడు. దుష్ట సంహారం కోసం మరో (10. కల్కి) అవతారం ధరిస్తాడు. ప్రతి మన్వంతరంలో వచ్చే ఈ అవతారాలను అన్నమయ్య ఈ కీర్తనలో ప్రస్తావించాడు.

రావిచెట్టును కౌగిలించుకొంటే మీ కోరికలు నేరవేరుతాయని బుద్ధుడి ఆకారంలో త్రిపురాసురుల భార్యలకు విష్ణుమూర్తి చెప్పాడు. ఆ రకంగా వారు చేస్తుండగా, రావిచెట్టులో విష్ణుమూర్తి కనబడి, వారి పాతివ్రత్యాన్ని పోగొట్టాడని ఒక కథ. త్రిపురాసురులను చంపటానికి ఈవిధంగా చేసినప్పటికీ ఆ పని దారుణమైనది కనుక 'దారుణ బుద్ధ' అని అన్నమయ్య చెప్పాడు. గౌతమబుద్ధుడు, ఈ బుద్ధుడు ఇద్దరూ వేర్వేరు.

దశావతారాలు ఏవనే విషయం మీద ఈనాటికి ఎడతెగని చర్చ కొనసాగుతోంది. "మత్స్య కూర్మ వరాహశ్చ" అను ప్రసిద్ధమైన దశావతార శ్లోకంలో బలరాముడికి బదులు కృష్ణుడి పేరున్న ఇంకొక పాఠముంది. బలరాముడిని కొందరు దశావతారాలలో చేరిస్తే, ఆయనకు బదులు కృష్ణుడిని కొంతమంది చేర్చారు. కృష్ణుడికి బదులు బలరాముడి అవతారాన్ని 'పుడమినిందర' మొదలైన కీర్తనలలో చేర్చిన అన్నమయ్య 'సంసారమే మేలు' అని కీర్తనలో బలరాముడికి బదులు కృష్ణుడిని దశావతారాలలో చేర్చి పొగిడాడు.

ఊయెల పైకి పోయి కిందికి వస్తుంటుంది. జీవితంలో కూడా ఈ ఎగుడు దిగుడు తప్పదని, దృఢమైన మనస్తత్త్వం అలవర్చుకోవాలని వివాహంలో ఉయ్యాల

కార్యక్రమం చెబుతోంది. ఊంజల్ సేవ (తిరుపతిలో జరిగే పవిత్రమైన ఊయెల కార్యక్రమం) దేవునికి ఆపాదించటంలో ఈ బోధని ప్రచారం చేయాలనే కాంక్ష మన పెద్దలకు ఉంది.

ఈ కీర్తనలోని మూడు చరణాలలో కవి ఒక క్రమమైన పద్ధతిని పాటించాడు. మొదటి పాదంలో అవతారాలను వర్ణించటం, రెండవ పాదంలో స్వామిని పొగుడుతూ సంబోధనలు చేయటం – మూడు చరణాలలోను కవి అలాగే రాసాడు. దశావతారాల వర్ణనలో జీవుని పరిణామక్రమం ఉన్నదని (నీటిలో మొదలయిన జీవనక్రమం క్రమంగా భూమిపైకి పాకిందని) ఒక వాదం. ఆ పరిణామాల సంగతేమిటో కాని – ఈ అన్నమయ్య దశావతార కీర్తనలో దుఃఖంనుంచి ఆనందానికి – హృదయాన్ని పరిణామం చెందించే దివ్యాక్షర సమ్మేళనం ఉంది.



## *25. తత్తాతి గుడి దింధి తక ధింధిం*

మృదంగ ధ్వనుల నేపథ్యంలో నరసింహ స్వామిని కీర్తిస్తున్న అన్నమయ్య సంస్కృత కీర్తన ఇది. (6–45)

**తత్తాతిగుడి దింధి తక ధింధిం**
**తిత్తి తిత్తితి తితి తితి తితి**

**1.దానవవదనవితానదాన సం**
**ధాన రుధిరనిజపానమిదం**
**నానాభూతగణానాం గానం**
**దీనజనానాం తిత్తితి తితి**

**2.విమతదనుజమత విభవపరిభవిత**
**సమధికం తవ శౌర్యమిదం**
**ప్రమదాభవ్యం ప్రమదాభరణం**
**తిమిరనిరసనం తిత్తితి తితి**

**3.తిరువేంకటగిరి దేవనిధానం**
**పరమామృతరసభాగ్య మిదం**
**కరుణావరణం కమలాఘటనం**
**తిరొ తిరొ తిత్తితి తితి తితి**

**తాత్పర్యము :**

'తత్తాతిగుడి దింధి తక ధింధిం' అంటూ'తిత్తి తిత్తితి తితి తితి తితి అంటూ మృదంగ ధ్వనులతో నరసింహ స్వామిని కీర్తిస్తున్నాను.

1. రాక్షసుడైన హిరణ్యకశిపుని ముఖ సమూహములను ఛేదించుట (= దాన) చేతబయటకు వచ్చిన రక్తాన్ని స్వభావ సిద్ధంగా (= నిజ) ఆస్వాదిస్తూ తాగిన వాడా! అనేక విధములైన భూత సమూహములకు శుభం కలగాలని దీన జనులకు ఆ తిత్తితి తితి మృదంగ ధ్వనిని గానంగా వినిపిస్తున్నాను.

2. వేదమతానికి విరుద్ధమైన మతము కలిగిన నాస్తిక మత గొప్పతనాన్ని పరాభవించుటచేత మిక్కిలి అధికమైన నీ యొక్క పరాక్రమాన్ని తిత్తితి తితి మృదంగ ధ్వనులతో గానము చేస్తున్నాను. నరసింహ స్వామీ! నీ పరాక్రమము సంతోషముతో శుభకరమైనది. మా అమ్మ లక్ష్మీదేవికి ఆభరణము వంటిది. అజ్ఞానము అనే చీకటిని తొలగించేది. అటువంటి నీ పరాక్రమాన్ని తిత్తితి తితి మృదంగ ధ్వనులతో గానము చేస్తున్నాను.

3. శుభమైన వేంకట పర్వతాన్ని దేవతలకు నిధిగా చేసినశ్రేష్ఠమయిన అమృత రసమనే భాగ్యము నిన్ను పొగుడుతూ చేసే ఈ తిత్తితి తితి మృదంగ ధ్వని. నీ దయ కలిగినది. లక్ష్మిని అనగా సంపదను కలిగించేది. తిరొ తిరొ తిత్తితి తితి తితి అను ఈ మృదంగ ధ్వని(జయింపబడుగాక).

**విశేషాలు :**

మృదంగము

మృదంగము అంటే 1. మద్దెల. 2. తప్పెట. తెలుగు-తెలుగు నిఘంటువు. (జి.ఎన్.రెడ్డి - ఆం.ప్ర.సా.అ.) 1979. మృదంగములు మూడు రకాలు.

1. అంక్యము - అంకమున నుంచుకొని వాయింపదగిన మృదంగ వాద్యము. (వ్యు. అంక + యత్. (త.ప్ర.) ఒడిలో పెట్టుకొని వాయింపదగినది)

2. ఆలింగ్యము - గోపుచ్ఛమువంటి ఆకారముగల మృదంగము, ఆదోకమద్దెల

3. ఊర్ధ్వకము - యవ (ఒకానొక ధాన్యము) మధ్యమువంటి మధ్యముగల మృదంగము

భక్త కవులందరికీ మృదంగమంటే చాలా ప్రీతి. "సొగసుగా మృదంగ తాళము జత గూర్చి నిను సొక్క జేయు ధీరుడెవ్వడో" అనుపల్లవి. - నిగమ శిరోర్థము గల్గిన "నిజ వాక్కులతో స్వర శుద్ధముతో" అని త్యాగరాజస్వామి మృదంగముపై తన ప్రేమను తెలియచేసారు. "కేశవ, గోవింద, మాధవా యని కీర్తన సేయుట ఎన్నటికో" అను కీర్తనలో నరసదాసు గారు "భక్తి, మృదంగము, తాళాదులతో భజనలు చేసే దెన్నటికో"

అన్నారు. నాట్యము చేసేవారికి బహిఃప్రాణములుగా మృదంగము, మంచితాళములు, పిల్లనగ్రోవి, శృతి, వీణ, మంతపాట, గజ్జలు, ప్రసిద్ధుడగు గాయకుడు అను ఎనిమిదింటిని చెబుతారు.

తత్తాతిగుడి దింధి తక ధింధిం

పేరిణి నృత్యములో పంచభూతాల తత్వాన్ని అనుసరించి ప్రత్యేకమైన మృదంగ శబ్దములతో జతులు (= గాన నాట్య యోగ్య శబ్దస్వరసంతతి – an accompaniment in harmony with vocal music) సమకూరుస్తారు. ఈ మృదంగ శబ్దాలు నందికేశుడు సూచించినవట. ఈ జతులను కూర్చటంలో ధూపం సూర్యలింగం గారి పాండిత్యం గొప్పదని చెబుతారు. ఆయన మృదంగము కుడిప్రక్క తన చేతితో తడితే ఓంకారనాదము తప్ప ఇంకేమి వినిపించేది కాదు. అన్నమయ్య ఈ కీర్తన పల్లవిలో చెప్పిన తత్తాతిగుడి దింధి తక ధింధిం/తిత్తి తిత్తితి తితి తితి తితి అటువంటి పవిత్రమైన ధ్వని. 'తిరో తిరో జవరాల' అను కీర్తనలో కూడా ఇటువంటి పవిత్ర మృదంగ ధ్వనిని అన్నమయ్య అధికంగా వినియోగించాడు.

తిత్తితి తితి

అన్నమయ్య నరసింహ స్వామికి, మృదంగానికి సమన్వయించి పాట రాయటంలో ఈనాటికి సజీవ సాక్ష్యముంది. హైదరాబాద్ దగ్గర్లో ఉన్న నరసింహ స్వామి కొలువై ఉన్న యాదగిరి గుట్టలో ఇప్పటికి రాత్రుళ్లు మృదంగధ్వనులు కొందరికి వినిపిస్తుంటాయి. అన్నమయ్య రచించిన కీర్తనలు అభూత కల్పనలు కావు. చరిత్రకు సజీవ సాక్ష్యాలు. అర్థము చేసుకోవటములో మన జ్ఞానము తక్కువ కావచ్చేమో కాని, ఆయన కీర్తన ఒక ఆధ్యాత్మిక విజ్ఞాన గని.



## *26. తథా కురుష్వ*

తన భక్తులను కాపాడుతానని వివిధ అవతారములలో స్వామివారు చేసిన ప్రతిజ్ఞలను గుర్తు చేస్తూ, తనను రక్షించమని శరణు కోరుతూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది. (04–424)

**తథాకురుష్వ ముదా మామద్యేవ**
**అధోక్షజస్తే అనుదాసోహం**

**1. తవాస్మి శరణం దహ రాహుం**
**భవ దురితాని భంజ మమ**
**భువి కృతం చ యా పురా ప్రతిజ్ఞాం**
**జవన దదామి సర్వేభ్య ఇతి**

**2.వ్రజామి శరణం వరద తవాహం**
**త్యజితానుబంధ ధర్మ మమ**
**భజకృతాం పురా ప్రతిజ్ఞాం**
**వృజినై ర్మోక్షయిష్యామీతి**

**3.చింతితం మయా శ్రీ వేంకటేశ**
**కింతు త్వం మయి కృపాంకురు**
**త్వంతుహి పురాకృతం ప్రతిజ్ఞాం**
**అంతగతిం నయామీతి హి**

**తాత్పర్యము :**

ప్రీతితో నన్ను ఇప్పుడు అలా చేయవయ్యా! (అలా అంటే రక్షించమని అర్థం. ముందు చరణాలలో కవి వివరించబోతున్నాడు.) ఇంద్రియములచే గ్రహించుటకు అలవి కాని వాడా! నీ దాసులకు దాసుడను.

1. నీకు శరణాగతుడిని నేను. రాహువుని (కష్టాల ఛాయని) దహించవయ్యా! నా సంసార పాపాలని పోగొట్టవయ్యా! పూర్వము నువ్వు రామవతారంలో విభీషణునికి శరణమిచ్చే సమయంలో ఈ భూలోకంలో ఒక ప్రతిజ్ఞ చేసావు. భక్తులను రక్షించుటలో వేగము చూపించేవాడా! (= జవన) "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే । అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ ("ఎవరు వచ్చి నన్ను శరణు వేడినా నేను వారికి ఆశ్రయమిస్తాను. అది నా వ్రతం.") అని నీ ప్రతిజ్ఞ కదా! అప్పుడు విభీషణుడు కోరినట్లే నేను కూడా ఇప్పుడు నీ శరణము కోరుతున్నాను. అలా విభీషణునికి శరణమిచ్చినట్లే ప్రీతితో నన్ను ఇప్పుడు కాపాడవయ్యా!

2. ఓ వరాలిచ్చేవాడా! నేను నీశరణాన్ని కోరుతున్నాను. నాకు సంబంధించిన అన్ని రకాల అనుబంధాలు, ధర్మాలు విడిచి నీ శరణాన్ని కోరుతున్నాను. పూర్వము అర్జునుని కొరకు నువ్వు చేసిన "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మమేకం శరణం వ్రజ/ అహం త్వాం సర్వాపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" (18-66) ప్రతిజ్ఞను నువ్వు నిలబెట్టుకో. నేను చాలా పాపాలతో కూడిన పనులు (= వృజినైః) చేసాను. వాటినుంచి నన్ను విడిపించు.

3. శ్రీవేంకటేశుడా! నాచేత ఈ విధముగా ధ్యానింపబడింది. నువ్వు నాయందు దయను చూపించు. నువ్వు పూర్వము "అహంస్మరామి మద్భక్తాం నయమి

పరమాంగతిం" (ధ్యానించకపోయిన నా భక్తునికి మోక్షము ఇస్తాను) అని వరహా స్వామి రూపములో ప్రతిజ్ఞ చేసావు. మోక్ష మార్గానికి తీసుకు వెళతానని చెప్పిన నీ మాట నిలబెట్టుకో.

**విశేషాలు :**

తథాకురుష్వ ముదా మామద్యేవ (శక్తి ఉన్నప్పుడు నన్ను ధ్యానించి, మరణ సమయంలో శక్తిలేక నన్ను ప్రీతితో నన్ను ఇప్పుడు అలా చేయవయ్యా!)

ఇది అన్నమయ్య గీతాలలోని ఎత్తుగడకు సంబంధించిన ఒక విశేష ఫక్కి. పల్లవిలో ఉన్న పదానికి చరణాలలో వివరణ దొరుకుతుంది. అలా అంటే ఎలా అనే ప్రశ్న ఉత్సుకతతో చదువరికి వస్తుంది. రామ, కృష్ణ వరాహావతారాలలో భక్తులను రక్షించినట్లుగా – అనే జవాబు మూడు చరణాలు చదివిన తర్వాత లభిస్తుంది.

అధోక్షజస్తే (ఇంద్రియములచే గ్రహించుటకు అలవి కాని వాడా)

అధోక్షజ శబ్దము చాలా విశిష్టమైనది. అక్షజము అంటే ఇంద్రియ జ్ఞానము. ఎవరిని తెలియుటకు ఇంద్రియజ్ఞానము అసమర్థమైనదో అతడు అధోక్షజుడు. స్వల్ప శక్తి కలిగిన ఇంద్రియాలున్న నా వల్ల కాదయ్యా! నిన్ను తెలుసుకోవటము. అందుకే నన్ను రక్షించు అనే అర్థం వచ్చేటట్లుగా భావ యుక్తంగా అధోక్షజ శబ్దాన్ని అన్నమయ్య ప్రయోగించాడు.

దహ రాహుం(కష్టాల ఛాయని దహించవయ్యా)

రాహువు అనే వాడు ఒక గ్రహము. తండ్రి విప్రచిత్తి. తల్లి సింహిక. ఇతని తమ్ముడు కేతువు. రాహువు ఏ గ్రహంతో కలిసి ఉంటే ఆయాగ్రహాలకు సంబంధించిన రోగాలను ఇస్తాడు. రాహువు శరీరంలో కింది భాగం పాము శరీరం. రోగాలు, విషం ఇలాంటి వాటికి సంబంధించిన రాహు పీడ తనకు తొలగచేయమని కవి ఆంతర్యము. రాహుం దహ – అంటే రాహువుని కాల్చు అని స్వామిని అన్నమయ్య కోరుతున్నాడు. నరికితే అవశేషము ఉండి మళ్లీ సూర్యునిలా అప్పుడప్పుడు తనను బాధించవచ్చు. కాలిస్తే బూడిద అవుతుంది కనుక పూర్తిగా ఆ పీడ తొలుగుతుందని కావాలనే కవి దహ అని పదాన్ని చక్కగా వాడాడు.

పురా ప్రతిజ్ఞాం

యుద్ధానికి అంతా సిద్ధమయ్యారు. విభీషణుడు శ్రీరాముని దగ్గరకు

శరణమంటూ వచ్చాడు. అప్పుడు మిగతావారి అభిప్రాయాలు విన్నతర్వాత శ్రీరాముడు ఇలా అన్నాడు – సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే । అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ ॥ (యుద్ధకాండ 18–35 ). ఎవరు వచ్చి నన్ను శరణు వేడినా నేను వారికి ఆశ్రయమిస్తాను. ఈ మాటలు స్వామి వారికి గుర్తు చేస్తూ పాపినైన తనను కాపాడమని అన్నమయ్య కోరాడు.

అనుకూల్యస్య సంకల్పః, ప్రతికూల్యస్య వర్జనం
రక్షిష్యతి ఇతి విశ్వాసః, గోప్తృత్వవరణం తదా
ఆత్మ నిక్షేప కార్పణ్యే, షడ్విధా శరణాగతిః
– అని శరణాగతి ఆరు రకాలుగా ఉంటుంది.

1. దేవునికి ఇష్టమైన వాటినే పరిగ్రహించడం.
2. దేవునికి ఇష్టము కాని వాటిని విడచిపెట్టడం.
3. దేవుడు రక్షిస్తాడు అనే బాగా నమ్మటం.
4. దేవుని స్వచ్ఛమైన మనస్సుతో శరణు వేడటం.
5. దేవుని మీద మన భారాన్ని పూర్తిగా ఉంచటం.
6. మన చేతకాని తనాన్ని తెలియచేయడం.

అన్నమయ్య ఈ కీర్తనలో పైన చెప్పిన వాటిలో 3, 4, 5 పద్ధతులను ఈ కీర్తనలో వాడాడు. ఆయనను నమ్మాడు కనుకనే నీ దాసులకు దాసుడిని అన్నాడు. (3 వ శరణాగతి పద్ధతి). అన్ని రకాల అనుబంధాలు, ధర్మాలు విడిచి నీ శరణాన్ని కోరుతున్నానని తన స్వచ్ఛమైన మనస్సును తెలియచేసాడు. (4 వ శరణాగతి పద్ధతి). మోక్ష మార్గానికి తీసుకు వెళతానని చెప్పిన నీ మాట నిలబెట్టుకో. అంటూ స్వామి మీద పూర్తి భారాన్ని ఉంచాడు. (5వ శరణాగతి పద్ధతి).

అంతగతిం నయామీతి

చనిపోయే చివరి క్షణంలో ఏది అనుకొంటే అలా అవుతామని ఉపనిషత్తు. కాని సాధారణంగా ఆ క్షణంలో ఇంద్రియాలు జీవుని స్వాధీనంలో ఉండవు. దేవుని తలుచుకోవాలనుకొన్నా తలుచుకోలేకపోవచ్చు. ఇటువంటి వారందరిని ఉద్దేశించి వరాహస్వామి ఒక గొప్ప ప్రతిజ్ఞ చేసాడు. "ఇంద్రియాలు నీ స్వాధీనంలో ఉన్న సమయంలో – అంటే కాళ్లు, చేతులు, కళ్లు నువ్వు చెప్పినట్లు వినే స్థితిలో ఉన్నప్పుడు నా గురించి ధ్యానం చేయి. అందుకు ఫలితంగా నువ్వు చనిపోయే సమయంలో –

ఇంద్రియాలు నీ స్వాధీనంలో లేకపోయినా - నీ గురించి నేను ధ్యానించి, నీకు మోక్షమిస్తాను" "అహంస్మరామి మద్భక్తాం నయామి పరమాంగతిం". అన్నమయ్య ఈ మాటను మనందరి తరపున స్వామి వారికి విన్నవిస్తూ మనందరి చివరి దశలో ఆయనను తలుచుకోలేకపోయినామోక్షము ప్రసాదించమని కోరాడు.

ముగింపు

అన్నమయ్య చేసిన ఈ కీర్తనలోని నేను శబ్దము ఆయన ఒక్కడికి సంబంధించినది కాదు. ప్రతి జీవునికి సంబంధించినది. స్వామిని అన్నమయ్యలా ప్రార్థించి మనంకూడా పాపాలను దూరం చేసుకోవటానికి ప్రయత్నిద్దాం.



## *27. తవమాం ద్రష్టుం దయాస్తివా*

మధుర భక్తి పారవశ్యంలో ఒక నాయికగా మారి, వేంకటేశుని ఎత్తిపొడుస్తూ అన్నమయ్య రచించిన కీర్తన ఇది. (సంపుటము 5-114)

**తవమాం ద్రష్టుం దయాస్తివా**
**త్రివిధైర్ఘనానితేనామాని**

**1. కరరమణీ కంకణైర్ఘన కుచ**
**గిరౌ స్థాపిత కిన్నరీయం**
**సరసం మ్లేచ్ఛరచనాని త్వయి**
**స్థిరా నదయతి తే నామాని**

**2. కలరవ కంపిత కంఠవిలసనం**
**కిలకిల మేళన కిన్నరీయం**
**లలనా కావా లంఘిత వాద్యం**
**తిలకయతి తదా తే నామాని**

**3. నిరత మూర్ఛనా నిబిడతాళరవ**
**గిరాయోజిత కిన్నరీయం**
**తరుణీ రణయతి తదా సమీపే**
**తిరువేంకటవర తే నామాని**

**తాత్పర్యము :**

నీకు నన్ను చూడటానికి దయ ఉందా!? నీ పేర్లు మూడు విధాలుగా గొప్పవి.

1. చేతులకు మణులతో కూడిన కంకణాలు ధరించిన ఆ స్త్రీ తన స్తనపర్వతములో కిన్నర అను పేరు గల వీణను హత్తుకొంటూసరసమైన అన్యదేశ రచనలు కలిగిన నీ పేర్లను వీణపై స్థిరంగా పలికిస్తోంది. (ఎంతగా ఆవిడని కరగించావో!. ఆవిడ గారు

నీ పేర్లు వీణలో పలికిస్తూ తాదాత్మ్యంలో కరిగిపోతోంది!)

2. పావురంలా వణుకుతున్న కంఠ విలాసంతో కిలకిలధ్వనుల మేళనమున్న కిన్నరవీణతో వాయిద్యాల ధ్వనిని మించిపోయేటట్లు ఈ అమ్మడెవరయ్యా బాబూ! నీ పేర్లను ఆ వీణా ధ్వనిలో మాకు దర్శింపచేస్తోంది.

3. ఎప్పుడూ స్వర మూర్ఛనలతో (సప్తస్వరముల యొక్క ఆరోహణావరోహణములను మూర్ఛనలందురు) దట్టంగా ఉన్న తాళాల మోతతో, వాక్కులతో కూడిన ఈ కిన్నర వీణను నీ సమీపములో కూర్చొని ఇంకొక తరుణి ఓ తిరుపతి దేవా! నీ పేర్లు వచ్చేటట్లుగా మోగిస్తోంది.

**విశేషాలు :**

నిరత మూర్ఛనా (ఎప్పుడూ స్వర మూర్ఛనలతో)

సప్తస్వరముల యొక్క ఆరోహణావరోహణములను మూర్ఛనలంటారు. మూర్ఛనలను నిఘంటువులు రకరకాలుగా పేర్కొన్నాయి.

1. ఉత్తర మంద్రము, 2. రజని, 3. ఉత్తరాయతము, 4. శుద్ధ షడ్జము, 5. మత్సరికృతము, 6. అశ్వక్రాంతము, 7. అభిరుద్గతము, 8. సౌవీరము, 9. హరిణాశ్వము, 10. కళోపనతము, 11. శుద్ధమధ్యము, 12. మార్గి, 13. పౌరవి, 14. హృష్యకము

ఏకవింశతి-మూర్ఛనలు :

(అ.) 1. ఉత్తరమంద్ర, 2. రజని, 3. ఉత్తరాయత, 4. శుద్ధ షడ్జ, 5. మత్సరీకృత, 6. అశ్వక్రాంత, 7. అభిరుద్గత, 8. సౌవీరి, 9. హరిణాశ్వ, 10. కలోపనత, 11. శుద్ధమధ్య, 12. మార్గి, 13. పౌరవి, 14. హృష్యక, 15. నంద, 16. విశాల, 17. సుముఖి, 18. చిత్ర, 19. చిత్రవతి (మోహిని), 20. సురవ, 21. ఆలాప.

(ఆ.) 1. నంద, 2. విశాల, 3. సుముఖ, 4. చిత్ర, 5. చిత్రవతి, 6. సురవ, 7. బల, 8. అప్యావతి, 9. విశ్వభ అత, 10. చంద్ర, 11. హేమ, 12. కపర్దిని, 13. మైత్రి, 14. బార్హతి, 15. ఉత్తరచంద్ర, 16. అభిరూధత, 17. అశ్వక్రాంత, 18. సౌవీర, 19. హృషిక, 20. ఉత్తరాయత, 21. రజని.

కిన్నరవీణ

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో పేర్కొన్న 41 వీణలలో కిన్నర వీణ కూడా ఉంది.

శా. ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీ సఖమైన మోమున బటాగ్రంబత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చె కిన్నరవధూ రాజత్కరాంభోజ కాం
భోజీమేళ విపంచికారవ సుధాపూరంబు తోరంబుగన్

(భట్టుమూర్తి-వసుచరిత్ర)

గిరికాదేవి కాంభోజిరాగంలో తియ్యగా ఏడ్చిందట. - కిన్నరస్త్రీలు తమ మృదువైన చేతులతో కాంభోజీరాగంలో మేళవించి మీటుతున్న మధుర వీణా శబ్దంతో తన స్వరాన్ని కలిపి గిరికాదేవి శోకించిందని కవి వర్ణన. మొత్తానికి కిన్నర స్త్రీలు వీణ వాయించుటలో నిపుణులని, వాళ్ల వీణలు అంత గొప్పవని భట్టు మూర్తి కూడా అన్నమయ్యకు వంత పాడుతున్నాడు.

ముగింపు

వేంకటేశునిపై అన్నమయ్యకు ఉన్న భక్తి - శృంగారపు మాటలుగా రూపు మార్చుకొని, ఈ గీతంలో మధుర భక్తి పరిమళాలు వెద జల్లింది.



## *28. తే శరణమహం*

శ్రీవేంకటేశుని గుణగణాలను ప్రశంసిస్తూ, స్వామిని నిండు హృదయంతో శరణు కోరుతూ అన్నమయ్య రచించిన కీర్తన ఇది. (సంపుటము 2-401)

**తే శరణమహం తే శరణమహం**
**శైశవకృష్ణ తే శరణం గతోఽస్మి**

**1. దశవిధావతార! ధర్మరక్షకమూర్తి**
**దశమస్తకాసురదళన**
**దశదిశాపరిపూర్ణ! తపనీయస్వరూప**
**దశావరణ లోకతత్వాతీత!**

**2. సహస్రలోచన సంతతవినుత!**
**సహస్రముఖశేషశయనా**
**సహస్రకరకోటిసంపూర్ణతేజా**
**సహస్రారదివ్యచక్రాయుధా!**

**3. అనంతచరణ! సర్వాధారాధేయ**
**అనంతకరదివ్యాయుధా!**
**అనంతనిజకల్యాణగుణార్ణవ**
**అనంత! శ్రీవేంకటాద్రినివాసా**

**తాత్పర్యము :**

పదహారేండ్ల లోపు వయస్సు శైశవము. (శిశువు యొక్క భావము శైశవము). అటువంటి శైశవములో ఉన్న – ఓ బాలకృష్ణా! నీకు నేను శరణము కోరేవాడిని. నీ శరణాన్ని నేను పొంది ఉన్నాను.

1.పది రకాలుగా అవతారాలు ఎత్తినవాడా! ధర్మాన్ని రక్షించే రూపము కలవాడా! పదితలలు కల రావణాసురుని చంపిన వాడా! పది దిక్కులలోను నిండి ఉన్నవాడా! (1. తూర్పు, 2. పడమర, 3. ఉత్తరము, 4. దక్షిణము, 5. ఐశాని, 6. నైరృతి, 7. వాయవ్యము, 8. ఆగ్నేయము, 9. ఊర్ధ్వదిశ, 10. అధోదిశ – ఓ సూర్య స్వరూపా! భూమి, గాలి, నీరు, అగ్ని, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము, జీవుడు, పరమాత్మ – అను పది ఆవరణములలో ఉన్నవాడా! 1. ప్రకృతి, 2. పురుషుడు, 3. బుద్ధి (మహత్తత్త్వము), 4. అహంకారము, 5. మనస్సు, పంచజ్ఞానేంద్రియములు, 1. శ్రోత్రము, 2. చర్మము, 3. చక్షుస్సు, 4. జిహ్వా, 5. నాసిక – పంచ కర్మేంద్రియములు 1. వాక్కు, 2. హస్తములు, 3. పాదములు, 4. పాయువు, 5. ఉపస్థ., ) పంచ మహాభూతములు (1. పృథివి, 2. జలము, 3. తేజస్సు, 4. వాయువు, 5. ఆకాశము) పంచ తన్మాత్రలు. (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు.) అను ఇరవై అయిదు తత్త్వాలకు అతీతుడా! నీ శరణాన్ని నేను కోరుతున్నాను.

2. వేయి కన్నులున్న ఇంద్రునిచే ఎప్పుడూ పొగడబడేవాడా! వేయి పడగలున్న ఆదిశేషుని శయ్యగా కలిగినవాడా! కోట్లాది సూర్యుల సంపూర్ణమైన కాంతి కలిగినవాడా! వేయి అంచులున్న దివ్యమైన చక్రాయుధము ఆయుధముగా కలిగినవాడా! నీ శరణాన్ని నేను కోరుతున్నాను.

3.అనేక పాదములు కలిగినవాడా! ఒకదానిపై ఉండతగినది ఆధేయము. దాని క్రిందిది ఆధారము. అన్ని రకములైన ఆధేయాధార స్వరూపుడా! అనేక చేతులలో దివ్యాయుధములు ధరించినవాడా! ఇది చివర అని చెప్పలేని అనేక శుభగుణములకు సముద్రమువంటి వాడా! అంతములేనివాడా! ఓ విష్ణు మూర్తీ! శ్రీవేంకట పర్వతముపై ఉండువాడా! నీ శరణాన్ని నేను కోరుతున్నాను.

**విశేషాలు :**

తే శరణమహం

ఒక పక్క నేను నీ శరణము (= రక్షణ) పొంది ఉన్నాను అంటూ, అదే పల్లవిలో, నీ శరణాన్ని కోరే వాడిని అంటూ విభిన్నంగా కవి వాక్యాలు ఉన్నాయి. దీనిని ఇలా సమన్వయించుకోవాలి. సంసారములో ఒక సమస్య విషయంలో దేవుడు రక్షణ చేసి ఉండవచ్చు. కాని ఇంకో సమస్య సిద్ధంగా ఉంటుంది. కనుక ఒక విషయంలో రక్షించినవాడివి నువ్వే అంటూ, ఇంకొక విషయంలో రక్షణ ఇవ్వవలసినవాడివి నువ్వే అని దేవుడి మీద భారము ఉంచుట – ఈ రెండు రకాల శరణోక్తులలోని ఆంతర్యము.

శైశవకృష్ణ

కృష్ణుని శైశవమంటే కవులకు చాలా ప్రీతి.

కారుణ్య కర్బుర కటాక్షనిరీక్షణేన
తారుణ్యసంవలిత శైశవ వైభవేన
ఆపుష్ణతా భువన మద్భుత విభ్రమేణ
శ్రీకృష్ణచంద్ర! శిశిరీకురు లోచనం మే.

(ఓ కృష్ణా! చంద్రుడిలా నువ్వు లోకానికి చల్లదనాన్ని ఇస్తావయ్యా! భక్తుల కళ్ళకి ఆనందాన్నీ ప్రసాదిస్తావు. దయతో కలిసిన నీ చూపులూ, యౌవనం కలగలిపిన పసిదనంతో ప్రకాశించే నీ వైభవమూ, ఆశ్చర్యం కలిగించే నీ విలాసాలూ, నా వైపు ప్రసరించి నా కళ్ళకి చల్లదనాన్ని కలగచేయవయ్యా!) అని లీలాశుకుడు మొదలైనవారు శైశవ కృష్ణుని పొగిడి పరవశించిపోయారు. అందుకే అన్నమయ్య కూడా శైశవ కృష్ణుని ఈ కీర్తనలో సంభావించాడు. శైశవ శబ్ద ప్రయోగంలో ఇంకో విశేషము కూడా ఉంది. పదహారేండ్ల లోపు వయస్సును శైశవమని అమరము చెబుతోంది. ఈ పదహారు సంఖ్యకు చాల ప్రశస్తి ఉంది. యజ్ఞంలో పదహారు మంది ఋత్విజులు కావాలి. చంద్రునివి పదహారు కళలు. గౌరి, పద్మ, శచి, మేధ, సావిత్రి, విజయ, జయ, దేవసేన, స్వధా, స్వాహా, శాంతి, పుష్టి, ధృతి, తుష్టి, కులదేవత, ఆత్మదేవత అని షోడశ మాతృకలు.

ద్రవ్య శుద్ధి, క్షేత్ర శుద్ధి, గృహ శుద్ధి, భాండ శుద్ధి, తృణ శుద్ధి, కాష్ఠ శుద్ధి, వీటికా శుద్ధి, పాక శుద్ధి, రస శుద్ధి, భవ శుద్ధి, భూత శుద్ధి, భావ శుద్ధి, మార్గ శుద్ధి, కాల శుద్ధి, వాక్ శుద్ధి, జన శుద్ధి. ఇవి పదహారు శుద్ధులు. (బసవేశ్వర గీతామృతం)

అనిశుద్ధులు పదహారు.

జీవి గర్భంలో పడినది మొదలు అంత్య సంస్కారం వరకు జరిగే సంస్కారాలు పదహారు. స్వామి వారికి చేసే ఉపచరాలు పదహారు. ఇటువంటి షోడశ సంఖ్య పరిపూర్ణతకు గుర్తు కనుక అన్నమయ్య పదహారేళ్ల లోపు ఉన్న శైశవ కృష్ణుని భావించాడు.

దశమస్తకాసురదళన (పదితలలు కల రావణాసురుని చంపినవాడా!)

రావణాసురునికి పది తలలు రావటానికి తమాషాగా ఒక కథ చెబుతారు. నరసింహస్వామి సంహరించే సమయములో "ఇరవై ఆయుధాలతో (గోళ్లతో) నన్ను చంపడం ధర్మమా?" అని హిరణ్యకశిపుడు ప్రశ్నించాడు. "అయితే సరే! వచ్చే జన్మలో నువ్వు ఇరవై చేతులు, పది తలలతో జన్మిస్తావు. అప్పుడు నేను ఒక మాములు వ్యక్తిలా నిన్ను చంపుతాను" అని నరసింహుడు చెప్పాడట. అందుకని రావణునికి పది తలలని ఒక తమాషా కథ.

జ్ఞానేంద్రియములు ఐదు, కర్మేంద్రియములు ఐదు – వెరసి పదితలల రావణాసురుడు. పది తలలలోని అంతరార్థం ఇది అని పండితులు చెబుతారు.

ముగింపు

అపార పాండిత్యమున్న అన్నమయ్య కవితా వాహినిలో పదాలు సంబంధిత పదాలతో గబగబా వచ్చి పక్కన చేరతాయి. దశవిధావతారా! అని చరణము మొదలుపెట్టాడు. దశమస్తకాసురదళన, దశదిశాపరిపూర్ణ, దశావరణ లోకతత్వాతీత! ఇలా శబ్దాలంకారయుక్తంగా పదాలు ఆయన కీర్తనలోకి చేరి స్వామి వారి సేవను చేసుకొంటాయి. ఇది అన్నమయ్య కీర్తనల్లో కనిపించే ప్రత్యేకత.



## *29. త్వమేవ శరణం*

సుభద్రా బలరాములతో కూడిన పూరీ జగన్నాథుని వేంకటేశునిగా శరణు కోరుతూ అన్నమయ్య రచించిన కీర్తన ఇది. (సంపుటము 1–323)

**త్వమేవ శరణం త్వమేవ శరణం**
**కమలోదర శ్రీజగన్నాథా**

**1. వాసుదేవ! కృష్ణ! వామన! నరసింహ!**
**శ్రీసతీశ! సరసిజనేత్రా!**
**భూసురవల్లభ! పురుషోత్తమ పీత**
**కౌశేయవసన! జగన్నాథా**

**2. బలభద్రానుజ! పరమపురుష! దుగ్ధ**
**జలధివిహార! కుంజరవరద**
**సులభ! సుభద్రాసుముఖ! సురేశ్వర!**
**కలిదోషహరణ జగన్నాథా**

**3. వటపత్రశయన! భువనపాలన! జంతు**
**ఘటకారకరణ! శృంగారాధిపా!**
**పటుతర! నిత్యవైభవరాయ! తిరువేం-**
**కటగిరినిలయ జగన్నాథా**

**తాత్పర్యము :**

నువ్వే శరణము. నువ్వే శరణము. పద్మము నాభిలో కలవాడా! ఓ జగన్నాథ స్వామీ!

1. వసుదేవుని కుమారుడా! కృష్ణుడా! వామనుడా! నరసింహ స్వామీ! లక్ష్మీదేవికి ప్రభువా! పద్మములవంటి కన్నులు కలవాడా! బ్రాహ్మణులకు ప్రభువా! పురుషోత్తముడా! పచ్చనివస్త్రములు ధరించిన వాడా! ఓ జగన్నాథ స్వామీ!

2. బలరాముని తమ్ముడా! పరమాత్మా! పాలసముద్రములో విహరించేవాడా! ఏనుగుకు వరము ఇచ్చిన వాడా! (కుంజరము = కుంజము (వెంట్రుక) కలది. సులభుడా! సుభద్రాదేవికి ప్రసన్నుడా! దేవ నాయకుడా! కలిదోషములైన పాపములను హరించువాడా! ఓ విష్ణుమూర్తీ!

3. మఱ్ఱి ఆకునందు శయనించువాడా! లోకములను పాలించువాడా! శరీరాలను కుండలను నిర్మించువాడా! శృంగారరసానికి అధిపతీ! మిక్కిలి బలమైన వాడా! నిత్య వైభవములతో ప్రకాశించేవాడా! పూజ్యమైన, శుభమైన వేంకట పర్వతముపై నివసించువాడా!

**విశేషాలు :**

పూరి జగన్నాథుడు

ఈ క్షేత్రానికి సంబంధించిన కథను పురాణనామచంద్రిక లో యెనమండ్రం వెంకటరామయ్య ఇలా చెప్పారు. "ఇది పురుషోత్తమ (విష్ణు) క్షేత్రము. కృష్ణుని నిర్యాణమునకు పిమ్మట ఆయన దేహమును దహనము చేయుచు ఉండగా సముద్రము పొంగి ద్వారకా పట్టణమును ముంచెను. అప్పుడు ఆ దేహము సంపూర్ణదగ్ధము కాక

సముద్రమునందు కొట్టుకొనిపోవుచు ఉండగా, దానిని కొందరు భక్తులు దారువునందు సంపుటముచేసి ఇచట స్థాపించిరి."

ఇంకొక రకమైన కథ ప్రజలలో ప్రచారంలో ఉంది. అది ఇది. – పూరీలో నీలమాధవుని (= విష్ణువు) మందిరం నిర్మించాలని ఇంద్రద్యుమ్నుడనే రాజు అనుకొన్నాడు. ఎన్నో అడ్డంకులు వచ్చాయి. తన సంకల్పం నెరవేరాలన్న పట్టుదలతో సముద్రపు తీరములో ప్రాయోపవేశము (= పస్తులతో ప్రాణమును విడిచిపెట్టడమనే వ్రతము) చేసాడు. అతని దీక్షకు సంతసించి నీలమాధవుడు అశ్వమేధ యాగం చేయమని సందేశము ఇచ్చాడు. ఆ యాగపు పూర్ణాహుతి వేళ సముద్రం నుంచి ఒడ్డుకు ఒక దారువు (కొయ్య దుంగ) చేరుతుందని చెప్పాడు. ఆ దారువుతో విగ్రహాన్ని చేయమని చెబుతాడు. అలా ఏర్పడిందే జగన్నాథుని కొయ్య బొమ్మ. జగన్నాథుడు వెలిసిన ప్రదేశం కాబట్టి మొదట ఇది జగన్నాథ పురిగా పేరు వచ్చింది. క్రమంగా పూరీ జగన్నాథమయింది.

ప్రతి సంవత్సరము ఒక కొత్త రథం జగన్నాథునికి నిర్మిస్తారు. 'వస్తున్నాయ్ వస్తున్నాయ్ జగన్నాథ రథ చక్రాలు వస్తు న్నాయి – అంటూ శ్రీ శ్రీ ఉన్నతమైన జగన్నాథుని రథాన్ని, రథ చక్రాలను మనస్సుల్లో గిరగిరా తిప్పాడు. పూరీ జగన్నాథుని రథయాత్ర ఆషాఢ శుద్ధ విదియనాడు జరుగుతుంది.

పూరీజగన్నాథస్వామి, సుభద్ర, బలభద్రుల మూలమూర్తులకు రథయాత్ర నిర్వహించిన తరువాత మహాప్రసాదాన్ని పేరిట ఒకే పళ్లెంలో అందరు భక్తులకు జాతి, కుల ప్రస్తావన లేకుండా ఒకే పంక్తిలో కూర్చోబెట్టి పెడతారు. ఇలా అందరూ ఒక చోట చేరి ప్రసాదాన్ని స్వీకరిస్తారు. ఈ క్షేత్రంలో అన్నంచేతికి తగిలితే అంటు దోషము లేదట. కాబట్టి 'సర్వం జగన్నాథం' అని సామెత వచ్చిందట.

జంతుఘట కార కరణ (= శరీరాలను కుండలను నిర్మించువాడా!)

జగన్నాథుని సంబోధిస్తూ అన్నమయ్య వ్రాసిన ఈ కీర్తనలో కొన్ని మాములు పదాలున్నా జంతుఘట కార కరణ వంటి విలక్షణ సంబోధనలు కూడా ఉన్నాయి. భగవంతుడు ఈ శరీరాలను కుండలను నిర్మిస్తున్నాడు.

జీవితం అనేది ఒక నీటికుండ. చివరలో చేసే సంస్కారంలో చేసేవాడి భుజం మీద నీటి కుండ పెడతారు. మొదటి ప్రదక్షిణలో ఒక రంధ్రం నుంచి బాల్యమనే నీరు కారిపోతుంది. రెండవ ప్రదక్షిణలో కుండకు చేసే రంధ్రంలో కారిపాయే నీరు

యవ్వనానికి సంకేతము. మూడవ ప్రదక్షిణలో కారిపోయే నీరు ముసలితనానికి గుర్తు. కుండను నేలకు కొట్టి వెనక్కు చూడకుండా వెళ్లమంటారు. ముక్కలైన కుండ అన్ని దశలను దాటి చనిపోయిన వాడికి గుర్తు.

వెనక్కి చూడకుండా – అంటే చనిపోయిన వాడి సంగతి ఆలోచించకుండా– నీదోవన నువ్వు వెళ్లిపో – అని సంబంధీకులకు ఒక ఉపదేశము. ఎవడి బతుకు వాడిదే. ఎవడి చావు వాడిదే. ఎవడి ఉద్ధరణ వాడిదే.

ఘటము జలములందు గగనంబు కనఁబడు
ఘటము జలము లేమి గగనమేది ఘటములోన
జ్యోతిఁ గ్రమమునఁ దెలియుఁడీ
విశ్వదాభిరామ వినర వేమ!

అని వేమన్న అన్నమయ్య ఘటకారకరణ పద ప్రయోగములోని ఆంతర్యాన్ని వివరించాడు. ఈ శరీరమనే కుండలోని జ్యోతిని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తుండాలి.



## *30. త్వమేవ శరణం త్వామేవ (4-42 అను)*

**త్వమేవ శరణం త్వామేవ మే**
**భ్రమణం ప్రసరతి ఫణీంద్రశయన**

**1. కదా వా తవ కరుణా మే**
**సదా దైన్యం సంభవతి**
**చిదానందం శిథిలయతి**
**మదాచరణం మధు మథన ॥త్వమే॥**

**2. మయా వా తవ మధుర గతిః**
**భయదిహ విభ్రాంతోఽహం**
**తయా విమలం దాతవ్యా**
**దయా సతతం ధరణీరమణ ॥త్వమే॥**

**3. ఘనం వా మమ కలుషమిదం**
**అనంత మహిమాయతస్య తే**
**జనార్దన ఇతి సంచరసి**
**ఘనార్జన వేంకటగిరి రమణ ॥త్వమే॥**

**తాత్పర్యము :**

మెలికలు తిరిగే పాము మీద (ఆదిశేషుని మీద) పడుకొన్నవాడా! (ఫణీంద్రశయన) ఓ వేంకటేశ్వరా! ఈ జీవితం రకరకాల కష్ట సుఖాల చక్రభ్రమణంలో – ఒక స్థిరత్వం

లేకుండా అటూ ఇటూ తిరుగుతోంది. (భ్రమణం ప్రసరతి) ఒకచోట ఉండక, అటూ ఇటూ భ్రమిస్తూ మెలికలు తిరిగే పామును అదుపులో పెట్టడం బాగా అలవాటు నీకు ఉంది కదయ్యా! నా జీవితపు చక్రభ్రమణం అదుపు చేయవయ్యా! నువ్వే శరణం. నాకు నువ్వే శరణం. ఇంకొకరు దిక్కులేదు. (త్వమేవ శరణం త్వమేవ మే)

1. స్వామీ! నా మీద నీ దయ ఇంకా ఎంతకాలానికయ్యా! (కదా వా తవ కరుణా మే). అడుగడుగునా భౌతిక సుఖాలముందు దీనుడిని అయ్యాను. దీనస్థితి కలుగుతోందయ్యా! (సదా దైన్యం సంభవతి) మధువనే రాక్షసుని చంపినవాడా! భౌతిక సుఖాన్ని మథించేవాడా! (మధుమథనా) ఏదయితే ఈ జీవులకు కావాలో ఆ విశుద్ధ జ్ఞాన పూర్వకమైన ఆనందం (చిదానందం) నాలో బలహీనమౌతోంది. (శిథిలయతి). ఆ చిదానంద ప్రాప్తికి ఈ భౌతికానందాలు, నా నడవడిలో (మత్ + ఆచరణం), నా మద ప్రవర్తనలో (మద + ఆచరణం) (మదమంటే మత్తు, పిచ్చి, గాఢమైన కోరిక, గర్వం మొదలైనవి) అడ్డుగోడలౌతున్నాయి. నువ్వు మధుమథనుడివి. నా మీద నీ దయ చూపించవయ్యా! ఎప్పుడయ్యా నీదయ నామీద ప్రసరించేది? (కదా వా తవ కరుణా మే)

2. ఈ లోకంలో (ఇహ) నేను (అహం) జన్మ మృత్యు జరా భయాలతో (భయాత్) మాయలో ఉన్నాను (విభ్రాంతః). అటువంటి నాకు (మయా) నీ (తవ) మధుర మార్గమే (మధురగతిః) అంటే శరణమే దిక్కు. ఓ భూదేవికి ఇష్టమైనవాడా! (ధరణి రమణా) ఆ మధురమార్గంలో (తయా) నేను నడవాలంటే, ఎప్పుడూ (సతతం) నీ దయ ఇయ్యదగినది (దాతవ్యా).

3. ఓ జనార్దనా! (సముద్రం మధ్య ఉండే జనులనే రాక్షసులను సంహరించినవాడా!) నువ్వు ఇది చివర అని చెప్పలేని అనంతమైన, విస్తృతమైన మహిమల మార్గంలో (అనంత మహిమాయతన్య) ఎప్పుడూ తిరుగాడే వాడివి (సంచరసి). అత్యధికమైన పాపాలను పోగొట్టే నీ విస్తృతమైన దయా మహిమల వైశాల్యంతో పోలిస్తే ఈ (ఇదం) నా పాపం అంత ఎక్కువైనదా చెప్పు? (ఘనం వా మమ కలుషం) నువ్వు దయతలిస్తే నా పాపాలన్నీ నశిస్తాయి. ఓ ఘనార్జనా! ఘనమైన భక్తి సంపాదన కలిగినవాడా! (అంటే అనేకమంది భక్తులు కలవాడా!) ఓ వేంకటపర్వతంపై ఉంటూ అందరికి ఇష్టమైనవాడా! (వేంకటగిరిరమణ) వేంకటేశా! నువ్వే శరణం. నాకు నువ్వే శరణం. ఇంకొకరు దిక్కులేదు.



## *31. దంతచ్ఛద ముద్రా*

వేంకటేశ్వర స్వామివారు చేసిన శృంగారచేష్టలను వర్ణిస్తూ, ఆయన ఆస్థాన కవి అన్నమయ్య "అహెూ" అంటూ మృదుమధురంగా రచించిన కీర్తన ఇది. (సంపుటము 05-318)

**దంతచ్ఛద ముద్రా మదనాస్త్ర ల**
**తాంత శాంతి కృతి రహెూ భవతి**

**1.వనితా కుచయోర్వర నఖరేఖా**
**ర్జన శశిచిహ్నం సఫలమిదం**
**ఘనకరుణాం మయి ఘటయ చంద్ర ఇ**
**త్యనునయ కారణమహెూ భవతి**

**2.సతీమణి విలసత్కర మూలే**
**చతుర లాంఛనం సఫలమిదం**
**ప్రతతి భయ హృదే వరదాస్య కలన**
**మతిఘాతాకృతిరహెూ భవతి**

**3.తరుణీతనుగంధ విలేపన వి**
**స్తర సౌభాగ్యం సఫలమిదం**
**పరిరంభ సుఖే తిరువేంకటగిరి**
**హరేః పూజనమహెూ భవతి**

**తాత్పర్యము :**

అమ్మవారి ముఖముపై శ్రీవారు చేసిన పంటి గాటు ముద్ర (= దంతచ్ఛద ముద్ర) పూలతో (= లతాంత) శాంతిరచన అవుతోంది. ఆశ్చర్యము. పంటి గాటు – బాధ కలిగించి కోపము తెప్పించాలి కాని, శాంతి ఎలా అవుతుందో ఆశ్చర్యము కలిగిస్తోందని కవి చమత్కారము. ఇది కారణము తెలిసి కూడా తెలియనట్లుగాచెప్పే నిగూఢ కవితా ప్రక్రియ. విడి సమయాలలో పంటి గాటు బాధ కలిగిస్తుంది కాని ఆనంద యుద్ధాల్లో శాంతిని, సంతోషాన్ని కలిగిస్తుందనే శృంగార విషయము కవిగారికి తెలిసి కూడా తెలియనట్లు అహెూ! అంటున్నాడు. ఇది కవిత్వంలో ఆనందాన్ని కలిగించే చమత్కారము అమ్మవారి స్తనములపై శ్రేష్ఠమయిన శ్రీవారి గోటి గుర్తుతో ఏర్పడిన చంద్రరేఖ రూపము సఫలమయింది.

1. శ్రీవారితో విరహము ఏర్పడిన సందర్భములో "ఓ చంద్రుడా! నాపై దయనుచూపించవయ్యా!" అని అమ్మవారు ప్రార్థించుకోవటానికి, బుజ్జగించుకోవటానికి హృదయానికి దగ్గరగా చంద్రుని రూపాన్ని అయ్యవారు ఏర్పాటు చేసారు. అహెూ! శ్రీవారి నేర్పు ఎంత ఆశ్చర్యము!?

(చంద్రుడు విరహంలో ఉన్నవారిని బాగా బాధ పెడతాడుట. అందుకే కావ్యాల్లో విరహంలో ఉన్న నాయికా నాయకులు చంద్రుడిని బోలెడన్ని తిట్లు తిడతారు. కాని ఇక్కడ అన్నమయ్య బాధ పెట్టద్దని ముందుగానే చంద్రుడితో బుజ్జగింపుల బేరం మొదలుపెట్టాడు. అయ్యవారు చేసిన చంద్రరేఖ అమ్మవారికి వారు ప్రసాదించిన చంద్ర రూపమట. అన్నమయ్యా! నమస్కారము.)

2. అమ్మవారి మెరయుచున్న బాహుమూలములో అయ్యవారు చేసిన ఈ నేర్పుకలిగిన గోటి గుర్తు రూపము సఫలమయింది. శ్రీవారితో విరహము ఏర్పడిన సందర్భములో అమ్మవారు చెట్ల దగ్గర నడిచేటప్పుడు ఆమెకు తీగలు చుట్టుకొనక తప్పదు. వాటి రాపిడితో శరీరానికి బాధ కూడా తప్పదు. అందుకే దయామయుడైన అయ్యవారు దాస భావముతో ఆ అనంద సమయములో చేసిన ఈ మిక్కిలినొక్కు (నఖ క్షతము) ఆ తీగల బాధని ముందే అమ్మవారికి అలవాటు చేస్తోంది. అహో! శ్రీవారి నేర్పు ఎంత ఆశ్చర్యము!

3. అమ్మవారి శరీరముపై, అయ్యవారు పూసిన శ్రీగంధపు సౌభాగ్యము విస్తరించి సఫలమవుతోంది. శ్రీ వేంకటేశునికి పూజలో ఎలాగు గంధపు పూజ చేయాలి కదా! అదేదో – (ఆ గంధపు పూజ) తన కౌగిలి సుఖములోనే అమ్మవారు ఆయ్యవారికి చేస్తోంది. అహో! శ్రీవారి నేర్పు ఎంత ఆశ్చర్యము! (కౌగిలిలో అమ్మవారి ద్వార అంటుకొన్న గంధము అయ్యవారికి గంధపు పూజట. నమస్కారము.)



## *32. దశవిధాచరణం*

వేంకటేశ్వర స్వామివారు దశావతారాలను ధరించుట ఆయన శృంగార అవస్థలను పొందుట కొరకని, అన్నమయ్య ఒక ఖండిత నాయికగా మారి స్వామివారిని అధిక్షేపిస్తున్న కీర్తన ఇది. (సంపుటము 05–374)

**దశవిధాచరణం తన్నభవతి**
**దశవిధావస్థార్థం తే తత్ర**

**1.స్థాపయిష్యామి వేదానితి వ్యాజేన**
**దీపితోయం మత్స్యదేహః పురా**
**వ్యాపారోయమేవం న చ తరుణ్యా**
**రూప జలధౌ కేళిరుచయే తత్ర**

**2. ధారయిష్యామి మందరమితి వ్యాజేన**
**చారుకచ్ఛపవిధాచరణం పురా**
**నీరసేయం తవ మనీషా ప్రియవధూ**
**భారకుచమందరౌ భర్తుం తత్ర**

**3. భువముద్ధరిష్యామి పునరితి వ్యాజేన**
**ధవళకిటి వైభవం ధత్సే పురా**
**వ్యవహృతిరియం న చ మహామహీకుచ తటే**
**తవ దంతక్షతం దాతుం తత్ర**

**4. దనుజం హరిష్యామి తమితి వ్యాజేన**
**ఘన నారసింహవిక్రమణం పురా**
**దనుజహర తవ మహత్త్వం తన్నచ నఖా**
**ర్జనమిందిరాయా(యాం) ప్రసర్తుం తత్ర**

**5. అపహరిష్యామి బలిమహమితి వ్యాజేన**
**కపటవామనరూపకలనం పురా**
**నిపుణ ఏవం నఖలు నియతిస్సతీషు తే**
**కపటాచరణం ఘటయితుం తత్ర**

**6. సంహరిష్యామి నృపజనమితి వ్యాజేన**
**బహ్వారుణతోయే ప్రాప్తిః పురా**
**సింహవిక్రమణతే స్థితిరియం నచ సతీ**
**విహ్వాలత్వం తదా వేత్తుం తత్ర**

**7.రావణం జేష్యామి రణయితి వ్యాజేన**
**భూవరత్వే తే భోగః పురా**
**ఏవం నభవతి మహీసుతా విరహం**
**సావధానేన ప్రహర్తుం తత్ర**

**8.కంసం హనిష్యామి ఖలమితి వ్యాజేన**
**సంసారోయమాచరితః పురా**
**హింసాదూర నచ హితమిదం వ్రజ వధూ**
**సంసరణలీలాం ప్రసక్తుం తత్ర**

**9.పాతయిష్యే ప్రలంబమితి వ్యాజేన**
**జాతరోషస్య తే జననం పురా**
**భూతరక్షక తే ప్రభుత్వం తన్నఖలు**
**భూతలే రేవతీం భోక్తుం తత్ర**

**10.బుద్ధో భవిష్యామి పురహృతివ్యాజేన**
**బద్ధరోష ఇతి తే ప్రాప్తిః పురా**
**తద్ధితం నహిఖలు తదా వధూహస్త**
**సిద్ధప్రసారేణ సేవితుం తత్ర**

**11.మారయిష్యామి కలిమతమితి వ్యాజేన**
**క్రూర కల్క్యవతార కోపః పురా**
**ధీర వేంకట నగాధీశ ఏవం నఖలు**
**భీరుమూర్వీం సంప్రణయితుమత్ర**

**తాత్పర్యము :**

ఓ వేంకటేశ్వరా! మీరు పది రకాల అవతారాలు ధరించుట ధర్మరక్షణ కోసము కాదు. పది రకాల శృంగార అవస్థలను ఆ అవతారాల్లో మీరు పొందుట కొరకు దశావతారాలను ఎత్తారు.

1. వేదాలను తిరిగి కాపాడగలను అనే కారణము తో పూర్వము ఈ మత్స్యావతారములో ఉన్న మీ శరీరము ప్రకాశింపబడింది. ఈ విధముగా అక్కడ మత్స్యావతారపు లీల వేదాల కోసం కాదు. అక్కడ ఉన్న తరుణి లక్ష్మీదేవి సౌందర్య సముద్రములో విహారము చేయాలని అసలు కోరిక. (సముద్రములో లక్ష్మీదేవితో కలిసి జల క్రీడ చేయటానికి

మత్స్యావతారము ధరించారు.)

2. మందర పర్వతాన్ని ధరిస్తాను అను ఒక మిష కల్పించుకొని పూర్వము అందమైన తాబేలు రూపం ధరించారు. మీయొక్క తెలివితేటలన్నీ ఎందుకోసమో నాకు తెలుసులే! నీ ప్రియమైన లక్ష్మీదేవి భారమైన స్తనములనే మందర పర్వతాన్ని ధరించటానికే. (లక్ష్మీదేవి భారమైన స్తనములను మందర పర్వత రూపములో ప్రదర్శించటానికి తాబేలు అవతారము ఎత్తారు.)

3. భూమిని ఉద్ధరిస్తాను – ఎత్తగలను అని కారణము కల్పించుకొని పూర్వము మీరు తెల్లటి వరాహ రూపాన్ని ధరించారు. ఈ వ్యవహారము దానికోసము కాదులే! మీ భార్యయైన భూదేవి పాలిండ్లపై తమరు పంటి గాట్లను ప్రసాదించటానికి వరాహ రూపాన్ని ధరించారు.

4. హిరణ్యకశిపుడనే రాక్షసుని సంహరిస్తానని కారణము కల్పించుకొని పూర్వము మీరు గొప్ప నరసింహావతారము ఎత్తి పరాక్రమము చూపించావని అందరు అనుకొంటున్నారు. ఓ రాక్షస హరుడా! మీగొప్పతనము అది కాదులే! లక్ష్మీదేవికి దంత క్షతాల సౌభాగ్యము కల్గిద్దామని నరసింహావతారము ఎత్తారు.

5. బలి చక్రవర్తిని అపహరిస్తానని కారణము కల్పించుకొని తమరు పూర్వము కపట వామనావతారము ఎత్తారు. ఓ నేర్పరీ! మీ విధానము, అసలు ఉద్దేశ్యము అది కాదు. బలి యజ్ఞ వాటికలో ఉన్న స్త్రీల ముందు మీ లీలలు, విలాసాలు చూపిద్దామని వామనావతారము ఎత్తారు.

6. క్షత్రియులను చంపగలను అని ఒక కారణము కల్పించుకొని తమరు పూర్వము ఎఱ్ఱటి రక్తపు నీటిలో పరశురామావతారములో ప్రాప్తింపచేసారు. ఓ సింహ పరాక్రముడా! మీ అసలు స్థితి ఆ విషయములో అది కాదు. లక్ష్మీదేవి విరహాన్ని తెలుపుటకు ఆ ఎఱ్ఱటి రక్తపు నీరు కల్పించారు. (లక్ష్మీదేవి విరహపు రూపాన్ని లోకానికి చెప్పటానికి పరశురామావతారము ఎత్తారని భావము)

7. యుద్ధములో రావణాసురుని జయించగలను అనే మిషతో రామావతారాన్ని కల్పించుకొన్నారు. భూపతిగా మీ భోగమునకు అసలు కారణము అదికాదులే. సీతాదేవి విరహాన్ని ఎంతో ఆసక్తిగా పోగొట్టడానికే రామావతారము ఎత్తారు.

8. కంసుని నేను జయిస్తాను అని ఒక మిషను కల్పించుకొని పూర్వము కృష్ణావతారాన్ని ఈ ప్రపంచములో ప్రవర్తించారు. హింసకు దూరముగా ఉండేవాడా! అసలు కారణము

అది కాదు. గోపికలను ప్రేమతో అనుసరించటానికి ఆ సమయంలో కృష్ణావతారాన్ని ఎత్తారు. ప్రలంబాసురుని చంపుతాను అని ఒక కారణము కల్పించుకొని రోషముతో పుట్టాడనే పేరున్న బలరాముడి అవతారం దాల్చారు. ప్రాణులను రక్షించువాడా! నీ సామర్థ్యము ప్రలంబుని కోసము కాదులే! భూలోకములో రేవతీదేవితో భోగించటానికి బలరాముని అవతారము ఎత్తారు.

9. ఎరిగిన బుద్ధుడిని కాగలను అని ఒక కారణము కల్పించుకొన్నారు. రోషాన్ని జయించిన వాడిగా పెద్ద పేరును పూర్వము సంపాదించుకొన్నారు. అసలు కారణము ఎరుక కాదు - పాడు కాదు. ఆ త్రిపుర యువతులచేతులు పట్టుకొని ఎడతెగని ప్రేమ ప్రసారము చేసి వారిని సేవించుట కోసమేబుద్ధావతారము ఎత్తారు.

10. కలి ప్రభావాన్ని తొలగిస్తాను అని ఒక కారణము కల్పించుకొని క్రూరుడైన కల్క్యవతారాన్ని ధరించి కోపాన్ని పూర్వము ధరించావు. ఓ ధైర్యవంతుడైన వేంకటాచల ప్రభూ! అసలు కారణము అది కాదు. భయపడుతున్న భూదేవిని సంతోషపెట్టడానికే తమరు కల్క్యవతారాన్ని ధరించారు.

**విశేషాలు :**

కవిత్వానికి మరోపేరు అందమైన అబద్ధము. ఈ కీర్తనలో ఉన్నవన్నీ అందమైన అబద్ధాలు. స్వామి వారు దశావతారాలు ఎత్తినది లోకోపకారము కోసమని మహా భక్తుడు అన్నమయ్యకు తెలియదా! తెలిసి - ఇలా నిందా స్తుతులు, వ్యాజ స్తుతులు శృంగార ప్రాంగణములో ఎందుకు వ్రాసాడు?

గారము ఉన్నవాళ్లు తల్లిదండ్రులను ఏమైనా అంటారు. తల్లిదండ్రులు కోపగించుకోరు. ముద్దుగా భావిస్తారు. అలమేలుమంగ, వేంకటేశ్వరుల ముద్దుల గారాబు బిడ్డ అన్నమయ్య. ఆయన ఏమన్నా అమ్మకి, నాన్నకి ఇష్టము. మనము స్వామి వారికంటె ఎక్కువ వారము కాదు.



## *33. దేవదేవం భజే*

అన్నమయ్య శ్రీరామచంద్రుని కీర్తించిన అపురూప కీర్తనలలో ఇది ఒకటి. (64 వ రేకు సంపుటము 01-314)

**దేవదేవం భజే దివ్య ప్రభావం**
**రావణాసురవైరి రఘుపుంగవం**

**1.రాజవరశేఖరం రవికుల సుధాకరం**
**ఆజానుబాహుం నీలాభ్రకాయం**
**రాజారి కోదండ రాజ దీక్షాగురుం**
**రాజీవలోచనం రామచంద్రం**

**2. నీలజీమూత సన్నిభశరీరం ఘన వి-**
**శాలవక్షం విమల జలజనాభం**
**తాలాహినగహరం ధర్మసంస్థాపనం**
**భూలలనాధిపం భోగిశయనం**

**3. పంకజాసన వినుత పరమనారాయణం**
**శంకరార్జితజనకచాప దళనం**
**లంకా విశోషణం లాలితవిభీషణం**
**వేంకటేశం సాధు విబుధవినుతం**

**తాత్పర్యము :**

దివ్యమైన ప్రభావము కలిగిన దేవుళ్లకు దేవుడయిన, రావణాసురునికి శత్రువైన, రఘువంశములో పుట్టిన శ్రేష్ఠుడైన శ్రీరాముని సేవింతును.(= భజే)

1. గొప్పవారయిన రాజులలో గొప్పవాడైన, సూర్యవంశానికి చంద్రుడైన, మోకాళ్లవరకు చేతులున్న, నల్లటి మేఘమువంటి శరీరము కల, రాజులకు శత్రువైన పరశురాముని యొక్క విష్ణు ధనుస్సునకు దీక్షా గురువయిన, పద్మములవంటి కన్నులు కలిగిన రామచంద్రుని కొలుస్తాను.

2. నల్లమబ్బుతో సమానమైన శరీరము కల, ఎత్తైన, వెడల్పైన రొమ్ముకల, మలినములేని పద్మమును నాభియందు కల, పాములా మెలికలు తిరిగి, కొండంత ఎత్తుగా ఉన్న తాటి చెట్లను హరించిన అన్ని ధర్మాలను భూమిపై స్థాపించిన భూదేవి కుమార్తైన సీతాదేవికి అధిపుడయిన, ఆదిశేషుడు శయనముగా కల రామచంద్రుని కొలుస్తాను.

3. బ్రహ్మ చేత పొగడబడిన, శ్రేష్ఠుడైన నారాయణుని, శంకరునినుండి ఆర్జింపబడి జనకుని ఇంటిలో చేరిన శివ ధనుస్సును విరిచిన, లంకలో రాక్షస సమూహమును ఎండింపచేసిన, విభీషణుని ఆదరించిన, సాధువుల చేత, పండితుల చేత పొగడబడి కలియుగములో వేంకటేశుని అవతారముగా కొలువబడుచున్న రామచంద్రుని సేవింతును.

**విశేషాలు :**

రఘుపుంగవ

వాల్మీకి గీత రఘుపుంగవ కీర్తి లేశైః –
తృప్తిం కరోమి కథమప్యధునా బుధానాం

గంగాజలైర్భువి భగీరథ యత్న లబ్ధ్యై -
కిం తర్పణం న విదధాతి నరః పిత్రూణాం

(గంగను భూమి మీదకు మనమెవరం తీసుకురాలేదు. భగీరథుని వల్ల గంగమ్మ వచ్చింది. మనం ఆ గంగ నీటితో మన పితృదేవతలకు తర్పణాలిస్తున్నాం. అవి వారిని తృప్తి పరుస్తున్నాయి. అలాగే వాల్మీకి ఎప్పుడో గానం చేసిన 'రామాయణము నుంచి నేను కొద్దిగా లవలేశాలు గ్రహించి ఈ చంపువును వ్రాసాను. ఈ నా కృషిలో నేను తప్పక పండితులకు తృప్తికలిగిస్తాను.) అన్నాడు భోజమహారాజు చంపూ రామాయణములో. ఈ శ్లోకంలో పవిత్రమైన గంగానదికి దీటుగా ఉన్న పుంగవ శబ్దాన్ని రఘు శబ్దంతో కవి కలిపాడు. అన్నమయ్య కూడ శత్రువులు శరణాగతులయితే రక్షిస్తానని రాముడు చెప్పిన సందర్భాన్ని మనకు గుర్తుకు తెచ్చే 'రావణాసుర వైరిం' పదబంధం పక్కనే పవిత్రమైన 'రఘుపుంగవ' పదబంధాన్ని వాడాడు.

రాజవరశేఖరం

'మా జానకి చెట్ట బట్టగ - మహరాజ వైతివి' అను కీర్తనలో త్యాగరాజ స్వామి "రాజ రాజవర! రాజీవాక్ష" అని రాముని గూర్చి అన్నారు. అన్నమయ్య కూడా అదే అర్థం వచ్చేలా రాజవరశేఖర అన్నారు. శేఖర పదం సమాసంలో ఉత్తర పదంగా ఉంటే (అంటే రెండవ పదంగా) శ్రేష్ఠమని అర్థం వస్తుంది. గొప్పవాళ్లయిన రాజులలో గొప్పవాడు అని భావార్థం.

రవికుల సుధాకరం

శ్రీరాఘవం దశరధాత్మజమప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపమ్ ।
ఆజానుబాహుం అరవిందదళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి ॥

అనే శ్లోకం మనందరికీ తెలిసిందే. ఇందులో రఘుకులాన్వయ రత్నదీపం అనే సమాసానికి రాముడు రఘుకులమనే సముద్రానికి చంద్రుడిలాంటి వాడని పెద్దలు అర్థం చెబుతారు. రత్న దీపస్తు చంద్రమాన్ అని విశ్వ నిఘంటువు. రవికుల సుధాకరుడనే అన్నమయ్య విశేషణం ఈ శ్లోక పాద ప్రభావమే. అన్నమయ్య రఘుకులాన్వయ రత్నదీపం బదులు రవికుల సుధాకరం అన్నాడు. అంతే తేడా. రాముని వంశానికి వరుసగా సూర్యవంశం, ఇక్ష్వాకువంశం, కాకుత్థ్సవంశం,

రఘువంశం అనే పేర్లున్నాయి. ఆవంశంలో సూర్యుడు, ఇక్ష్వాకుడు, కకుత్థ్సుడు, రఘువు మంచి పేరు తెచ్చుకొన్నందువలన ఆ వంశానికి వారి పేర్లు ఏర్పడ్డాయి. సంగ్రహంగా వారి వివరాలివి.

1. బ్రహ్మదేవుని మనసునందు మరీచి పుట్టెను, కశ్యపుడు అతనికి పుట్టెను, కశ్యపునికి అదితికి సూర్యుడు పుట్టాడు. (సూర్య వంశము)

2.సూర్యునికి సంధ్యాదేవికి వైవత్సుడు యనెడి మనువు పుట్టాడు. ఆ మనువుకు శ్రద్ధ అనియెడి భార్య యందు ఇక్ష్వాకులు మొదలైన పదిమంది పుత్రులు పుట్టారు. (ఇక్ష్వాకువంశము)

3. ఇక్ష్వాకుని కుమారుడు శశాదుడు. అతనికి అయోధుడు మొదలైన పది హేనుమంది పుత్రులు. వారిలో అయోధుని కుమారుడు కకుత్థ్సుడు.(కాకుత్థ్స వంశము)

4. ఖట్వాంగుడు, దీర్ఘబాహుండు రఘువు. పృథుశ్రవణుడు, అజుడు దశరథుడు, రాముడు వరుసగా పుట్టారు. (రఘువంశము)

ఆజానుబాహుం.

జాను అంటే సంస్కృతంలో మోకాలు. ఆజానుబాహుడు అంటే మోకాలుదాకా ఉండే చేతులు గలవాడు. శ్రీరాముని విశేషణాల్లో ఒకటి. తీర్చిదిద్దిన బలమైన దేహం కల పురుషుడు అనే అర్థంలో ఇప్పుడు దీనిని వాడుతున్నాం. ఈ 'జాను' అనే పదం మనం ఇపుడు వాడుతున్న 'జానెడు' అనే పదానికి మూలం. జానెడు అంటే ఆరు అంగుళాలు. ఆజానుబాహుడు అంటే నాలుగు మూరల బాహువులు( చేతులు) కలవాడని అర్థం.

తాలాహినగహారం

వాల్మీకి రామాయణంలో ఏడు సాల వృక్షములను( మద్దిచెట్లను) రాముడు ఛేదించినట్లు ఉన్నది. (12వ సర్గ – 02 వ శ్లోకం) మొల్ల రామాయణంలో సుగ్రీవుడు రాముణ్ణి ఏడు తాటిచెట్లు కొట్టినట్టు ఉంది. (కిష్కింధాకాండ 09వ వచనము). అన్నమయ్య కూడా మొల్ల పద్ధతిలోనే ఏడు తాటి చెట్లు అన్నాడు ఈ కీర్తనలో.

శంకరార్జితజనకచాప దళనం

శివుడు ఈ శివధనుస్సుని త్రిపురాసురులను సంహరించిన తరువాత దేవరాతుడు అను జనకుని వంశ పూర్వీకునికి ఇచ్చాడు. నాటి నుండి జనకుని

వంశంలో అది పూజలందుకుంటూ ఉంది. దీనినే శ్రీరాముడు స్వయంవరంలో విరిచాడు. పోతన గారు శివధనుస్సును విరిచిన రాముని ఇలా స్తుతించారు.

ధర్మ సంరక్షకత్వప్రభావుం డయ్యు
ధర్మవిధ్వంసకత్వమునఁ బొదలి (భాగ .2-171 )

ధర్మమును రక్షించు లక్షణము గలిగినవాడు అయినప్పటికి; శివధనుస్సు విరుచుటలో విజృంభించాడని ధర్మ శబ్దానికున్న రెండు అర్థాలను (1.ధర్మము 2.విల్లు) సమర్థంగా వాడుకొన్నారు. వానమామలై వరదాచార్యులు వారు ఈ శివధనుస్సు వివరణ సందర్భంలో ఒక చమత్కార పద్యము రచించారు.

ఎవ్వడా మహాదేవు విల్లెత్తగలడొ
వాడె జనక జామాత యై వరలగలడు
ఎవడు తానెక్కిడగ లేడొ శివధనుస్సు
జనకజా! మాత! యని మనజనునతండు'

ఎవడు శివ ధనుస్సు ఎత్తగలడో వాడే 'జనక జామాత' (జనకుని అల్లుడు) అవుతాడు. ఎత్తలేనివాడు జనకజా-మాతా (జనకుని కూతురా! తల్లీ!) అంటూ ఉండవలసిందే.

"శివస్య హృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయం శివః" అని శివ విష్ణువులు సమానమని చెబుతుంటారు. ఒకసారి దేవతలకు రామేశ్వరం అనే పదం ఏ సమాసానికి చెందినది? అని సందేహం కలిగిందిట. ఇది తత్పురుష. రామస్య ఈశ్వరః - రామునికి ఈశ్వరుడు అని రామేశ్వర పదానికి అర్థము అని విష్ణుమూర్తి దేవతలతో అన్నాడట. రామేశ్వర పదం బహుర్వీహిసమాసం. రాముడై ఈశ్వరుడుగా గలవాడు రామేశ్వరుడు' అని శివుడు బదులు చెప్పాడు. రామేశ్వరు డంటే రాముడే యీశ్వరుడు, ఈశ్వరుడే రాముడు అని అర్థం. కాగా 'రామశ్చాసా వీశ్వరశ్చ' రామేశ్వరః అని కర్మధారయమే యిది అని తీర్పు చెప్పారట బ్రహ్మ.

విష్ణు స్తత్పురుషం బ్రూతే బహుర్వీహిం మహేశ్వరః.
ఉభయో రప్యత అప్తానా మాత్మభూః కర్మధారయమ్.

శివుని విల్లు విరిచిన రాముడు శివునికంటె భిన్నుడు కాడు. పార్వతి దేవికి రామ నామ మహిమ గొప్పదని చెప్పిన శివుడు రామునికంటె భిన్నుడు కాడు. అన్నమయ్య ఈ గీతంలో చెప్పిన శంకరార్జిత అను పదబంధము వెనుక ఈ రామేశ్వర పదములోని ఏకత్వము ఉంది. ఇవన్నీ భగవల్లీలలు.

ముగింపు

అన్నమయ్య కీర్తన రత్నాల సాగరము. ప్రతి పదములో అనంతార్థాలు, విశేషాలుంటాయి. రత్నాలను వెతకటానికి చాలా ఓపిక కావాలి.



## *34. దేవదేవోత్తమ తే నమో*

శ్రీరామచంద్రుని కీర్తించిన కీర్తనలలో ఇది ఒకటి. (సంపుటము 04-491)

**దేవదేవోత్తమ తే నమో నమో**
**రావణదమన శ్రీరఘురామ**

**1. రవికులాంబుధిసోమ! రామ! లక్ష్మణాగ్రజ!**
**భువి భరత శత్రుఘ్న పూర్వజ**
**సవన పాలక! కౌసల్యానంద వర్ధన**
**ధవళాబ్జనయన సీతారమణా**

**2. దనుజ సంహారక దశరథ నందన ।**
**జనక భూపాలక జామాత ।**
**వినమిత సుగ్రీవ విభీషణ సమేత ।**
**మునిజన వినుత! సుముఖ చరిత్ర**

**3. అనిలజ వరద!అహల్యాశాప మోచన ।**
**సనకాది సేవిత చరణాంబుజ ।**
**ఘనతర వేంకట శ్రీగిరి నివాస ।**
**అనుపమోదార! విహార గంభీర**

**తాత్పర్యము :**

దేవతలకు ప్రభువులయిన వారిలో ఉత్తముడా! నీకు నమస్కారము. నమస్కారము. రావణుని అణచినవాడా! శ్రీ రఘువంశములో జన్మించిన రాముడా!

1. సూర్యవంశము అను సముద్రమునకు చంద్రునిలాంటి వాడా! రాముడా! లక్ష్మణుని కంటె ముందు జన్మించినవాడా! ఈ భూమిలో భరత శత్రుఘ్నులకంటె ముందు పుట్టిన వాడా (అన్నయ్య అని భావము) విశ్వామిత్రుని యాగమును కాపాడిన వాడా! కౌసల్యాదేవి ఆనందాన్ని పెంచినవాడా! తెల్లని పద్మములవంటి కన్నులు కలిగినవాడా! సీతాదేవికి మనోజ్ఞమైన వాడా! (మగడా!)

2. రాక్షసులను సంహరించినవాడా! పది దిక్కుల పోవు రథముకల దశరథుడను పేరుగల వానికి పుత్రరూపంలో సంతోషపెట్టిన వాడా! మహాజ్ఞాని, తత్త్వవేత్త, సంసారమును వదలకయే ముక్తి పొందిన జనకుడను రాజునకు అల్లుడా! వినయము

కలిగిన సుగ్రీవుడు, విభీషణులతో కూడిన వాడా! మునిజనులతో నుతించబడిన వాడా! అనుకూల వైఖరి కలిగిన చరిత్ర కలిగిన వాడా!

3. వాయుపుత్రుడైన హనుమంతునికి వరములిచ్చిన వాడా! అహల్య యొక్క శాపమును విడిపించిన వాడా! సనకుడు మొదలైన వారితో సేవింపబడిన పాద పద్మములు కలవాడా! గొప్ప కీర్తి కలిగిన, వేంకట పర్వతమునందు నివాసమున్నవాడా! పోలికలేని గొప్పవాడా! విహారములందు గంభీరము కలవాడా!

**విశేషాలు :**

శత్రుఘ్నుడు

తల్లి సుమిత్ర. భార్య కుశధ్వజుని కూతురు అగు శ్రుతకీర్తి. ఇతడు  లవణాసురుని చంపి లోకులబాధను పోగొట్టాడు.

దశరథ

1. దశ దిశలా అంటే పది దిక్కులా  పోవు రథము గలవాడు దశరథుడు. (8 దిక్కులు, ఊర్ధ్వ అధో దిశలు).

2. దశ అంటే పక్షి అని దశరథుడనుదానికి పక్షి వాహనముగా కలవాడు (విష్ణువు) అని మరికొంతమంది అర్థము చెప్పారు.  దానికి ఉపబలకముగా ప్రసిద్ధమైన ఈ శ్లోకాన్ని చూపించారు.

రామం దశరథం విద్ధి
మాం విద్ధి జనకాత్మజా
అయోధ్యా మటవీం విద్ధి
గచ్ఛ! తాత! యథా సుఖం

రాముని దశరరథునితో సమముగా చూచుకొనుము అను అర్థము వచ్చుచున్నది కనుక దశరథుని విష్ణు సమానునిగా భావించారు.

దనుజ

దనువు అను స్త్రీ  కశ్యపుని భార్య. దక్షప్రజాపతి కూఁతురు. ఈమెకు పుట్టిన వారు కనుక రాక్షసులను దానవులు అంటారు. కశ్యప ప్రజాపతికీ, సురసకు పుట్టిన సంతానంలో "యక్షామ" అని పలికినవారు యక్షులైనారనీ, రక్షామ అని పలికినవారు రాక్షసులైనారనీ  ఒక కథ. దానవులు, రాక్షసుల తల్లులు వేరయినా ఇద్దరిని  రాక్షసులని

పిలుచుట మనకు అలవాటయింది.



## *35. దేవ నమోదేవ*

వేంకటేశ్వరుని గుణగణాలను కీర్తించిన కీర్తన ఇది. (సంపుటము 02-377)

**దేవ నమో దేవా**
**పావన గుణగణ భావా**

**1.జగదాకార చతుర్భుజ**
**గగన! నీల మేఘశ్యామ**
**నిగమ పాదయుగ! నీరజనాభ**
**అగణిత లావణ్యాననా**

**2.ఘనవేదాంతైక గణన! ఉదార**
**కనక శంఖచక్ర కరాంకా**
**దినమణి శశాంక దివ్యవిలోచన**
**అనుపమ రవి బింబాధరా**

**3.భావజ! కంజభవ జనక**
**శ్రీవనితా హృదయేశ**
**శ్రీవేంకటగిరి శిఖరవిహార**
**పావన గుణగణ భావా**

**తాత్పర్యము :**

ఓ వేంకటేశ దేవా! నమస్కారము. పవిత్రుడా! పవిత్రమైన గుణగణములచేత భావింపదగినవాడా!

1. ప్రపంచము నీ ఆకారముగా కలిగినవాడా! నాలుగు చేతులు కలిగినవాడా! దుర్లభమైనవాడా! నల్లని మేఘమువంటి రంగు కలిగిన వాడా! వేదములు పాదపు జంటగా కలిగినవాడా! పద్మము నాభియందు కలవాడా! లెక్కించుటకు వీలులేని అందమైన మోము కలిగినవాడా!

2. గొప్పవైన ఉపనిషత్తులచేత మాత్రమే లెక్కింపదగినవాడా! గొప్పవాడా! బంగారపు శంఖము, చక్రము చేతియందు గుర్తులుగా కలిగినవాడా! సూర్యుడు, చంద్రుడు రెండు కన్నులుగా కలిగినవాడా! పోలికలేని సూర్య బింబమును నీ ప్రకాశముతో తక్కువ చేయువాడా! (నీ కాంతి సూర్య కాంతిని మించినదని భావము)

3.భావములందు జన్మించువాడా! పద్మమునందు జన్మించిన బ్రహ్మ దేవునికి తండ్రీ! లక్ష్మీదేవి హృదయానికి ప్రభువా! శ్రీవేంకట గిరిశిఖరములపై విహరించువాడా!

పవిత్రమైన గుణసమూహాలములచే భావింపదగినవాడా!



## *36. దేవ వాసుదేవ*

మధుర భక్తిలో అన్నమయ్య స్వామివారి శృంగారాన్ని వర్ణిస్తున్న కీర్తన ఇది. (19-332)

**దేవ! వాసుదేవ**
**భావయ తాం పాలయ**

**1.నరహరే అహెూ నారాయణరే**
**మురహర నగధర ముకుంద**
**తరుణీయం తు తవ విరహేణ**
**భరితవిచిత్రప్రతిమా జాతా**

**2.దివిజవందిత! దేవోత్తమ! అహెూ**
**నవనీతప్రియ నందసుత**
**తవ సంగమసంతతకామనయా**
**యువతి ర్జాతా యోగిణీవ**

**3.జితదానవ! అహెూ శ్రీవేంకటపతే!**
**సతత మాధవ కృష్ణ సర్వేశ**
**రతిసంగమేన రమణీ యంతు**
**బతతే విహితాభరణా జాతా**

**తాత్పర్యము :**

ప్రకాశించేవాడా! వసుదేవుని కుమారుడా! ఆ నాయికను భావించు! ఆమెను పాలించు.

1. ఆహా! ఓ నరహరీ! ఓ నారాయణా! మురుడను రాక్షసుని సంహరించువాడా! గోవర్ధన పర్వతాన్ని ధరించినవాడా! మోక్షమునిచ్చువాడా! ఈ యౌవనముగల ఆడుది నీ విరహము చేత విచిత్రమైన చిత్రముగా మారింది.

2. దేవతలందరి చేత నమస్కరింపదగినవాడా! దేవులలో ఉత్తముడా! ఆహా! అప్పుడే చిలికి తీసిన వెన్న అంటే ఇష్టమైన వాడా! నందుని కుమారుడా! నీతో కలియుట కొరకు ఎప్పుడూ కోరుకొనేయువతి యోగాభ్యాసముచేయు ఆడుది వలె అయినది.

3. ఆహా! రాక్షసులను జయించినవాడా! శ్రీవేంకట పతీ! ఎప్పుడూ లక్ష్మితో ఉండేవాడా! కృష్ణుడా! సర్వేశుడా! ఈ క్రీడించునట్టి ఆడుది నీతో రతి క్రీడ చేయుటచేత నీకు శోభను కలిగిస్తోంది.

**విశేషాలు :**

ఈ కీర్తనలో ఉండే సంబోధనలు సాధారణమైనవే కాని నాయిక స్థితులను వర్ణించిన పరిణామ పదాలు విశిష్టమైనవి.

1. ఈ యౌవనముగల ఆడుది నీ విరహము చేత విచిత్రమైన చిత్రముగా మారింది.

2. నీతో కలియుట కొరకు ఎప్పుడూ కోరుకొనే యువతి యోగాభ్యాసముచేయు ఆడుది వలె అయినది.

3. ఈ క్రీడించునట్టి ఆడుది నీతో రతి క్రీడ చేయుట చేత నీకు శోభను కలిగిస్తోంది. మొదటి స్థితిలో ఆమె తరుణి. రెండవ స్థితిలో యోగిని, మూడవ స్థితిలో రమణి అని అన్నమయ్య పద ప్రయోగము.

యోగిని కావటానికి ముందు సాధించవలసిన స్థితి తాదాత్మ్య భావన. అది భక్తులకు అవసరమని చెప్పటానికి విచిత్రమైన చిత్రముగా మారినదని కవి వర్ణన. యోగినిగా మారిన తరువాత రమణిగా మారినదని వర్ణించుట అద్భుతము. అందం, ఆనందం – అని జంట పదాలు. అన్నమయ్య వాటిని వ్యత్యస్తము చేసాడు. ఆనందం అందం – అన్నాడు. భక్తుడు / భక్తురాలు పొందే బ్రహ్మానందము – నిజమైన అందమని కవి భావన. మధుర భక్తిని అన్నమయ్య చెప్పినంత అందంగా ఏ తెలుగు కవి చెప్పలేదు. ఇది యదార్థమైన మాట.



## *37. నందక ధర*

వేంకటేశుని వివిధ సంబోధనలతో కీర్తించిన అన్నమయ్య కీర్తన ఇది. (సంపుటము 04-66 అను)

**నందకధర నంద గోప నందన ।**
**కందర్ప జనక కరుణాత్మన్ ॥**

**1.ముకుంద! కేశవ! మురహర ।**
**సకలాధిప! పరమేశ్వర! దేవేశ ।**
**శుక వరద! సవితృ సుధాంశు లోచన ।**
**ప్రకట విభవ! నమో పరమాత్మన్**

**2.ధ్రువ పాంచాలీ స్తుతివత్సల! మా**
**ధవ! మధుసూదన! ధరణి ధరా ।**
**భువన త్రయ పరిపోషణ తత్పర ।**
**నవనీత ప్రియ! నాదాత్మన్**

**3.శ్రీమన్! వేంకట శిఖర నివాస**
**మహా మహిమన్! నిఖిలాండపతే ।**
**కామిత ఫల! భోగప్రద! తే నమో ।**
**స్వామిన్! భూమన్! సర్వాత్మన్ ।**

**తాత్పర్యము :**

నందకము అను పేరు కలిగిన ఖడ్గాన్ని ధరించినవాడా! నంద గోపుని కుమారుడా! మన్మథునికి తండ్రీ! అంతరంగమందు దయ కలవాడా!

1. మోక్షము నిచ్చువాడా! మంచివెంద్రుకలు కలవాడా! మురుడను రాక్షసునిచంపిన వాడా! సమస్త ప్రపంచానికి అధిపతీ! ఓ విష్ణు మూర్తీ! దేవతలకు ప్రభువా! శుకునికి వరములిచ్చినవాడా! నిద్రించువానిని ప్రేరేపించు సూర్యుడు (సవితృ), చంద్రుడు కన్నులుగా కలవాడా! ప్రసిద్ధమైన వైభవము కలవాడా! ఓ పరమాత్మా! నమస్కారము.

2. ధ్రువుడు, ద్రౌపది చేయు పొగడ్తలయందు ప్రీతి కలవాడా! లక్ష్మీదేవి భర్తా! మధువను రాక్షసుని సంహరించినవాడా! భూమిని ధరించినవాడా! మూడు లోకములను రక్షించుటలో ఆసక్తి కలిగినవాడా! అప్పుడు చిలికి తీసిన వెన్న యందు ప్రీతి కలవాడా! నాద స్వరూపుడా!

3.సంపద కలవాడా! శ్రీవేంకటాద్రి శిఖరముపై నివాసముండు వాడా! మహా మహిమ కలవాడా! సమస్త సృష్టికి ప్రభువా! కోరిన ఫలములు ఇచ్చువాడా! భోగమును ఇచ్చువాడా! నీకు నమస్కారము. స్వామీ ! ఐశ్వర్య వంతుడా! సర్వాత్మకుడా!

**విశేషాలు :**

నందక ధర

నందకము అంటే విష్ణుఖడ్గము. సంతోషించునది అని దీని అర్థము. అన్నమాచార్యుల వారిని నందకము యొక్క అంశగా నమ్ముతారు. అరిషడ్వర్గము తెగనరికే హరి ఖడ్గమ్మిది నందకము అని స్వర్గీయ వేటూరి ఈ నందకాన్ని అంతశ్శత్రువులగు కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అను ఆంటి సముదాయమును తెగ నరికేదిగా పేర్కొన్నారు. విష్ణుమూర్తి ఆయుధములు 1.ధనుస్సు – శార్ఙ్గము 2.గద – కౌమోదకి 3. శంఖము – పాంచజన్యము 4.చక్రము – సుదర్శనము 5.కత్తి – నందకము 6. రథము – శతానందము 7. సేనానాయకుడు

– విష్వక్సేనుడు 8. వాహనం – గరుత్మంతుడు. అన్నమయ్య కీర్తనల్లో వీటి ప్రస్తావన ప్రముఖంగా ఉంటుంది.

నంద గోప

నందగోపుడినే వైష్ణవులు ఆచార్యుడు అంటారు. ఎందుకంటే భగవంతుణ్ణి తలచి, భగవంతుణ్ణి తనలో కల్గి ఆనందించేవాడు కనుక నందుడు. ఆ కృష్ణుని దుష్టుల దృష్టిలో పడకుండా దాచి ఉంచేవాడు కనుక గోపుడు. అందువలన నందుడు నందగోపుడయ్యాడు.



## *38. నందనందన వేణునాద*

వేంకటేశుని వివిధ సంబోధనలతో కీర్తించిన అన్నమయ్య కీర్తన ఇది. (సంపుటము 01–312)

**నందనందన! వేణునాద వినోద! ము**
**కుంద! కుంద దంతహాస! గోవర్ధన ధరా**

**1.రామ! రామ! గోవింద! రవిచంద్ర లోచన**
**కామ కామ! కలుష వికార విదూరా!**
**ధామ ధామ! విభవప్రతాప రూప! దనుజని**
**ర్ధామ ధామ కరణచతుర! భవభంజనా**

**2.కమలకమలవాసకమలా రమణ! దేవో**
**త్తమ! తమోగుణ సతత విదూర**
**ప్రమదప్రమదానుభవ భావకరణ!**
**సుముఖ! సుధానంద! శుభరంజనా**

**3.పరమ! పరాత్పర! పరమేశ్వరా!**
**వరద !వరదామల! వాసుదేవ!**
**చిర చిర ఘననగ శ్రీవేంకటేశ్వర!**
**నరహరి నామ! పన్నగ శయనా**

**తాత్పర్యము :**

నందుని కుమారుడా! వేణు నాదములో వినోదించువాడా! మోక్షమును ఇచ్చువాడా! (ముకుంద) మొల్ల పువ్వులా తెల్లని చిరునవ్వు కలవాడా! గోవర్ధన పర్వతమును ధరించినవాడా!

1. శ్రీరామా! బలరాముడా! గోవిందుడా! సూర్య చంద్రులను కన్నులుగా కలిగినవాడా! మన్మథునకే మన్మథుడా! (మన్మథుని మించిన సౌందర్యము కలవాడని అర్థము)

పాపవికారములను దూరము చేయువాడా! తేజస్సులకు నిలయమైనవాడా! ప్రతాప వైభవము కలవాడా! రాక్షసుల ఇళ్లను పొగలేని ఇళ్లుగా చేయుటలో నేర్పరీ! (ఆహారము వండుకొనుటకు ఇదివరకటిరోజుల్లో పొయ్యిలు వాడటం కద్దు. ఆ పొయ్యిలలో పొగ వస్తుంటే ఇంట్లో మనుష్యులున్నట్టు సంకేతము. రాక్షసుల ఇళ్లలో పొగే లేకపోతే వారందరినీ కృష్ణుడు చంపాడని భావార్థము.) సంసార దుఃఖమును పోగొట్టు వాడా!

2. నీటితో కూడుకొన్న పద్మమందు నివాసము కలిగిన లక్ష్మీదేవికి ఇష్టుడా! దేవతలలో ఉత్తముడా! తమోగుణమును ఎప్పుడూపోగొట్టువాడా! ఆనందాన్ని పొందే స్త్రీలకు అనుభవరూపంలో భావాన్ని అనుగ్రహించేవాడా! చక్కటి ముఖ కాంతి కలవాడా! అమృతమయమైన ఆనందము కలవాడా! శుభములిచ్చి ఆనందింపచేయువాడా!

3. మోక్షమునకు ఒక ఆకృతీ! పరమాత్మా! పరమేశ్వరా! వరములిచ్చువాడా! స్వచ్ఛమయిన వరములను గ్రహించువాడా! వసుదేవుని కుమారా! బాగా ప్రాచీనమయిన గొప్పదయిన కొండలో నివసించు వేంకటేశ్వరా! నరహరి అను పేరు కలవాడా! ఆదిశేషుడు శయ్యగా కలిగిన వాడా!

**విశేషాలు :**

"పెరిగినాడు చూడరో పెద్ద హనుమంతుడు" కీర్తనలో నెలకొన్న లంకా నిర్ధూమధాముడు అని హనుమంతుని అన్నమయ్య సంబోధించాడు. అదేశైలిలో దనుజ నిర్ధూమ ధామ కరణ - అని ఈ కీర్తనలో కృష్ణమూర్తిని సంబోధించాడు.



## *39. న తు మమతావన్మానసస్త్వదీయ*

అన్నమయ్య ఒక ఖండిత నాయికగా మారి వేంకటేశునిపై ముళ్ల గులాబీలను పరిచిన కీర్తన ఇది. (సంపుటము 06-85)

**న తు మమ తావన్మానసస్త్వదీయ**
**నితాంత హిత సరణిం నమామి**

**1.న వదతు భవాన్ జనార్దన ఘనరతి**
**వివాద వచనం వృథావృథా**
**తవ మృదు వేద సుధామయ వచనైః**
**వివిధా వశ పదవీం వహామి**

**2.న భజతు మాం కరుణానిధే భవ**
**ద్విభవ వినయశ్చ వృథావృథా**
**త్రిభువన సుఖకర దివ్య రూప తే**
**ప్రభుతయా పరాభవం భజామి**

**3.న చలతు వేంకట నాథ మాం వినా**
**విచరణమపి తే వృథావృథా**
**సుచరిత్రస్త్వం సుభగస్త్వం త్వాం**
**కుచయోః పులకాంకురైఃధరామి**

**తాత్పర్యము :**

నా మనస్సులో నీమీద ఎటువంటి కోపములేదు. నీ మార్గము అందరికి మేలు కలిగించేది కదా! దానికి నేను నమస్కరిస్తున్నాను. ఓ జనార్దనుడా! గొప్పదైన రతికేళిలో ఉత్త మాటలు తమరు చెప్పుట వ్యర్థము.

1. మృదువైన వేదామృతములతో కూడిన వచనాలతో కూడిన అనేక రకాలుగా మీ వశములో ఉన్న మార్గములను నేను అనుసరిస్తాను.

2. ఓ దయానిధీ! తమరు నన్ను సేవించవద్దు. దగ్గరికి రావద్దు. మీ యొక్క వైభవము, వినయము వ్యర్థము. మూడు లోకాలకు సుఖాలు కలిగించేవాడా! (నాకు మాత్రము సుఖాన్ని ఇవ్వవని వ్యంగ్యము) దివ్యమైన రూపము కలవాడా! క్షణము తీరికలేని రాచ కార్యాలతో ఉన్న మిమ్ములను కలుసుకోవాలనే నా కోరిక తీరక అవమానం పొందుతున్నాను.

3. వేంకటనాథుడా! నేను లేకుండా ఎక్కడికి వెళ్లకు. నేను లేకుండా తిరిగే నీ చలనము వ్యర్థము. మంచి నడవడి కలవాడా! మహత్తు కలవాడా! నిన్ను పులకలతో గగుర్పొడిచిన నా స్తనములపై ధరిస్తున్నాను.

**విశేషాలు :**

నాయకుడు రాత్రి ఇంకొక దాని ఇంటికిపోయి ఆ గుర్తులతో వస్తే చూసి కోపము పొందే నాయికను ఖండిత అంటారు. ఈ కీర్తనలో ఉన్న ఖండితానాయిక మొదట్లో ముళ్ల గులాబీల మాటలు మాట్లాడినా, చిట్ట చివరిలో స్వామి వారిని కరుణించింది.

కుచయోః పులకాంకురైఃధరామి

మంగళదేవత ఓరచూపులు నీలమేఘశ్యాముడైన విష్ణుమూర్తిపై ప్రసరించినప్పుడు వృక్షము తొడిగిన మొగ్గలలా ఆయన శరీరముపై పులకాంకురములు వచ్చాయని శంకర భగవత్పాదులు కనకధారాస్తవములో చెప్పారు. (అంగం హరేః

పులక భూషణ మాశ్రయంతీ/భృంగాంగనేవ ముకుళాభరణం తమాలమ్!) అభినవ శంకర భగవత్పాదులైన అన్నమాచార్యులు కూడా ఆ పులకల ప్రస్తావన ఈ కీర్తనలో చేసారు. లోకాలను భరించే కృష్ణమూర్తిని నా స్తనములపై మోస్తున్నాను. నేను కదా గొప్ప! కాని నాకు పేరు రాలేదు. కృష్ణునికే పేరు వచ్చింది. పుణ్యులకు మాత్రమే కీర్తి లభిస్తుంది అని ఒక గోపిక మధుర బాధ మనందరం చదువుకొన్నాము. ఆబాటలోదే అన్నమయ్య 'ధరామి' ప్రయోగము. ఎంత కాని పని చేసినప్పటికీ ఇష్టమైన వాడు, అందులోను- వేంకటేశుడు దగ్గరిలో నిలబడితే హృదయములో ఆనందము రావటం చాలా సహజము. ఆ హృదయములో ఉన్న ఆనందము హృదయముపైన ఉన్న స్తనములపై పులకలుగా మారుట ఇంకా సహజము. పులకరింపచేసే వాడిని ఆ స్తనములపై ధరిస్తున్నానని కవి చెప్పుట మధురాతి మధురము. భక్తుడు స్వామిని హృదయములో భరించాలని ఈ శృంగార కీర్తన తాత్పర్యము.



## *40. నగధర నందగోప*

కడప జిల్లా రాయచోటి మండలంలోని చినమండెం గ్రామంలోని నరసింహస్వామిపై అన్నమయ్య చెప్పిన కీర్తన ఇది. (సంపుటము 01-259)

**నగధర నందగోప నరసింహ వో-**
**నగజవరద శ్రీ నారసింహ**

**1.నరసింహ పరంజ్యోతి నరసింహా వీర-**
**నరసింహ లక్ష్మీనారసింహా**
**నరసఖ బహుముఖ నారసింహా వో-**
**నరకాంతక జేజే నారసింహా**

**2.నమో నమో పుణ్డరీక నారసింహ వో-**
**నమిత సురాసుర నారసింహా**
**నమకచమకహిత నారసింహా వో-**
**నముచిసూదన వంద్య నారసింహా**

**3.నవరసాలంకార నారసింహా వో-**
**నవనీతచోర శ్రీ నారసింహా**
**నవగుణ వేంకట నారసింహా వో-**
**నవమూర్తి మండెము నారసింహా**

**తాత్పర్యము :**

గోవర్ధన పర్వతాన్ని ధరించినవాడా! నందుని ఇంటిలో గోపబాలునిగా పెరిగినవాడా! ఓ గజేంద్రుని కాపాడినవాడా! ఓ చినమండెం గ్రామంలోని నరసింహస్వామీ! నమస్కారము.

1. ఓ నరసింహ స్వామీ! ఓ పరమాత్మా! ఓ నరసింహమా! వీర నరసింహమా! లక్ష్మీదేవితో కలిసిన నరసింహస్వామీ!కృష్ణావతారములో అర్జునునికి స్నేహితుడా! అనేక ముఖములు కలిగినవాడా! ఓ నరకాన్ని పోగొట్టే వాడా! ఓ నరసింహా! నీకు జయము! జయము.

2. తామరపూవులాంటి కన్నులు కలిగిన నరసింహుడా! దేవతలచేత, రాక్షసుల చేత నమస్కరింపబడు నరసింహుడా! నమక చమకములచేత క్షేమము కలిగించేవాడా! నరసింహుడా! (విష్ణుమూర్తికి, శివునికి అన్నమయ్య దృష్టిలో తేడాలేదనటానికి ఇదొక సాక్ష్యము.) నముచి అను రాక్షసుని చంపిన ఇంద్రుని చేత నమస్కరింపబడేవాడా! ఓ నరసింహుడా! నమస్కారము.

3. 1. శృంగారం, 2. వీరం, 3. కరుణ, 4. అద్భుతం, 5. హాస్యం, 6. భయానకం, 7. బీభత్సం, 8. రౌద్రం, 9. శాంతం అను తొమ్మిది రసాలతో అలంకరింపబడినవాడా! కృష్ణావతారములో వెన్నను దొంగిలించినవాడా! ఓ నరసింహుడా! 1. ధృతి, 2. క్షమ, 3. దమము, 4. అస్తేయము, 5. శౌచము, 6. ఇంద్రియ నిగ్రహము, 7. బుద్ధి, 8. విద్య, 9. క్రోధము లేకుండుట అను తొమ్మిది దైవీగుణములు కల శ్రీ వేంకటేశ్వర అవతారములో ఉన్న నరసింహా!

**విశేషాలు :**

కర్నూల్ జిల్లాలోని నంధ్యాలకు 74 కి.మీల దూరంలో, చిత్తూరు జిల్లా తిరుపతికి 75 కి.మీ దూరంలో, హైదరాబాద్కు 365 కి.మీల దూరంలో అహోబిల పుణ్యక్షేత్రం ఉన్నది. ఇక్కడ నరసింహస్వామి తొమ్మిది రూపాలలో కనిపిస్తాడు కనుక ఈ క్షేత్రానికి 'నవ నారసింహ క్షేత్రం' అని ఇంకొక పేరు. ఆ తొమ్మిది రూపాలు ఇవి: 1.జ్వాల,2. వీర, 3.యోగానంద, 4. కానుగుమాని, 5.మట్టెమళ్ల, 6. భార్గోటి, 7.ప్రహ్లాద, 8.లక్ష్మీ, 9.వరాహ నరసింహులు. ఇటువంటి తొమ్మిది రూపాలు కలిగిన ఓ చినమండెం గ్రామంలోని నరసింహస్వామీ! నమస్కారము.



## *41. నమామ్యహం మానవసింహం*

అహోబల నరసింహస్వామిపై అన్నమయ్య కుమారుడు పెద తిరుమలాచార్యులు చెప్పిన కీర్తన ఇది. (15- 160)

**నమామ్యహం మానవసింహం ।**
**ప్రమదాంక మహోబల నరసింహం ॥**

**1.దానవదైత్య విదారణ సింహం ।**
**నానాయుధకర నరసింహం ।**
**భూనభోంతరా పూరిత సింహం ।**
**ఆనన వహ్నిలయాంతక సింహం ॥**

**2.ప్రళయ నృసింహం బహుముఖ సింహం ।**
**సలలిత గరుడాచల సింహం ।**
**కులిశ నఖరముఖ ఘోషిత సింహం ।**
**తిలకిత బహు రవిదీపిత సింహం ॥**

**3.శాంత నృసింహం శౌర్య నృసింహం ।**
**సంతత కరుణా జయసింహం ।**
**కాంతం శ్రీవేంకటగిరి సింహం ।**
**చింతిత ఘన సంసిద్ధ నృసింహం ॥**

**తాత్పర్యము :**

నేను మానవసింహానికి నమస్కరిస్తున్నాను. లక్ష్మీదేవిని ఒడిలో ధరించిన అహోబల నరసింహానికి నమస్కరిస్తున్నాను.

1. దానవులను, దైత్యులను చీల్చు సింహానికి, అనేక విధాలయిన ఆయుధాలను చేతిలో ధరించిన మానవ సింహానికి, భూమికి, ఆకాశానికి మధ్య నిండిన (అంతటా వ్యాపించిన) నరసింహానికి, మోములో ఉన్న అగ్ని చేత ప్రళయాంతకునివలె ఉన్న అహోబల నరసింహానికి నమస్కరిస్తున్నాను.

2. ప్రళయ నరసింహునికి, అనేక ముఖాలున్న సింహానికి, లలితమైన గరుడాచలములో ఉన్న నరసింహానికి, వజ్రాయుధములాంటి గోళ్లతో సింహ ధ్వని చేసే నరసింహానికి అనేక సూర్య బింబాలను తిలకముగా చేసుకొని ప్రకాశిస్తున్న అహోబల నరసింహానికి నమస్కరిస్తున్నాను.

3. శాంతముగా ఉన్న నరసింహానికి, పరాక్రమ నరసింహానికి ఎప్పుడూ కరుణతో ఉండే జయనరసింహానికి అందమైన వేంకటగిరిపై ఉన్న నరసింహానికి (వేంకటేశ్వరునికి) కోరిన కోరికలను సిద్ధింపచేసే అహోబల నరసింహానికి నమస్కరిస్తున్నాను.

**విశేషాలు :**

దైత్యులు- దానవులు

దక్షునికి ఏభై మంది కుమార్తెలు పుట్టారు. వాళ్ళలో పదమూడు మందిని కశ్యప ప్రజాపతికి అతడు ఇచ్చాడు. వారిలో దితికి హిరణ్యకశిపుడు, ప్రహ్లాదుడు,

విరోచనుడు, బలి చక్రవర్తి, బాణాసురుడు జన్మించారు. వీరు దైత్యులు. దను అనే మరో భార్యకు 40 మంది దానవులు పుట్టారు. (మహాభారతం ఆది పర్వము)

ప్రళయమంటే? ప్రళయమంటే సర్వ ప్రపంచ నాశనము. ఇది నిత్య ప్రళయము, నైమిత్తిక ప్రళయము, ప్రాకృతి ప్రళయము, ఆత్యంతిక ప్రళయము అని నాలుగు రకాలు. అందు నిత్యప్రళయము ఒళ్లెరుగని నిద్ర (సుషుప్తి). నైమిత్తిక ప్రళయము అంటే నిమిత్తము వలన కలిగే ప్రళయము రుద్ర రూపుడైన దేవుడు సూర్యునిలో ప్రవేశించి కాలాగ్నితో ముల్లోకాలని కాలుస్తాడు. ప్రాకృతప్రళయము ప్రకృతి మొత్తము నశించుట. ఆత్యంతిక ప్రళయము అంటే మోక్షము.



## *42. నమితదేవం భజే*

శ్రీ నరసింహుని రకరకాల విశేషణాలతో స్తుతిస్తూ అన్నమయ్య చెప్పిన కీర్తన ఇది. (03- 514)

**నమిత దేవం భజే నారసింహం**
**సుముఖ కరుణేక్షణం సులభ నరసింహం**

**1.విజయ నరసింహం వీర నరసింహం**
**భుజబల పరాక్రమ స్ఫుట నరసింహం**
**రజనీ చర విదళన విరాజిత నృసింహం**
**సుజన రక్షక మహాశూర నరసింహం**

**2.దారుణ నరసింహం ప్రతాప నరసింహం**
**చారు కల్యాణ నిశ్చల నృసింహం**
**ధీర చిత్తావాస దివ్య నరసింహం**
**సార యోగానంద చతుర నరసింహం**

**3.విమల నరసింహం విక్రమ నృసింహం**
**కమనీయ గుణగణాకర నృసింహం**
**అమిత సుశ్రీ వేంకటాద్రి నరసింహం**
**రమణీయ భూషాభిరామ నరసింహం ॥**

**తాత్పర్యము :**

వినయము కలిగిన బ్రహ్మాది దేవతలు కలిగిన నరసింహస్వామిని సేవిస్తాను. (బ్రహ్మాది దేవతలు వినయముతో నరసింహునికి నమస్కరిస్తుంటారని భావం) ప్రసన్నమయిన దయతో నిండిన చూపులు కలిగిన నరసింహస్వామిని సేవిస్తాను.

1. విజయాన్ని కలిగించే విజయ స్వరూపుడయిన వీర నరసింహస్వామిని సేవిస్తాను.

భుజముల పరాక్రమము చేత, ప్రకాశించే నరసింహస్వామిని సేవిస్తాను. రాత్రి పూట చరించే రాక్షసవంశములో పుట్టిన హిరణ్యకశిపుని చీల్చుట చేత ప్రకాశించు నరసింహ స్వామిని సేవిస్తాను. మంచి వారిని రక్షించే పరాక్రమవంతుడైన నరసింహ స్వామిని సేవిస్తాను.

2. భయానక రసానికి ఒక రూపంగా ఉండే, పరాక్రమశాలియైన నరసింహ స్వామిని సేవిస్తాను. అందమయిన శుభాలను ప్రసాదించుటలో నిశ్చలముగా ఉండే నరసింహ స్వామిని సేవిస్తాను. చంచలము కాని మనస్సులలో ఉండే తేజస్సు కలిగిన నరసింహ స్వామిని సేవిస్తాను. సారమయిన యోగానందమును అనుగ్రహించుటలో నేర్పరి అయిన నరసింహ స్వామిని సేవిస్తాను.

3. స్వచ్ఛమయిన, పరాక్రమవంతుడైన నరసింహస్వామిని సేవిస్తాను. అందమయిన గుణసమూహములకు నిలయుడైన నరసింహస్వామిని సేవిస్తాను. అమితమయిన శోభ కలిగిన వేంకటాచలముపై ఉన్న నరసింహస్వామిని సేవిస్తాను. మనోహరమయిన అలంకారములతో అందగాడైన నరసింహస్వామిని సేవిస్తాను.



## *43. నమో నమో జగదేక నాథా*

శ్రీ రాముని రకరకాల విశేషణాలతో స్తుతిస్తూ అన్నమయ్య చెప్పిన కీర్తన ఇది. (04 - 494)

**నమో నమో జగదేకనాథ తే సర్వేశ ।**
**విమల విశ్రుత లసద్విఖ్యాత కీర్తే ॥**

**1.రామ రఘువర సిత రాజీవలోచన ।**
**భూమిజా రమణ త్రిభువన విజయ ।**
**కోమలాంగ శ్యామ! కోవిద రణరంగ ।**
**భీమ విక్రమ సత్యబిరుద ప్రవీణ ॥**

**2.చారు లక్ష్మణ భరతశత్రుఘ్న పూర్వజ ।**
**తారకబ్రహ్మ నిత్యస్వరూప ।**
**ధీర శ్రీవేంకటాధిప భక్తవత్సల ।**
**భూరిగుణ సాకేతపుర నివాసా ॥**

**3.దళిత దైతేయ కోదండ దీక్షాదక్ష ।**
**జలజాప్తకుల విభీషణరక్షక ।**
**కలిత దశరథ తనయ కౌసల్యానంద ।**
**సులభ వానర ముఖ్య సుగ్రీవ వరద ॥**

**తాత్పర్యము :**

ఈ ప్రపంచానికి మొత్తానికి ప్రభువైనవాడా! అన్ని జీవులకు ఈశ్వరుడా! స్వచ్ఛమైన, ప్రసిద్ధమైన, ప్రకాశించే కీర్తి కలవాడా! రామా! నీకు (= తే) నమస్కారము. నమస్కారము.

1. ఓ శ్రీరామా! రఘువంశములో ప్రసిద్ధుడా! తెల్లని కలువలవంటి కన్నులు కలవాడా! (రాజును అంటే చంద్రుని అనుసరించి జీవించునది కనుక రాజీవము అని పేరు వచ్చింది) భూమి కుమార్తె అయిన సీతకు ఇష్టమైన వాడా! మూడు లోకాలలోను విజయాన్ని పొందిన వాడా! మెత్తనైన, నల్లనైన అవయవములు కలిగినవాడా! యుద్ధ భూమిలో ప్రవీణుడా! భయంకరమైన పరాక్రమం కలిగినవాడా! వాస్తవమైన పొగడ్తలు పొందుటలో నేర్పరీ! నీకు (= తే ) నమస్కారము. నమస్కారము.

2. అందమైన లక్ష్మణ భరతశత్రుఘ్నులకు అన్నయయిన వాడా! తారకమైన, నిత్యమయిన బ్రహ్మ స్వరూపుడా! ధైర్యవంతుడా! శ్రీ వేంకటాచల పర్వతమునకు ప్రభువా! భక్తులయందు అభిమానము కలవాడా! గొప్పవైన గుణములు కలవాడా! సాకేత పురములో నివసించినవాడా!

3. రాక్షసులను చీల్చే విలువిద్యలో నేర్పరీ! కమలాలకు ఇష్టమైన సూర్య వంశమునకు చెందినవాడా! విభీషణుని రక్షించినవాడా! దశరథ తనయుడా! కౌసల్యకు ఆనందము కలిగించువాడా! వానరులకు సులభమైనవాడా! సుగ్రీవునికి వరములిచ్చినవాడా!

**విశేషాలు :**

అన్నమయ్య ప్రయోగించిన తారక బ్రహ్మ పదము చాలా ప్రసిద్ధమైనది. ఆదిశంకరులు రచించిన శ్రీరామ భుజంగ ప్రయాతము లో

యదావర్ణ యత్కర్ణమూలేఽన్తకాలే<br>
శివో రామ రామేతి రామేతి కాశ్యాం ।<br>
తదేకం పరం తారకబ్రహ్మరూపం<br>
భజేఽహం భజేఽహం భజేఽహం భజేఽహం ॥ అని వ్రాసారు.

శివుడు కాశీలో మరణించే శ్రీరామ నామము చెబుతాడు. అది సంసార సాగరాన్నుంచి రక్షించేది. (తారక బ్రహ్మము) ఈ తారక బ్రహ్మ పదాన్ని బ్రహ్మ అవతారాల్లో ఒకటిగా చెబుతారు. 1. కుమారబ్రహ్మ, 2. అర్కబ్రహ్మ, 3. వీరబ్రహ్మ, 4. బాలబ్రహ్మ, 5. స్వర్గబ్రహ్మ, 6. గరుడబ్రహ్మ, 7. విశ్వబ్రహ్మ, 8. పద్మబ్రహ్మ, 9. తారకబ్రహ్మ.

తెలంగాణా రాష్ట్రంలోని అలంపూర్ క్షేత్రం లో తొమ్మిది రూపాలతో తొమ్మిది శివలింగాలను ప్రతిష్ఠించి బ్రహ్మదేవుడు పూజించాడు. ఇటువంటి అరుదైన క్షేత్రం భారతదేశములో ఇదొక్కటే. "ఈతడు తారకబ్రహ్మ మితడు మాదేవుడుకౌతుకాన చెప్పే" అని అన్నమయ్య తారక బ్రహ్మ శబ్దాన్ని ఇంకొకచోట కూడా ప్రయోగించాడు.



## *44. నమో నమో దశరథ నందన రామా (4-144)*

**నమో నమో దశరథనందన రామ**
**కమనీయ యాగభాగకర్త రామ**

**కాకుత్స్థకుల రామ కౌసల్యాసుత రామ**
**శ్రీకరగుణోన్నత శ్రీరామ**
**కాకాసురవైరి రామ కౌశికవత్సల రామ**
**భీకరతాటకాంతకబిరుద రామ**

**వారిధిబంధన రామ వాలిహరణ రామ**
**దారుహరకోదండభంజన రామ**
**ధారుణీజపతి రామ దశకంఠహర రామ**
**సారవిభీషణాభిషేచన రామ**

**అమరపాలిత రామ అయోధ్యాపతి రామ**
**సమరకోవిద రామ సర్వజ్ఞ రామ**
**విమల రామ శ్రీవేంకటగిరి రామ**
**రమణ శరణాగతరక్షక రామ**

**తాత్పర్యము :**

దశరథుని కుమారుడైన ఓ రామా! నీకు నమస్కారము. ఎంత అందమైన దృశ్యమయ్యా! నువ్వే యజ్ఞపురుషుడివి. యజ్ఞభాగాలు అందుకొనే వాడివి నువ్వే. యజ్ఞ భాగాలు అందజేసే కర్తవి (యజమానవై) కూడా నువ్వే. సమస్తము నువ్వే. నీకు నమస్కారము.

1. కకుత్స్థవంశములో జన్మించిన రామా! కౌసల్యకు కుమారుడైన రామా! సంపత్కరుడై, గుణోన్నతుడైన రామా! కాకాసురుడను రాక్షసుడు శత్రువుగా కలిగిన రామా! విశ్వామిత్రునికి ఇష్టమైన రామా! భయంకరమైన తాటకిని చంపినాడను బిరుదును కలిగిన రామా! నీకు నమస్కారము.

2. సముద్రమును బంధించిన రామా! వాలిని హరించిన (= చంపిన) రామా! అందమైన శివుని ధనుస్సును విరిచిన రామా! భూమి కుమార్తె అయిన సీతకు భర్తవైన రామా! పదితలలు గల రావణుని సంహరించిన రామా! విభీషణుని లంకా నగరానికి రాజుగా అభిషేకించిన రామా!

3. దేవతలను రక్షించే రామా! అయోధ్యా నగరానికి రాజయిన రామా! యుద్ధ విద్య బాగా తెలిసిన రామా! అన్నీ తెలిసిన ఓ రామా! పవిత్రుడైన రామా! శ్రీ వేంకటేశు నిగా వేంకటాద్రిలో ఉన్న రామా! అద్భుతమైన అందము కలవాడా! శరణని వచ్చిన వారిని రక్షించు రామా!



## *45.* నమో నమో రఘుకుల నాయకా

హంపి దగ్గర ఉన్న విజయనగర రాముని రకరకాల విశేషణాలతో స్తుతిస్తూ అన్నమయ్య చెప్పిన కీర్తన ఇది. (04- 471)

**నమో నమో రఘుకుల నాయక దివిజవంద్య -**
**నమో నమో శంకర నగజానుత**

**1.విహిత ధర్మ పాలక వీర దశరథ రామ -**
**గహన వాసినీ తాటకా మర్దన**
**అహల్యా శాప మోచన! అసురకుల భంజన**
**-సహజ! విశ్వామిత్ర సవన రక్షక**

**2.హర కోదండ హర సీతాంగనా వల్లభ**
**ఖర దూషణారి వాలి గర్వాపహ**
**తరణి తనుజాది తరుచర పాలక -**
**శరధి లంఘన కృత సౌమిత్రి సమేత**

**3.బిరుద రావణ శిరోభేదక విభీషణ**
**వరద సాకేత పురవాస రాఘవ**
**నిరుపమశ్రీవేంకట నిలయ విజ నగర**
**పురవర విహార, పుండరీకాక్ష**

**తాత్పర్యము :**

రఘువంశానికి నాయకుడైనవాడా! దేవతలచే నమస్కరింపదగిన వాడా! నమస్సులు. శివునిచే, పార్వతిచే పొగడబడినవాడా! నీకు నమస్సులు. నమస్సులు.

1. ధర్మాన్ని పాలించుటకై అవతరించినవాడా! వీరుడైన దశరథ రాముడా! దట్టమైన అడవిలో ఉన్న తాటకిని చంపినవాడా! అహల్యకు శాపాన్ని పోగొట్టినవాడా! రాక్షసవంశాన్ని నశింపచేసినవాడా! సహజమయిన స్వభావము కలవాడా! విశ్వామిత్రుని యాగాన్ని రక్షించిన వాడా! నమస్సులు. నమస్సులు.

2. శివుని ధనుస్సును విరిచినవాడా! సీతావనితకు పతియైనవాడా! ఖరుడు, దూషణుడు, వాలి గర్వాలను అపహరించినవాడా! సూర్యుని వర ప్రభావము వల్ల జన్మించిన

సుగ్రీవుడు మొదలయిన వానరులను పాలించినవాడా! లక్ష్మణునితో కలిసి సముద్రాన్ని దాటిన వాడా! నమస్సులు. నమస్సులు.

3. గొప్పవైన రావణాసురుని తలలను విరిచినవాడా! విభీషణుని లంకాధిపతి చేస్తానని వరమిచ్చినవాడా! సాకేతపురము (అయోధ్యా నగరము) నివాసముగా కలిగినవాడా! రాఘవా! సాటిలేని వేంకట పర్వతాన్ని ఇల్లుగా చేసుకొన్నవాడా! హంపీ దగ్గర ఉన్న విజయనగరపురములో విహరించేవాడా! పద్మములవంటి కన్నులు కలిగినవాడా! నమస్సులు.



## *46. నమో నమో లక్ష్మీ నరసింహా*

లక్ష్మీ నరసింహుని వివిధ విశేషాలతో పొగుడుతూ అన్నమయ్య రచించిన కీర్తన ఇది. (సంపుటము 02 - కీర్తన 348)

**నమో నమో లక్ష్మీ నరసింహా**
**నమో నమో సుగ్రీవనరసింహా**

**1.వరద! సులభ! భక్తవత్సల నరసింహా**
**నరమృగవేష శ్రీనరసింహా**
**పరమపురుష సర్వ పరిపూర్ణ నరసింహా**
**గిరిగుహావాస సుగ్రీవనరసింహా**

**2.భయహర ప్రహ్లాదపాలన నరసింహా**
**నయనత్రయారవింద నరసింహా**
**జయ జయ సురముని సంస్తుత నరసింహా**
**క్రియాకలాప సుగ్రీవనరసింహా**

**3.అతికృపానిలయ మోహనరూప నరసింహా**
**నతపితామహ ఉగ్ర నరసింహా**
**సతత! శ్రీవేంకటేశ్వర! దివ్యనరసింహా**
**కితవారిభంజన సుగ్రీవనరసింహా**

**తాత్పర్యము :**

లక్ష్మితో కలిసిన నరసింహస్వామీ! నీకు నమస్సులు. నమస్సులు. అందమైన కంఠము ఉన్న (= సుగ్రీవ) నరసింహస్వామీ! నీకు నమస్సులు. నమస్సులు.

1. వరములిచ్చువాడా! భక్తులకు సులభముగా కనిపించువాడా! భక్తులయందు అభిమానము కలిగినవాడా! నరసింహుడా! మానవుడు, మృగము కలిసిన వేషము కలిగినవాడా! శ్రీ నరసింహుడా! పరమ పురుషుడా! (ఈ సమస్త భూతజాలము

ఎవనిలో ఉన్నాయో, ఎవడు ఈ సమస్తానికి అంతర్యామిగా వ్యాపించియున్నాడో అతడు పరమపురుషుడు). అంతటా వ్యాపించినవాడా! శ్రీ నరసింహుడా! పర్వత గుహల్లో ఉండేవాడా! అందమైన కంఠము ఉన్ననరసింహ స్వామీ! నీకు నమస్సులు.

2. భయములను పోగొట్టువాడా! ప్రహ్లాదుని పాలించినవాడా! నరసింహుడా! పద్మములవంటి మూడు కన్నులు కలిగిన వాడా! నరసింహుడా! దేవతల చేత, మునుల చేత నమస్కరింపబడేవాడా! నరసింహుడా! నీకు జయము. జయము. భక్తులను కాపాడుట మొదలైన కార్యక్రమ సమూహము (= క్రియాకలాప) కలవాడా! అందమైన కంఠము ఉన్న నరసింహస్వామీ! నీకు నమస్సులు.

3. అత్యధికమైన దయ కలిగినవాడా! వ్యామోహము కలిగించే రూపము కలిగినవాడా! నరసింహుడా! వినయముతో నమస్కరించే బ్రహ్మాది దేవతలు కలిగినవాడా! ఉగ్రమైన నరసింహుడా! శాశ్వతంగా ఉండేవాడా! శ్రీవేంకటేశ్వర స్వరూపములో ఉన్నవాడా! తేజస్సు కలిగిన నరసింహుడా! చెడ్డతనము కలిగిన శత్రువులను నశింపచేయువాడా! అందమైన కంఠము ఉన్న నరసింహ స్వామీ! నీకు నమస్సులు.

**విశేషాలు :**

తెలుగు ప్రాంతంలో లక్ష్మీనరసింహస్వామి క్షేత్రాలు ఎన్నో! వాటిలో కొన్నింటిని స్మరించుకొందాం.

చెలగి కదిరిలోన శ్రీ వేంకటాద్రి మీద
మెలగేటి చక్కని లక్ష్మీ నారసింహము (04-182) అని అన్నమయ్య కీర్తన.

అనంతపురం జిల్లా కదిరిలో నరసింహస్వామి దేవాలయం ప్రసిద్ధి చెందింది. హిరణ్యకశిపుడనే రాక్షసున్ని చంపిన తరువాత స్వామి ఈ ప్రాంతానికే వచ్చాడని ఇక్కడవారి నమ్మకం. అట్లా వచ్చిన స్వామి అడవిలో వేటాడటం చేత వేటరాయడని పేరు వచ్చింది. కన్నడ భాషా ప్రభావంతో 'వే' 'బే' అయి వేటరాయడు బేట్రాయుడు – బేట్రాయి సామిగా పాటల్లోకి వచ్చాడు. (బేట్రాయి సామి దేవుడా – నన్నేలినోడ / బేట్రాయి సామి దేవుడా)

కృష్ణానదీ తీరాన ఉన్న ఐదు క్షేత్రాలను పంచ నారసింహ క్షేత్రాలంటారు. అంతేకాదు. ఈ ఐదు క్షేత్రాలలో నరసింహ స్వామిని

1. మంగళగిరి ,, పానకాలయ్య
2. వేదాద్రి ,, స్నానాలయ్య

3. మట్టపల్లి ,, అన్నాలయ్య
4. వాడపల్లి ,, దీపాలయ్య
5. కేతవరము ,, వజ్రాలయ్య పేర్లతో పిలుస్తారు.

వశిష్ట మహాముని కోరిక మేరకు అంతర్వేదిలో లక్ష్మీ నరసింహునిగా స్వామి కొలువయ్యాడు.

మూడు నరసింహస్వామి ఆలయాలు మంగళగిరిలో ఉన్నాయి. కొండ కింద శ్రీ లక్ష్మీ నరసింహస్వామి, కొండపైన పానకాల స్వామి, గిరి శిఖరం మీద గండాల నరసింహస్వామి ఆలయాలు ఉన్నాయి. శ్రీలక్ష్మి ఇక్కడ తపస్సు చేసింది కనుక ఇది మంగళగిరి. (మంగళ = లక్ష్మి) లక్ష్మి ఈ ప్రదేశంలో నరసింహస్వామికి అమృతము సమర్పించి స్వామి వారి కోపాన్ని తగ్గించింది. భక్తులు కృతయుగంలో అమృతాన్ని, త్రేతాయుగంలో ఆవునెయ్యిని, ద్వాపర యుగంలో ఆవు పాలను సమర్పించారట. కలియుగంలో బెల్లపు పానకాన్ని సమర్పిస్తున్నారు.

హంపిలో ఉన్న శ్రీలక్ష్మీ నరసింహ దేవాలయంలో శ్రీలక్ష్మీనరసింహ విగ్రహం 6.7 మీటర్ల ఏకశిలగా ఉంటుంది.

'ఆరగించి కూచున్నా డల్లవాడె / చేరువనే చూడరె లక్ష్మీనారసింహుడు' అని అన్నమయ్య చేత పొగడబడిన శ్రీ మాలోల నరసింహస్వామి ఎగువ అహోబిలానికి 2.కి మీ ఎగువున కొలువై ఉన్నాడు. మా– అంటే లక్ష్మి .

నల్గొండ జిల్లా యాదగిరిగుట్టలో యాదర్షి తపస్సుకు మెచ్చి నరసింహుడు జ్వాలానరసింహ, యోగానంద నరసింహ, గంధభేరుండ నరసింహ, ఉగ్ర నరసింహ మరియు లక్ష్మీ నరసింహ అను ఐదు రూపాలలో సాక్షాత్కరించి భక్తుల పూజలు పొందుతున్నాడు. ఇది పంచ నరసింహ క్షేత్రం. ఇవే కాక ఇంకా ఎన్నో నరసింహ క్షేత్రాలను అన్నమయ్య దర్శించి ఉంటాడు. అందుకే ఎన్నో నరసింహ కీర్తనలు రచించాడు.

ఈ కీర్తనలోని నయన త్రయారవింద పద బంధంతో అన్నమయ్య శివునికి, విష్ణువుకి అభేదం చెప్పాడు. అన్నమయ్యకు సుగ్రీవ నరసింహుడు అను పద బంధము చాలా ఇష్టము. బలవంతుడితని బంట్లమై బ్రతుకుదుము / కిలకిల నవ్వీ సుగ్రీవ నరసింహుడు అని ఇంకొక కీర్తనలో స్వామి నవ్వులకు పరవశించాడు. ఆ అన్నమయ్య పరవశ పదబంధాలతో కష్టాల బంధాలనుండి మనలను తొలగించాలని శ్రీలక్ష్మీ

నరసింహస్వామిని ప్రార్థిద్దాము.



## *47. నమో నారాయణాయ నమః సమధికానందాయ*

శ్రీ మన్నారాయణుని అనేక రకాలుగా కీర్తిస్తూ అన్నమయ్య రచించిన కీర్తన ఇది. (01 - 245)

**నమో నారాయణాయ నమః ।**
**సమధికానందాయ సర్వేశ్వరాయ ॥**

**1.ధరణీసతీఘన స్తనశైలపరిరంభ-**
**పరిమళశ్రమజల ప్రమదాయ ।**
**సరసిజ నివాసినీ సరసప్రణామయుత-**
**చరణాయతే నమో సకలాత్మకాయ ॥**

**2.సత్యభామాముఖాంచన పత్రవల్లికా-**
**నిత్య రచనక్రియా నిపుణాయ ।**
**కాత్యాయనీ స్తోత్రకామాయ తే నమో ।**
**ప్రత్యక్ష నిజపరబ్రహ్మ రూపాయ ॥**

**3.దేవతాధిప మకుటదివ్య రత్నాంశుసం-**
**భావితామల పాదపంకజాయ ।**
**కైవల్య కామినీకాంతాయ తే నమో ।**
**శ్రీవేంకటాచల శ్రీనివాసాయ ॥**

**తాత్పర్యము :**

నారాయణునికి నమస్కారము. అన్ని ఆనందాలకంటె గొప్పదైన, బ్రహ్మానందముకంటె కూడా గొప్పదైన ఆనందరూపము కలవానికి నమస్కారము. అందరికి ప్రభువైనవానికి నమస్కారము.

1. భూదేవియొక్క గొప్పవైన పర్వతములవంటి స్తనములను కౌగిలించుకోవటము వలన ఏర్పడిన పరిమళముతో కూడిన చెమటతో ఆనందించే నారాయణునికి నమస్కారము. లక్ష్మీదేవియొక్క శృంగార విలాస నమస్కారాలతో ప్రకాశించే పాదములు కలవానికి నమస్కారము. సమస్త సృష్టికి ఆత్మయైన నారాయణునికి నమస్కారము.

2. సత్యభామ ముఖాన్ని ఆనందింపచేసే ఆకులతో కూడిన తీగలయొక్క రచనా క్రియలో నేర్పరియైన నారాయణునికి నమస్కారము. పార్వతీదేవియొక్క స్తోత్రమును కోరుకొనే నారాయణా! నీకు నమస్కారము. కళ్ల ఎదురుగా వేంకటేశుని రూపములో యథార్థంగా కనిపించే పరబ్రహ్మ రూపమైన నారాయణునికి నమస్కారము.

3. దేవతలకు అధిపతియైన ఇంద్రునియొక్క కిరీటములోని దివ్యమైన రత్నముల కిరణాలచేత గౌరవింపబడిన పాదపద్మములు కలిగిన నారాయణునికి నమస్కారము. మోక్షలక్ష్మికి భర్తయైన నారాయణునికి నమస్కారము. శ్రీ వేంకటపర్వతమందు శ్రీనివాసుని రూపములో ఉన్న నారాయణునికి నమస్కారము.

**విశేషాలు :**

ధరణీసతీఘన స్తనశైలపరిరంభ

శ్రీనివాసుని దేవేరులుగా అలమేలు మంగ, లక్ష్మి, భూదేవి, శ్రీదేవి, పద్మావతి, అండాళ్, గోదాదేవి, బీబీ నాంచారి వంటి అనేక పేర్లు ఉన్నాయి. నిత్యం లక్షలాదిమంది దర్శించే వేంకటేశ్వరస్వామివారి మూలవిరాట్టును ధ్రువబేరం అంటారు. ధ్రువ అంటే స్థిరంగా ఉండేది ఈ మూలవిరాట్టు ప్రక్కన శ్రీదేవి, భూదేవి విగ్రహాలు ఉండవు. స్వామి వారి భార్యలు అని మనము పిలుచుకొనే భూదేవి, అలమేలుమంగ మొదలైన వారి మూలతత్వాన్ని సత్యభామ సరసపు నగవు అను కీర్తనలో ఇలా వివరించాను. పేర్లు వేరు వేరు. రూపం మాత్రం ఒక్కటే. సత్యభామ, రుక్మిణి, శ్రీలక్ష్మి, అలమేలు మంగ – ఇలా పేర్లు వేరువేరు. అందరూ ఒకటే. "లక్ష్మి వేంకటేశ్వరుని వక్షస్థలం లో ఉన్నప్పటికీ, రెండు కళ్ళతో ఆయన అందాన్ని పూర్తిగా అనుభవించనప్పటికీ తృప్తి పడలేదుట. అందుకే ఆయన కుడిఎడమలలో ఎప్పుడు విడిచిపెట్టకుండా ఉండే లక్ష్మీదేవి, భూదేవులుగా మారింది. ఇంకా తృప్తి తీరక నీలాదేవిగా మారింది. ఇలా మూడు అవతారాలు గ్రహించి, ఆరు కండ్లతో వేంకటేశ్వరుని సౌందర్యరసాయనాన్ని (= అందమనే తృప్తిపరచే పదార్థాన్ని) అనుభవిస్తోందని మన ప్రాచీనుల మాట. (శ్రీవేంకటాచల మాహాత్మ్యం. 2 – 2,3,4,5 శ్లో.) అమ్మవారికే తృప్తి లేనప్పుడూ వర్ణనలు చేసే కవిగారికి తృప్తి ఎలా ఉంటుంది?... అందుకే అలమేలుమంగ ఈ కీర్తనలో నాలుగు రూపాలులో కనిపిస్తుంది.

ఈ కీర్తనలో కూడా భూదేవి, లక్ష్మి, సత్య భామ అనే నాయికలను స్వామివారికి అన్నమయ్య ప్రేమ పాత్రలుగా వర్ణించుటలో మూలతత్వాన్ని పై విధంగానే గ్రహించాలి.



## *48. నమో నారాయణాయ (01-269)*

**నారాయణాయ సగుణ బ్రహ్మణే సర్వ**
**పారాయణాయ శోభన మూర్తయే నమో**

**1.నిత్యాయ విబుధ సంస్తుత్యాయ నిత్యాధి
పత్యాయ మునిగణ ప్రత్యయాయ
సత్యాయ ప్రత్యక్షాయ సన్మానస సాం
గత్యాయ జగదవనకృత్యాయ తే నమో**

**2.ఆక్రమోద్ధత బాహు విక్రమాతిక్రాంత
శుక్ర శిష్యోన్మూలన క్రమాయ
శక్రాది గీర్వాణ వక్ర భయ భంగ ని
ర్వక్రాయ నిహతారి చక్రాయ తే నమో**

**3.అక్షరాయాతి నిరపేక్షాయ పుండరీ
కాక్షాయ శ్రీ వత్స లక్షణాయ
అక్షీణ విజ్ఞాన దక్ష యోగీంద్ర సం
రక్షాను కంపా కటాక్షాయ తే నమో**

**4.కరిరాజవరదాయ కౌస్తుభాభరణాయ
మురవైరిణే జగన్మోహనాయ
తరుణేందుకోటీర తరుణీ మనస్స్తోత్ర
పరితోష చిత్తాయ పరమాయ తే నమో**

**5.పాత్ర దానోత్సవ ప్రథిత వేంకటరాయ
ధాత్రీశ కామితార్థ ప్రదాయ
గోత్రభిణ్మణి రుచిర గాత్రాయ రవిచంద్ర
నేత్రాయ శేషాద్రి నిలయాయ తే నమో నారాయణాయ**

**తాత్పర్యము :**

నారాయణునికి నమస్కారం. గుణములు కలిగిన బ్రహ్మమునకు ,సర్వ సృష్టియందు శ్రద్ధ కలవానికి, అందమైన రూపము కలవానికి నమస్కారం.

1. ఎప్పుడునూ ఉండువాడా! పండితుల పొగడ్తలందుకొనేవాడా! ఎప్పుడూ అధికారము కలవాడా! ముని జనములందు ఖ్యాతి కలవాడా! సత్యవంతుడా!, కనులు మొదలైన ఇంద్రియములకు కనబడువాడా!, మంచి మనస్సులతో స్నేహము కలవాడా!, ప్రపంచాన్ని రక్షించే క్రియ కలవాడా! ఓ నారాయణా! నీకు నమస్కారము.

2. ఆక్రమణ గర్వంతో, బాహు పరాక్రమంతో హద్దు మీరిన శుక్రాచార్యుల శిష్యులైన రాక్షసులను నిర్మూలించిన బలముకలవాడా!, ఇంద్రాది దేవతల భయాన్ని, అవమానాన్ని పోగొట్టినవాడా! శత్రువులను చంపిన చక్రము కలిగినవాడా! ఓ నారాయణా! నీకు నమస్కారము.

3. సర్వోత్తమమైన, నాశరహితమైన బ్రహ్మ స్వరూపుడా! అందరియందు సమభావము కలవాడా!, తామరలవంటి కన్నులు కలవాడా!, రొమ్మునందు శ్రీ వత్సమను మచ్చ కలవాడా!, తరుగని విజ్ఞానముగలిగిన నేర్పరులైన యోగీశ్వరులను కాపాడి, కరుణతో అనుగ్రహించువాడా! ఓ నారాయణా! నీకు నమస్కారము.

4. గజేంద్రునికి వరమునిచ్చిన వాడా! కౌస్తుభమను మణిని ( కుస్తుభ = సముద్రమందు

బుట్టినది) రొమ్ములో ఆభరణముగా కలిగినవాడా! మురుడను రాక్షసుడు శత్రువుగా కలవాడా! ప్రపంచమును మోహింపచేసే ఆకారము కలిగినవాడా! నెలవంకని కిరీటముగా ధరించిన శివుని భార్యయైన పార్వతీదేవి యొక్క మనస్సుతో కూడిన స్తోత్రముతో సంతోషించిన మనస్సు కలవాడా! పరమాత్ముడా! నీకు నమస్కారము.

5. యోగ్య దాన ఉత్సవాలతో ప్రసిద్ధమైన వేంకటేశుడా! నారాయణుడా! నీకు నమస్కారము. మహారాజులకు (గొప్ప అధికారులకు) కోరిన కోర్కెలు అనుగ్రహించేవాడా! ఇంద్రనీల మణి కాంతితో మనోహరమైన శరీరము కలవాడా! సూర్య చంద్రులు నేత్రములుగా కలవాడా! శేషాచలము నివాసముగా కలవాడా! యోగ్య దాన ఉత్సవాలతో ప్రసిద్ధమైన వేంకటేశుడా! నారాయణుడా! నీకు నమస్కారము.

**విశేషాలు :**

ఆంతర్యము

ఈ కీర్తనలో అన్నమయ్య నారాయణ స్వామికి నమస్తే అంటున్నాడు. నారాయణుడు ఎటువంటి వాడో అయిదు చరణాల్లోను వివరించాడు. ఈ కీర్తన అంతా సంస్కృత పదాలతో ఉంటుంది. సంస్కృతంలో 'య' అనేది అకారాంత పదాల్లో సాధారణంగా చతుర్థీ విభక్తి ప్రత్యయంగా చివరిగా వస్తుంటుంది. (ఉదా. శివాయ, రామాయ - ఇలా..) ఇప్పుడు తగ్గిపోతోందికాని, ఇదివరకటి రోజుల్లో అక్షరాభ్యాసం "ఓం నమశ్శివాయ ఓం నమశ్శివాయసిద్ధంనమః" (శివునికొరకు నమస్కారం. విద్యారంగంలో సిద్ధులైన గురువుకి నమస్సులు) అని ప్రారంభమయ్యేది. గురువు తన శిష్యులని సిద్ధులని (విద్యా ప్రయోజనం సిద్ధించినవారిగా) చేయాలి. ఈ యకారం పదే పదే వస్తుంటే వినసొంపుగా మాత్రమే కాదు. తెలియని భక్తి భావం ఉదయిస్తుంది. అందుకే అన్నమయ్య ఈ యకారాంత పదాలతో కీర్తనని అందంగా నడిపించాడు. ప్రతి మంత్రానికి మొదట చివర నమశ్శబ్దమున్న మంత్రసముదాయము నమకము (నమస్తే మన్యవ ఉతోత ఇషవే నమః). ఇది చాలా ప్రసిద్ధి పొందినది. అన్నమయ్య కీర్తనల్లో నమకము ఈ నారాయణాయ కీర్తన.

సగుణ బ్రహ్మణే

రామానుజులవారు భగవంతుని పరమ నిర్గుణ బ్రహ్మమన్నారు. మళ్ళీ అపర సగుణ బ్రహ్మమన్నారు. ఇద్దరి మధ్య తేడా లేదన్నారు. (బ్రహ్మ సూత్ర వ్యాఖ్యానము) సగుణుడై (సకల గుణశోభితుడై) భగవంతుడు పూర్ణుడై, కాలమునకు ఆకాశమునకు

లోబడి మార్పుచెందు స్వభావము లేని వాడై స్థిరముగా ఉంటున్నాడు. ఈ కీర్తనలోని సగుణ బ్రహ్మము అతడే. రెండవ సంపుటములోని 412 కీర్తనలో కూడా 'నిర్గుణాయ గుణాత్మనే' అని అన్నమయ్య స్వామిని, సగుణునిగా, నిర్గుణునిగా వర్ణించాడు.

అక్షరాయ

తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః ।
స బ్రహ్మః స శివః స హరిః స ఇంద్రః సోక్షరః పరమః స్వరాట్ ॥ అని ప్రసిద్ధమైన మంత్రము.

మన శరీరంలో అగ్ని జ్వాల ఊర్ధ్వ ముఖంగా అమరి ఉంది. శరీరంలో ఆ అగ్నిశిఖ మధ్య పరమాత్మ ఉన్నాడు. ఆయనే బ్రహ్మ, శివుడు, విష్ణువు. ఆయనే ఇంద్రుడు. ఆయన నాశనము లేనివాడు, స్వప్రకాశుడు. ఈ మంత్రంలో చెప్పిన అక్షరుడే అన్నమయ్య కీర్తనలోని అక్షరుడు.

అతి నిరపేక్షాయ

నిరపేక్ష అనే శబ్దానికి Neutrality (నిష్పక్షపాతము, సమభావము) అనే అర్థాలు బ్రౌణ్య ఇంగ్లీష్-తెలుగు నిఘంటువులో ఉన్నాయి. అతి అనే ఉపసర్గ అధికమైన అనే అర్థాన్ని ఇస్తుంది. కొందరు కొన్నింటిలోనే సమభావం చూపగలరు. స్వామి అన్నింటిలోను సమభావాన్ని చూపగలడని అతి శబ్ద ప్రయోగం.

తరుణేందుకోటీర తరుణీ మనస్స్తోత్ర

ఒక రోజు పార్వతీదేవి పరమశివుని విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణకు కాస్త సూక్ష్మమైన మార్గం చెప్పమని కోరింది. దానికి పరమేశ్వరుడు,

శ్లో॥ శ్రీ రామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్ర నామతత్తుల్యం రామనామ వరాననే ॥ అని చెప్పాడు.

ఈ శ్లోకం మూడుమార్లు స్మరించితే ఒక్క విష్ణు సహస్రనామ పారాయణ ఫలితమేకాదు, భక్తులకు శివసహస్రనామ పారాయణ ఫలితం కూడా లభిస్తుంది. ఏ భక్తులు కాశీలో జీవిస్తూ ఆ పుణ్యక్షేత్రంలో మరణిస్తారో, వారి చివరి దశలో శంకరుడు ఈ తారకమంత్రం వారి కుడి చెవిలో చెప్పి మోక్షం కలిగిస్తాడని పెద్దలు చెబుతారు. ఈ విషయాలన్నీ మనకు తరుణేందుకోటీర తరుణీ మనస్స్తోత్ర పరితోష చిత్తాయ అను సమాసంలో అన్నమయ్య జ్ఞప్తి చేసాడు.

గోత్రభిణ్మణి రుచిర గాత్రాయ

ఇంద్రనీల మణి కి అన్నమయ్య సృష్టించిన సంస్కృత పదం గోత్రభిణ్మణి. గోత్రమంటే పర్వతాలు. భిత్ అంటే వాటి రెక్కలను ఖండించినవాడు. ఇంద్ర నీలమణి అని సమన్వయార్థం.

నమో

శంకర భగవత్పాదులు కనకధారాస్తవంలో 'మామేవ మాతరనిశం కలయంతు నాన్యే' అంటారు. నిన్ను ఉద్దేశించి చేసే నమస్కారం మాత్రం ఎప్పుడు నాదగ్గర ఉండేట్టు చూడు తల్లీ! మిగతావి నాకు అక్కర్లేదు ఆని నమస్కారానికి ఉన్న గొప్పతనాన్ని చెప్పారు. మన అన్నమయ్య కూడా 'నమో' అని ప్రతి చరణం చివర అంటూ ఆ నమస్కార గొప్పతనాన్ని చెప్పకుండా చెప్పాడు.

నారాయణ

1. నర సంబంధమైన శరీరము నారము. అవతారాలలో నరశరీరాన్ని పొందిన వాడు నారాయణుడు.

2. నారమంటే జలం. అది స్థానంగా కలవాడు నారాయణుడు.

3. మానవుల సమూహము నివాసంగా కలవాడు నారాయణుడు.

4. శబ్దం చేత తెలియ దగిన వాడు నారాయణుడు. (అమరకోశము).

దుఃఖాలలో ఉన్నవారు నారాయణ శబ్దాన్ని విన్నంత మాత్రమున సుఖం కలుగుతుందని విష్ణు సహస్ర నామ ఫల శ్రుతి. (ఆర్తా విషణ్ణా....) ఇంతటి మహత్తరమైన మహిమ కలది నారాయణ శబ్దం.

తల మీద సాలగ్రామం పెట్టి (విష్ణుమూర్తి గుర్తు కలిగిన ఒక శిల.), నారాయణ స్మరణతో సన్యాసులకు ఆ దీక్ష ఇస్తారు. అందుకే వారు నారాయణ స్వరూపులు. కనుక సన్యాసులకు మనం నమస్కారం చేస్తూ ఓం నమో నారాయణ అనాలి. వారు తిరిగి నారాయణ నారాయణ అంటారు. ఎందుకంటే ఆ నమస్కారం నారాయణునికే చెందుతుంది కాబట్టి. నామ నామినో రభేదః నామానికి, నామికి (భగవంతునికి ) తేడాలేదు. అన్నమయ్య నారాయణ సంకీర్తనకు, నారాయణునికి తేడాలేదు.



## *49. నవనారసింహా నమో నమో । (01-453)*

**నవనారసింహా నమో నమో ।**
**భవనాశితీర యహోబలనారసింహా ॥**

**1.సతతప్రతాప రౌద్రజ్వాలా నారసింహా ।**
**వితతవీరసింహా! విదారణా ।**
**అతిశయకరుణ! యోగానంద నరసింహ ।**
**మతిశాంతపుకానుగుమానినారసింహ ॥**

**2.మరలి బీభత్సపుమట్టెమళ్ళనరసింహ ।**
**నరహరి భార్గోటినారసింహ ।**
**పరిపూర్ణ శృంగార ప్రహ్లాదనరసింహ ।**
**సిరుల నద్భుతపులక్ష్మీనారసింహ ॥**

**3.వదనభయానకపువరాహనరసింహ ।**
**చెదరనివైభవాల శ్రీనరసింహా ।**
**అదన శ్రీవేంకటేశ అందు నిందు నిరవైతి ।**
**పదివేలురూపముల బహునారసింహ ॥**

**తాత్పర్యము :**

తొమ్మిది రూపాలలో ఉన్న ఓ నరసింహస్వామీ! నీకు నమస్కారము. నమస్కారము. భవనాశి అను నదీతీరములో ఉన్న ఓ అహోబల నరసింహస్వామీ! నీకు నమస్కారము.

1.ఎప్పుడూ ప్రతాపము, రౌద్రము కలిగిన జ్వాలా నరసింహుడా! వ్యాపించిన వీర సింహమా! శత్రువులను చీల్చు సమర్థుడా! ఎక్కువైన దయ కలిగిన వాడా ! యోగానంద నరసింహుడా! మతికి శాంతాన్ని అనుగ్రహించు కానుగుమానినారసింహుడా ! నీకు నమస్కారము.

2. ఎప్పటికప్పుడు (= మరలి) బాగా భయంకరముగా ఉండే మట్టెమళ్ళనరసింహుడా! నరహరియైన భార్గోటినారసింహుడా ! పరిపూర్ణమైన చేష్టలు కలిగిన శృంగారము కలిగిన ప్రహ్లాదనరసింహుడా ! సంపదను అనుగ్రహించు అద్భుతమైన మహిమలు కలిగిన లక్ష్మీనారసింహుడా! నీకు నమస్కారము.

3. భయంకరమైన మోము కలిగిన వరాహపు నరసింహుడా! చెక్కుచెదరని వైభవములు కలిగిన శ్రీనరసింహుడా! తగిన సమయములో ఆ లోకంలోను, ఈ లోకములోను స్థానముగా ఉన్నావు. అనేక రూపములు కలిగిన ఓ నరసింహుడా! నీకు నమస్కారము.

**విశేషాలు :**

నవ నారసింహులు

1. "జ్వాలాహోబిల మాలోల క్రోడ కారంజ భార్గవాః!
యోగానంద చ్ఛత్రవట పావనా నవమూర్తయః !!"

అనునవి స్వామివారి తొమ్మిది మూర్తులు. 1.జ్వాల, 2. అహోబిల, 3. మాలోల, 4. క్రోడ, 5. కారంజ, 6. భార్గవ, 7. యోగానంద, 8. ఛత్రవట, 9. పావన నారసింహులు.

2. మహానంది నుంచి సుమారు 70 కిలోమీటర్ల దూరంలో అహోబిలం క్షేత్రం ఉంది. ఈ క్షేత్రంలో నవ నారసింహులు వెలసి ఉన్నందున నవ నారసింహ క్షేత్రమని పిలుస్తారు. నరసింహ స్వామి కొండ కిందా పైనా వెలసి ఉండటంతో దిగువ, ఎగువ అహోబిలమని పిలుస్తారు.

3. నరసింహుని స్వభావాన్ని వివరించే ప్రార్థనా శ్లోకమిది.

ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతో ముఖం...
నృసింహం భీషణం భద్రం మృత్యు మృత్యు నమామ్యహం...
ఉగ్రం (ఉగ్ర నరసింహం ఎగువ అహోబిలం),
వీరం (వరాహ నరసింహ),
మహావిష్ణుం (మాలోల నరసింహ),
జ్వలంతం ( జ్వాలా నరసింహ),
సర్వతోముఖం (పావనానరసింహ),
నృసింహం (కారంజ న అసింహ),
భీషణం (ఛత్రవట నరసింహ),
భద్రం (యోగానంద నరసింహ),
మృత్యుమృత్యుం (భార్గవ నరసింహ)

సతతప్రతాప రౌద్రజ్వాలా నారసింహో । (01.జ్వాలా నరసింహస్వామి)

ఎగువ అహోబిలానికి మూడు మైళ్ల దూరంలో అచల ఛాయ ఏరు అనే పర్వతపు పై భాగాన జ్వాలా నరసింహస్వామి ఆలయం ఉంది. ఈ ప్రదేశంలోనే ఉగ్ర నరసింహుడు అతి భయంకరమైన రూపంలో భక్తులకు కనబడతాడు. ఇక్కడే స్వామి వారు హిరణ్యాకశ్యపుని చంపాడని, తరువాత రక్తంతో తడిసిన చేతులను అక్కడే ఉన్న చిన్న గుండంలో కడుక్కొన్నాడని చెబుతారు. అందువలనే నీరు నేటికి ఎర్రగా కనిపిస్తుందని భక్తులు నమ్ముతారు. అన్నమయ్య ఈ స్వామిని వర్ణిస్తూ

ప్రతాప శబ్దాన్ని వాడాడు. ప్రతాపమంటే వేడి. జ్వాలలకు సంబంధించిన సహజమైన గుణము వేడి. అందుకే మనస్సుకు హత్తు కొనేటట్లు ప్రతాపమన్నాడు.

పరిపూర్ణశ అంగార ప్రహ్లాదనరసింహ । (02.అహోబిల నరసింహ స్వామి)

ప్రహ్లాదుడు ప్రార్థించగా గరుడాద్రి పర్వతము క్రింద భవనాశిని తీరములో గుహలోపల స్వయంభువుగా వెలసి ప్రహ్లాదునికి దర్శనమిచ్చిన అహోబిల నరసింహుడే అన్నమయ్య వర్ణించిన పరిపూర్ణశృంగార ప్రహ్లాదనరసింహుడు. బ్రహ్మోత్సవాల్లో భాగంగా శ్రీ నరసింహ స్వామి వారికి శృంగార డోలోత్సవాన్ని నిర్వహిస్తారు. ఇది దృష్టిలో పెట్టుకొనే కాబోలు అన్నమయ్య పరిపూర్ణశృంగార ప్రహ్లాదనరసింహ అన్నాడు.

సిరుల నద్భుతపులక్ష్మీనారసింహ ॥ (03.మాలోలా నరసింహస్వామి)

మా అంటే లక్ష్మీదేవి, లోలుడు అంటే ప్రియమైనవాడు అని అర్థం లక్ష్మీ సమేతుడై, ప్రసన్నవదనునిగా ఉండే ఈ స్వామిని సిరుల నద్భుతపులక్ష్మీనారసింహ అని అన్నమయ్య సంబోధించాడు. రౌద్రంగా ఉండే స్వామి శాంతంగా కనిపించటం అద్భుతమే కదా!

వదనభయానకపువరాహనరసింహ । (04.క్రోడా నరసింహ స్వామి)

వరాహ నరసింహ స్వామి గుహలో చక్రాకారంలో శిరస్సు వరాహ రూపంలో, శరీరం మానవరూపంలో, తోక సింహంలా విచిత్రాక అతిలో దర్శనమిస్తారు. భక్తులకు దర్శనమిస్తారు.

మతిశాంతపుకానుగుమానినారసింహ ॥ (05.కారంజ నరసింహస్వామి)

కారంజము అంటే తెలుగులో కానుగు చెట్టు. కానుగు చెట్టు కింద ఉండటం వల్ల ఈ స్వామి వారిని కానుగు మాని నరసింహుడంటారు. మతి అంటే ఉన్న రకరకాల అర్థాలలో ఇష్టము కూడా ఒకటి. ఇష్టము నెరవేరితేనే శాంతము కలుగుతుంది. ఈ కానుగుమానినారసింహుడు అలా మన ఇష్టాలను నెరవేరుస్తాడని 'మతిశాంతపుకానుగుమానినారసింహ' అని అన్నమయ్య ప్రయోగము.

నరహరి భార్గోటినారసింహ (06.భార్గవ నరసింహస్వామి)

భార్గవ (పరశు) రాముడు తపస్సు చేసిన స్థానంలో వెలసినందున స్వామి భార్గవ నరసింహ స్వామి లేదా భార్గోటినారసింహ పిలుస్తారు. చిన్న అహోబిలానికి స్వామి వారు వెలసిన ఈ క్షేత్రం మూడు మైళ్ల దూరంలో ఉంది. పరశురాముడు జమదగ్ని

కొడుకు. తల్లి రేణుక. తన తండ్రిని కార్తవీర్యార్జునుని పుత్రులు హోమపశువు కోసము చంపితే కోపించి భూమిని క్షత్రియశూన్యముగ చేయాలనుకొన్నాడు. ఇరవై ఒక్కమార్లు రాజులమీద దండెత్తి గర్భాలలో ఉన్న పిండాలతో సహ చంపి, వాళ్ల నెత్తురుతో పితృదేవతలకు తర్పణము చేసాడు. ఆనెత్తురు శమంతపంచకము అను పేర అయిదుమడుగులు అయింది. నరసింహ స్వామి కూడా హిరణ్య కశిపుని చంపి ఇలా రక్తాన్ని అభిషేకము చేసిన విషయాన్ని జ్ఞప్తి చేస్తూ అన్నమయ్య నరహరి శబ్దాన్ని భార్గోటి నారసింహునికి విశేషణం గా వాడాడు.

అతిశయకరుణ !యోగానంద నరసింహ । (07.యోగానంద నరసింహస్వామి)

దిగువ అహోబిలం ఆలయానికి ఆగ్నేయ దిశలో సుమారు 2 కిమీ దూరంలో వెలసిన యోగానంద నరసింహుని ఆలయం ఉన్నది. హిరణ్యకశపుని చంపిన తరువాత స్వామి వారు ప్రహ్లాద వరదునికి యోగాసనాలు నేర్పించి తన దయ చూపించాదని ఇక్కడి కథ. అందువల్ల స్వామి దయను విశేషిస్తూ అతిశయకరుణ! యోగానంద నరసింహ అని అన్నమయ్య ఆప్యాయంగా పిలుచుకొన్నాడు.

వితతవీరసింహ (08.ఛత్రవట నరసింహస్వామి)

ఛత్రం రూపంలో ఉన్న వట వృక్షం (గొడుగు లాంటి మర్రిచెట్టు) నీడలో ఉన్న ఛత్రవట నరసింహస్వామి అని పేరు. ఈయనను అన్నమయ్య ఈ కీర్తనలో వితతవీరసింహ అన్నారు.

చెదరనివైభవాల శ్రీనరసింహా (09.పావన నరసింహస్వామి)

ఈయననే పాములేటయ్య నరసింహస్వామి అంటారు. ప్రతి ఏడాది బ్రహ్మోత్సవాల అనంతరం పాములేటయ్య వారాలు అను పేరు మీద ఉత్సవాలు అత్యంత వైభవంగా జరుగుతాయి. ఇక్కడ స్వామి వారికి మొక్కుబడులు తీర్చటానికి చాలా ప్రాంతాల నుంచి తండోప తండాలుగా శనివారాల్లో ఎక్కువ మంది భక్తులు వస్తుంటారు. ఈ వైభోగాలు ఏనాటికి చెదరనివి. అందుకే అన్నమయ్య చెదరనివైభవాల శ్రీనరసింహా అన్నారు.

మరలి బీభత్సపు మట్టెమళ్ళనరసింహ

భరించటానికి వీలులేనిది బీభత్సము. ఇది మూడు రకాలని దశ రూపకము. 1. ఉద్వేగి, (మనో వ్యాకులతను కలిగించేది) 2. క్షోభణము, (దుఃఖ పెట్టేది) 3.

ఘృణాశుద్ధము (రోతని కలిగించేది). ఎప్పటికప్పుడు శత్రువులకు బీభత్సముగా ఉండే స్వామి అనే అర్థంలో మరలి బీభత్సపుమట్టెమళ్ళనరసింహ అని అన్నమయ్య ప్రయోగము. ఈయన నవ నరసింహ మూర్తులలో ఒకరని అన్నమయ్య పద కోశంలో పేర్కొన్నారు. కాని (473) అహోబిల క్షేత్రంలోని మార్గము చూపు పటములో (రూట్ మ్యాప్ ) ఈ ప్రసక్తి లేదు.

హృదయాలను రసానందంలో తేలిస్తుంది అన్నమయ్య కీర్తన.

మధ్యప్రదేశ్లో దేవస్ జిల్లాకు 45 కిలోమీటర్ల దూరంలో ఉన్న హోత్పిప్లియా అనే చిన్న పట్టణంలో ప్రతి సంవత్సరమూ నరసింహ ఆలయంలోని స్వామి విగ్రహం నీటి మీద తేలుతుంది. శ్రద్ధతో ఆకళింపు చేసుకొంటే నవ నరసింహ కీర్తన, ఈ విగ్రహపు తేలిన వార్త - మనస్సుకు పడుతుంది.



## *50. నవనీత చోర నమో*

శ్రీవేంకటేశ్వరుని అనేక విశేషణాలతో నుతించిన అన్నమయ్య సంస్కృత కీర్తన ఇది. (సంపుటము 03-24 కీర్తన)

**నవనీతచోర నమో నమో**
**నవమహిమార్ణవ నమో నమో**

**1.హరి నారాయణ కేశవాచ్యుత శ్రీకృష్ణ**
**నరసింహ వామన నమో నమో**
**మురహర పద్మనాభ ముకుంద గోవింద**
**నరనారాయణరూప నమో నమో.**

**2.నిగమగోచర విష్ణు నీరజాక్ష వాసుదేవ**
**నగధర నందగోప నమో నమో**
**త్రిగుణాతీత దేవ త్రివిక్రమ ద్వారక**
**నగరాధినాయక నమో నమో.**

**3.వైకుంఠ రుక్మిణీవల్లభ చక్రధర**
**నాకేశవందిత నమో నమో**
**శ్రీకర గుణనిధి శ్రీ వేంకటేశ్వర**
**నాకుజననుత నమో నమో.**

**తాత్పర్యము :**

అప్పుడు చిలికియెత్తిన వెన్న నవనీతము. దానిని దొంగిలించేవాడా! నీకు నమస్కారము. నమస్కారము. కొత్తవైన మహిమములకు సముద్రమువంటివాడా! నీకు నమస్కారము. నమస్కారము. (మహిమ = 1.గొప్పతనము. 2.ఒక ఐశ్వర్యము. 3.మహాత్మ్యము.)

1. పాపాలను హరించేవాడా! (హరి) నీళ్లు స్థానముగా కలవాడా! (నారాయణ) మంచి వెంట్రుకలు కలిగిన వాడా! (= కేశవా) నాశము లేనివాడా! పదవి నుండి జానివాడా! (అచ్యుత) నల్లని వాడా! భక్తుల దుఃఖాలను తొలగించేవాడా! పాపాలను నశింపజేసే వాడా! (శ్రీకృష్ణ) నరశ్రేష్ఠుడా! (నరసింహ) పొట్టి వాడా! (వామన) నీకు నమస్కారము. నమస్కారము. ముర అను రాక్షసుని సంహరించిన వాడా! (మురహర) బ్రహ్మ జన్మించుటకు కారణమైన పద్మము నాభియందు కలవాడా! (పద్మనాభ) మోక్షము నిచ్చువాడా! ( ముకుంద) భూమిని, గోవును, స్వర్గమును, వేదమును పొందెడివాడా! (గోవింద) బదరీవనమున అనేక వేల సంవత్సరములు తపము చేసిన నర నారాయణులనే మహా మునుల రూపములను ధరించినవాడా! (నరనారాయణరూప) నీకు నమస్కారము. నమస్కారము.

2. వేదములలో కనిపించేవాడా! (నిగమగోచర) అంతటా వ్యాపించినవాడా! (విష్ణు) కమలములవంటి కన్నులు కలవాడా! వసుదేవుని కుమారుడా! గోవర్ధన పర్వతాన్ని ధరించిన వాడా! నందునిరక్షించినవాడా! నీకు నమస్కారము. నమస్కారము. సత్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణములు కలిగిన ప్రకృతికి అతీతమైనవాడా! (త్రిగుణాతీత) ప్రకాశించేవాడా! మూడులోకములను మూడడుగులుగా కొలిచిన విష్ణుదేవుడా! (త్రివిక్రమ) ద్వారకా నగరానికి అధిపతీ! నీకు నమస్కారము. నమస్కారము.

3. వైకుంఠమను లోకానికి అధిపతీ! రుక్మిణీపతీ! సూర్య శక్తితో విశ్వకర్మ నిర్మించిన సుదర్శనమను చక్రమును ధరించినవాడా! (చక్రధర) ఇంద్రునిచే నమస్కరింపబడిన వాడా! నీకు నమస్కారము. నమస్కారము. సంపదను అనుగ్రహించువాడా! (శ్రీకర) మంచి గుణములు కలిగినవాడా! శ్రీవేంకటేశ్వరుడా! పుట్టయందు పుట్టిన వాల్మీకిచే పొగడబడినవాడా! నీకు నమస్కారము. నమస్కారము.

**విశేషాలు :**

గోవింద

గోవిందుడంటే కృష్ణుడు. ఉత్తర దేశంలో మధురానగరానికి దగ్గరలో గోవర్ధనగిరి ఇప్పటికీ ఉంది. ఇంద్రునికి కోపం వచ్చి రాళ్లతో కూడిన పెద్ద వర్షాన్ని కురిపిస్తే, కృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని ఎత్తి, దాని కింద గోసమూహాలకు ఆశ్రయం ఇచ్చాడు. ఇంద్రుడు కృష్ణుడి శక్తిని తెలుసుకొని, గోసమూహాలకు కృష్ణుడిని ప్రభువును

చేసాడు. అప్పటి నుంచి కృష్ణుడు గోవిందుడైనాడు.

నరనారాయణరూప

నరనారాయణులు విష్ణుని అంశతో పుట్టిన మహామునులు. ధర్మునకు దాక్షాయణియైన మూర్తివలన నరనారాయణులు జన్మించారని భాగవతము. వీళ్లు బదరీవనములో అనేక వేల సంవత్సరములు తపస్సు చేసారు. దేవతలకు సహాయముగ రాక్షసులతో అనేకసార్లు యుద్ధము చేసి వాళ్లను జయించారు.

ద్వారకానగరాధి నాయక

శ్రీకృష్ణుని రాజధాని ద్వారక. హస్తినాపురికిని దీనికిని డెబ్బది ఆమడల దూరము. అక్కడక్కడ అనేక ద్వారాలు ఉండి, ఆద్వారములలో తగిన కావలి ఉండుట వల్ల ద్వారక అనే పేరు వచ్చింది.



## *51. నారాయణతే నమో నమో (04-32)*

**నారాయణతే నమో నమో**
**నారద సన్నుత నమో నమో**

**1.మురహర భవహర ముకుంద మాధవ**
**గరుడ గమన పంకజనాభ**
**పరమ పురుష భవబంధ విమోచన**
**నరమృగ శరీర నమో నమో**

**2.జలధిశయన రవి చంద్ర విలోచన**
**జలరుహ భవనుత చరణ యుగ**
**బలిబంధన గోపవధూవల్లభ**
**నలినోదర తే నమో నమో**

**3.ఆది దేవ సకలాగమ పూజిత**
**యాదవకుల మోహనరూప**
**వేదోద్ధర శ్రీ వేంకట నాయక**
**నాదప్రియతే నమో నమో**

**భావం :**

నారాయణా! నారదుడు పొగిడిన వాడా! నీకు నమస్కారం.

1. మురుడనే రాక్షసుని చంపినవాడా! మోక్షం ఇచ్చేవాడా! లక్ష్మీదేవికి భర్తయైన వాడా (యదువు పెద్దకొడుకు మధువు. అతని వంశమున పుట్టినవాడు మాధవుడు) గరుత్మంతుని వాహనమెక్కిన వాడా! పద్మం నాభిలో కలవాడా! పురుషుల్లో ఉత్తముడా!

సంసారం బంధాలు విడిపించువాడా! నరసింహ స్వరూపుడా! నీకు నమస్కారం.

2. పాల సముద్రంలో పడుకొన్నవాడా! సూర్యచంద్రులు రెండు కళ్లయినవాడా! బ్రహ్మ, శివుడు పొగిడిన పాదాలున్న వాడా! బలిని బంధించినవాడా! గోపికాస్త్రీలకు ప్రభువా! నీకు నమస్కారం.

3. మొదటి దేవుడా! అన్ని వేదాలు పూజించే వాడా! యాదవ కులంలో అందమైన రూపం కలవాడా! వేదాలను ఉద్ధరించినవాడా! శ్రీ వేంకటేశ్వరుడా! నాదంలో ఇష్టమున్నవాడా! నీకు నమస్కారం.

నారాయణ శబ్దానికి రకరకాల అర్థాలున్నాయి. 1. నరసంబంధమైన శరీరం నారం. అవతారాలలో నర శరీరాన్ని పొందేవాడు నారాయణుడు. 2. నారమంటే నీళ్ళు. ఆది స్థానముగా కలవాడు నారాయణుడు. 3. నర సమూహం నివాసంగా కలవాడు నారాయణుడు. 4. ఎవడి వల్ల శబ్దాలు బయటకు వస్తున్నాయో అతడు రాయణుడు. రాయణుడు కానివాడు అరాయణుడు. అరాయణుడు కానివాడు నారాయణుడు. ఇలా ఎన్నో అర్థాలున్న పవిత్రమైన నారాయణ శబ్దముతో ప్రారంభించిన ఈ కీర్తనలో విష్ణుమూర్తిని రకరకాల పేర్లతో కవి కీర్తిస్తున్నాడు. దశావతారాల్లో కొన్నింటిని 1. నర మృగశరీరం (నరసింహ), 2. బలిబంధన (వామన), 3. గోప వధూ వల్లభ (కృష్ణ), 4. వేదోద్ధర (ఆదివరాహ) – మొదలైన సంబోధనలలో మనం గమనించవచ్చు.

ఈ కీర్తనలో అన్నమయ్య 'నమః' అనే శబ్దాన్ని చాలాసార్లు ప్రయోగించాడు. సుందరకాండలో హనుమంతుడు అశోకవనంలో సీతమ్మని వెతకానికి బయలుదేరుతున్న సందర్భంలో 'నమోస్తు రామాయ సలక్ష్మణాయ' (లక్ష్మణునితో ఉన్న రామచంద్రునికి నమస్కారం) అంటూ రాముడు మొదలైనవారిని కీర్తిస్తూ బయలుదేరుతాడు.

**మ: = నాది, న = కాదు; అని నమః శబ్దానికి అర్థం (శ్రీ భాష్యంవారు)**

ఏది చేస్తున్నా ముందుగా మనలోకి వచ్చే భావం 'నేను చేస్తున్నాను' అనే భావం. ఈ అహంకారాన్ని విడిచిపెట్టి, 'నేను భగవంతుని చేతిలో ఒక పరికరాన్ని' అనే భావంతో భక్తుడు ఉండాలి. హనుమంతుడు 'నమో' అన్న తర్వాత సీతమ్మ దర్శనం అశోక వనంలో జరిగింది. మనం కూడా నమో అని స్వామిని సర్వాత్మనా నమ్మితేనే ఈ లోకమనే శోకవనంలో స్వామి దర్శనం జరుగుతుందని, ఒకటికి నాలుగు సార్లు నమో అంటూ అన్నమయ్య ప్రబోధించాడు.

నారద సన్నుత (నారదుడు పొగిడినవాడా!) అని పేర్కొనుటలో ఒక విశేషముంది. నరుడి పాపాన్ని ఖండించేవాడు, నారము (జ్ఞానము) ఇచ్చేవాడు అని నారద శబ్దానికి అర్థాలున్నాయి. నారదుడు మన సినిమాల్లో చూపించేటంత తక్కువ వాడు కాదు. ప్రేమరూపమైన భక్తి సూత్రాలను లోకానికి అందించినవాడు. 'నాదతను మనిశం' అని త్యాగరాజ స్వామిచేత నాదో పాసన చేయించిన గురువు నారదుడు. అందుకే ఈ కీర్తన ప్రారంభంలో 'నారద సన్నుత' అంటూ చివరకు మళ్లీ 'నాదప్రియ' అన్నాడు అన్నమయ్య నాదం కలిగినది కీర్తన. అటువంటి ఆంధ్ర వేదాలయిన తన కీర్తనలను తలుస్తుంటే, చదువుతుంటే స్వామి అనుగ్రహానికి మనం తప్పనిసరిగా నోచుకొంటామని అన్నమయ్య ఆశీర్వాదం.

'జలధి శయన' సంబోధనలోని సముద్రం పౌరాణికంగా ప్రసిద్ధమైన పాలకడలి. విష్ణుమూర్తి దీనిలో ఆది శేషునిపై పడుకొంటాడని ప్రసిద్ధి. నాలుగు సముద్రాలు, ఏడు సముద్రాలు–ఇలా సముద్రాల సంఖ్య మీద భిన్నాభిప్రాయాలున్నాయి. సంప్రదాయ విశ్వాసాలు అనుసరించి సాగరమనేది ఒక్కటే. నాలుగు దిక్కులా ఉన్నాయి కాబట్టి నాలుగు సముద్రాలు అన్నారు. అవి ఉన్న ద్వీప ప్రాంతాల్లో కనిపించే రంగులను బట్టి పాల సముద్రం, తేనె సముద్రం మొదలైన గుర్తులుగా పిలిచారని పెద్దలు చెబుతారు.

మామూలుగా 'పురుషుడు' అని లోకంలో వాడే శబ్దానికి అన్నమయ్య ఈ కీర్తనలో ప్రయోగించిన పరమ పురుష శబ్దానికి కొంచెం తేడా ఉంది. మగవాడిని పురుషుడంటుంటాం కదా! పుట్టిన జీవులలోకెల్లా గొప్పవాడు' అని లోకంలో ఉపయోగించే పురుష శబ్దానికి అర్థం. పురమంటే శరీరం. అందులో ఉండే ఆత్మని పురుషుడంటారు. ఈ పరమాత్మే పరమ పురుషుడు.

అన్నమయ్య కీర్తనకు పోలికగా 'నారాయణతే నమో నమో' అనే పురందరదాసు కీర్తన లోకములో ప్రసిద్ధి పొందింది. భవహర – నగధర; భవబంధ – భవభంజన – ఇటువంటి ఒకటి రెండు పదాలు తప్పించి రెండు కీర్తనలు ఒకేలా ఉండటం గమనార్హం.

మగవాళ్ళు కూడా శ్రీరామచంద్రమూర్తిని చూసి మోహపడ్డారనే వాల్మీకి మాటని (పుంసాం మోహనరూపాయ) అందిపుచ్చుకొని 'మోహనరూపు'దని అన్నమయ్య ఈ కీర్తనలో స్వామిని పొగిడాడు.

ఒళ్ళు మరచిపోవటం మోహం. వేంకటేశ్వరస్వామివారి దివ్యమంగళ విగ్రహాన్ని తదేకంగా అలానే చూడాలనిపిస్తుంది. స్వామిని చూస్తూ మనల్నిమనం మరచిపోతాం. అన్నమయ్య మాటలు ప్రత్యక్షర సత్యాలు.



## *52. నాలంవా తవ నయ వచనం*

ప్రియుడికి నాలుగు వడ్డించే స్వభావమున్న ఖండిత అనే శృంగార నాయికగా మారి అన్నమయ్య – స్వామి వారితో సరసాలాడుకొన్న సంస్కృత కీర్తన ఇది. (సంపుటము 06–157 కీర్తన)

**నాలం వా తవ నయవచనం**
**చేలం త్యజ తే చేటీ భవామి**

**1.చల చల మమ సంసద్ఘటనే కిం**
**కులిశ హృదయ బహుగుణ విభవ**
**పులకిత తను సంభృత వేదనయా**
**మలినం వహామి మదం త్యజామి**

**2.భజ భజ తే ప్రియ భామాం సతతం**
**సుజనస్త్వం నిజ సుఖనిలయ**
**భుజరేఖా రతి భోగ భవసి కిం**
**విజయీభవ మద్విధిం వదామి**

**3.నయ నయ మామను నయనవిధంతే**
**ప్రియ కాంతాయాం ప్రేమభవం**
**భయహర వేంకటపతే త్వం**
**మత్ప్రియో భవసి శోభితా భవామి ॥ నాలం ॥**

**తాత్పర్యము :**

నీ ప్రియమైన మాటలు (తవ నయవచనం) చాలవా? (నాలం వా) కొంగు నీవు విడువుము. (చేలం త్యజ) నీ దాసిని అయి ఉన్నాను (తే చేటీ భవామి).

(నాయకుడు నిజంగా ప్రియమైన మాటలు మాట్లాడలేదు. ఎక్కడో వేరొక నాయిక దగ్గర గడిపి, ఇప్పుడు అమ్మడిని ప్రియంగా బుజ్జగించాలని చూస్తున్నాడు. కొంగు పట్టుకొని ప్రసన్నం చేసుకోవాలనుకొంటున్నాడు. అమ్మడు గ్రహించింది. అందుకే మాటల వడ్డింపు మొదలు పెట్టింది. "నీవి ప్రియమైన మాటలు కావు. ఇక కట్టి పెట్టు. అయినా నాకు విలువేముందిలే! రాత్రంతా నువ్వు గడిపి వచ్చిన ఇంట్లో ఉన్నది నీకు రాణి. నేను మాత్రం నీకు దాసిని. నన్ను దాసిని చేసావు." అని తిట్టదలుచుకొన్నది. కాని నీ ప్రియమైన మాటలు చాలవా? ఇంకా ఈ జీవితానికి

ఇంకేమి కావాలి? నేను నీకు దాసిని అని పైకి తిట్టకుండా ఎత్తిపొడుస్తోంది.

1.కదులు కదులు! నా సాన్నిధ్యంలో ఏముంది? (నీసుఖం వేరొక చోట ఉన్నదని ఎత్తిపొడుపు). కఠినమైన వజ్రాయుధమువంటి హృదయము కలవాడా! అనేక గుణముల వైభవము కలిగినవాడా! (నా మీద దయలేని నీ హృదయము కఠినము. గుణములు లేనివాడవని వ్యంగ్యం). పులకించబడిన శరీరముతో చక్కగా భరింపబడిన వేదన చేత మలినాన్ని మోస్తున్నాను. గర్వాన్ని విడిచి పెడుతున్నాను (నువ్వు రావటముతో శరీరము పులకించింది కాని.. నువ్వు వేరొక నాయికతో గడిపావనే ఆలోచనతో బాధ అనే మలినము బరువయింది. ఇన్నాళ్లు నువ్వు నాకే సొంతమనే గర్వాన్ని విడిచిపెడుతున్నాను అని భావం).

2. నీ ప్రియ భామలను ఎప్పుడూ సేవిస్తుండు. ( నాతో పనేముంది?). అద్భుతమైన ఆత్మ సుఖానికి నువ్వు నిలయము. ఎంతో మంచివాడివి. (నీ సుఖము కోసం ఏమైనా చేస్తావు. స్వార్థము ఎక్కువ. నీకు మంచితనము ఎక్కడుంది? అని ఎత్తి పొడుపు.) భుజ ముద్రలతో ప్రకాశించే రతి భోగము కలవాడివిగా అయ్యావేమిటి?! ఏమి భోగమయ్యా నీది?!! (వేరొక నాయిక స్వామి వారి భుజాల మీద చేసిన గిచ్చుళ్ల ముద్రలను చూసి ఎత్తిపొడుపు). తిరుగుళ్లలో నీకు విజయము చేకూరు గాక! ఏదో ఊరుకోలేక – నీ ముందు నా భాగ్యాన్ని చెప్పుకుంటున్నాను. (నేను అభాగ్యురాలిని. నన్ను ఇలా నువ్వు తయారు చేసావని ఆక్రోశము).

3. ఓదార్పులు చెప్పటంలో ఘనుడివి కదా! ఇంకా ఓదార్పులు మొదలుపెట్టు. నన్ను ఓదార్పుల దారుల వెంట తీసుకొని పో! నీ ప్రియకాంతకు ఈ ఓదార్పు పద్ధతి చాలా ప్రేమను కలిగిస్తుంది (నాకు కాదు!అని ఎత్తిపొడుపు). భయాల్ని తొలగించేవాడా! ఓ వేంకటపతీ! నీవు నాకు ప్రియమైన వాడివి అవుతున్నావు. నీ వల్ల –నీచేతల వల్ల – నేను ఎంత సంతోషంతో శోభిస్తున్నానో! (వేరొక కాంతతో గడిపి చాలా బాధపెట్టావు అని ఎత్తి పొడుపు).

**విశేషాలు :**

ఆడినా, పాడినా, కొట్టినా, తిట్టినా – అన్నీ అన్నమయ్యకు వేంకటేశ్వర స్వామివారితోనే. ఆ భావ తాదాత్మ్యంలో వచ్చిన సంస్కృత కీర్తన ఇది. భక్తి అనే నేలపై మొలచిన శృంగార వృక్షము – ఈ కీర్తన. ఈ వృక్షములో ప్రతి పదమనే పండు నేలతో అనుబంధాన్ని గుర్తు చేస్తుంటుంది.



## *53. నిత్యానంద ధరణీధర*

శ్రీ వేంకటేశుని గుణగణములను ప్రస్తుతిస్తూ అన్నమయ్య పాడుకొన్న సంస్కృత కీర్తన ఇది. (01-25 కీర్తన)

**నిత్యానంద ధరణీధర ధరారమణ ।**
**కాత్యాయనీస్తోత్ర కామ కమలాక్ష ॥**

**1.అరవిందనాభ జగదాధార భవదూర ।**
**పురుషోత్తమ నమో భువనేశ ।**
**కరుణాసమగ్ర రాక్షసలోక సంహార- ।**
**కరణ! కమలాధీశ కరిరాజవరద ॥**

**2.భోగీంద్రశయన పరిపూర్ణ పూర్ణానంద ।**
**సాగరనిజావాస సకలాధిప ।**
**నాగారిగమన నానావర్ణనిజదేహ ।**
**భాగీరథీజనక పరమ పరమాత్మ ॥**

**3.పావన పరాత్పర శుభప్రద పరాతీత ।**
**కైవల్యకాంత శృంగారరమణ ।**
**శ్రీవేంకటేశ దాక్షిణ్యగుణనిధి నమో ।**
**దేవతారాధ్య సుస్థిరకృపాభరణ ॥**

**తాత్పర్యము :**

ఎప్పుడూ ఆనందముగా ఉండు వాడా! భూదేవిని ధరించినవాడా! భూదేవికి ఇష్టమైన వాడా! పార్వతీదేవిచే పొగడబడిన వాడా! కోరదగినవాడా! పద్మములవంటి కన్నులు కలవాడా!

1. పద్మము నాభియందు కలవాడా! ప్రపంచానికి ఆధారమైనవాడా! సంసార దుఃఖమును దూరము చేసేవాడా! అందరిలోనూ ఉత్తముడా! భువనములను పాలించువాడా! నీకు నమస్సులు. సమస్తమైన దయకు ఒక రూపముగా నిలిచినవాడా! రాక్షసలోకాన్ని సంహరించేవాడా! లక్ష్మీదేవికి ప్రభువా! గజేంద్రునికి వరములిచ్చినవాడా!

2.ఆదిశేషుని శయనముగా కలిగినవాడా! పరిపూర్ణుడా! పూర్ణమైన ఆనందము కలిగినవాడా! సముద్రము నిలయముగా కలిగినవాడా! సమస్త సృష్టికి అధిపతీ! గరుత్మంతుని వాహనముగా కలిగినవాడా! అనేక రంగులతో ఒప్పారు శరీరము కలవాడా! గంగాదేవికి తండ్రీ! మోక్షమునకు ఒక రూపమైనవాడా! శ్రేష్ఠమయిన ఆత్మ స్వరూపుడా!

3. పవిత్రమైనవాడా! పరాత్పరుడా! శుభ స్వరూపీ! మోక్షాతీతుడా! మోక్ష కాంత

శృంగార సీమలో మనోహరుడా! శ్రీ వేంకటేశుడా! దయకు నిధివంటివాడా! నమస్సులు. దేవతలకు పూజనీయుడా! స్థిరముగా ఉండే దయ ఆభరణముగా కలిగినవాడా!

**విశేషాలు :**

నిత్యానంద

అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము – అని కోశములైదు. కత్తి ఒరలో ఉన్నట్లు, ఆత్మ కోశములనే (ఒరలు) గుహల్లో ఉంటుంది. ఈ కోశాలు ఒకదానిలో ఒకటి ఉంటాయి. వీటిలోపల ఆత్మ ఉంటుంది. అన్నమయ కోశం (స్థూల దేహం) ప్రాణమయ కోశము, మనోమయ కోశము, విజ్ఞానమయ కోశము, ఆనందమయ కోశము ఒకదానిలో ఒకటి ఉంటాయి. ఆత్మ ఏమిటని విచారము చేసేటప్పుడూ అన్నమయ కోశంనుంచి మొదలుపెడతారు. చివరికి ఆనందమయకోశము కూడా ఆత్మకాదని నిశ్చయిస్తారు. చివరికి సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థం (భూమ) ఆనంద స్వరూపమని నిశ్చయానికి వచారు. ఈ ఆనంద స్వరూపాన్నే అన్నమయ్య నిత్యానంద అన్నాడు. "ఏతీరుగ నను దయజూచెదవో యినవంశోత్తమరామా – నాతరమా భవసాగరమీదను నళినదళేక్షణరామా" అను కీర్తనలో రామదాసు. "నిండితి నీవఖిలాండకోటి బ్రహ్మాండములందున రామా – నిండుగ మది నీనామము దలచిన నిత్యానందము రామా" అన్నారు. 'లేకనా నిన్ను జుట్టుకొన్నారు?ఏకహృదయులై నిత్యానందము' అని త్యాగరాజ స్వామి పొంగిపోయారు.

కాత్యాయనీ

పార్వతీదేవి, కత్యుఁడను ఋషికూఁతురివలె నుండునది; సగము వయస్సు చెల్లి కావిచీర కట్టిన విధవ. సంస్కృత–తెలుగు నిఘంటువు (వావిళ్ల) 1943.



## *54. పరమపురుష నిరుపమాన*

పల్లవి ఒక పాదముగా, చరణములు రెండేసి పాదములుగా అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది. (02–367)

**పరమపురుష నిరుపమాన శరణు శరణురే –**
**యే యే యేయే ఇందిరా నిజమందిరా ॥**

**1.కమలనాభ కమలనయన కమలచరణురే**
**అమితసురమునినాథయూథప నాయకా వరదాయకా**

**2.చతురమూరితి చతురబాహుశంఖచక్రధరా**
**అతిశయ శ్రీవేంకటాధిప అంజనాకృతిరంజనా**

**తాత్పర్యము :**

ఓ పరమాత్మా! మోక్షాన్ని అనుగ్రహించువాడా! పోలికలేనివాడా! ఓ లక్ష్మికి నిలయమైన వాడా! నీకు శరణము. శరణము. (నాలుగు యేకారములు శరణు రే లోని ఏకారమునకు అనుబంధ స్వర ప్రతీకములని పరిష్కర్తలు చెప్పారు.)

1.పద్మము నాభియందు గలవాడా! పద్మములవంటి కన్నులు కలిగినవాడా! పద్మములవంటి పాదములు కలవాడా! గొప్పదేవతలు, మునిశ్రేష్ఠుల సమూహములకు నాయకుడా! వరములను అనుగ్రహించువాడా!

2.నేర్పు కలిగినవాడా! చక్కని చేతులతో శంఖములను, చక్రములను ధరించినవాడా! ఉన్నతమైన వేంకట పర్వతానికి నాయకుడా! అంజనాదేవి కుమారుడైన హనుమంతునికి ఆనందమును కలిగించువాడా!

**విశేషాలు :**

అంజనాకృతి

"హను శబ్దో జ్ఞానవాచి" అని ఒక నిఘంటువు. దీని ప్రకారం హను అంటే జ్ఞానమని అర్థం. జ్ఞానమున్నవాడు కనుక "హనుమాన్' అని పిలిచారు శాస్త్రకారులు. భవిష్యోత్తర పురాణంలో "అంజనాచల" ప్రసక్తి ఇలా ఉంది. కృతయుగంలో "వృషభాచలం" అని, త్రేతాయుగంలో "అంజనాచలం" అని, ద్వాపరంలో "శేషాచలం" అని, కలియుగంలో "వేంకటాచలం" అని వేంకటగిరికి పేరు. కేసరి అను వానరుని భార్య అంజనాదేవి త్రేతాయుగంలో నారాయణగిరి ఉత్తరదిక్కున ఉన్న ఆకాశగంగ తీర్థంలో పన్నెండు సంవత్సరాలు తపస్సు చేసింది. ఆవిడ తపస్సుకు సంతోషించిన వాయుదేవుడు ప్రతిరోజూ ఆవిడ ముందున్న చెట్టు పై నుంచి రాల్చే పండు తిని అంజనాదేవి తపస్సు చేసేది. పదినెలల తరువాత అంజనాదేవి హనుమంతునికి జన్మ ఇచ్చింది. ఆ ఆంజనేయుడు అంజనాదేవి తపస్సు యొక్క ఆకృతి. రూపము. అందుకే అన్నమయ్య అంజనాకృతి అని హనుమంతుని

ఈ కీర్తనలో విశేషించాడు.



## *55. పరమ పురుష హరి పరాత్పర*

మొదలు పెట్టిన పదాన్ని ఆ చరణము / పల్లవిలో ఎన్నోసార్లు ప్రయోగిస్తూ అన్నమయ్య భక్తితో పాడుకొన్న సంస్కృత కీర్తన ఇది. (02-453 కీర్తన)

**పరమ పురుష! హరి! పరమ! పరాత్పర ।**
**పరరిపు భంజన! పరిపూర్ణ !నమో ॥**

**1.కమలాపతి! కమల నాభ! కమలాసన వంద్య**
**కమల హితానంతకోటి ఘన సముదయ తేజా**
**కమలామల పత్రనేత్ర కమలవైరి వర్ణగాత్ర ।**
**కమలషట్క యోగీశ్వర హృదయతేహం నమో నమో ॥**

**2.జలనిధి మథన! జలనిధి బంధన! జలధి మధ్య శయనా**
**జలధి యంతర విహార మత్స్యకచ్ఛప యవతారా**
**జలనిధి జామాత జలనిధి శోషణ జలనిధి సప్తకగమన**
**జలనిధి కారుణ్య నమో తేహం జలనిధి గంభీర నమో నమో**

**3.నగధర నగరిపు నందితనగచర యూథపనాథా**
**నగ పారిజాత హరసారస పన్నగ పతిరాజ శయనా ।**
**నగకుల విజయ శ్రీ వేంకట నగ నాయక భక్త విధేయా**
**నగధీరాఅహంతే సర్వేశ్వర నారాయణ నమో నమో**

**తాత్పర్యము :**

ఓ పురుషోత్తముడా! హరీ! మోక్షమును అనుగ్రహించువాడా! శ్రేష్ఠులకందరికి శ్రేష్ఠుడా! గొప్పవారయిన శత్రువులను సంహరించువాడా! నిండు రూపము కలవాడా! నీకు నమస్సులు.

1. ఓ లక్ష్మీపతీ! ఓ పద్మ నాభుడా! ఓ పద్మము ఆసనముగా కలిగిన బ్రహ్మచే నమస్కరింపబడినవాడా! అనంత కోటి జీవ హృదయ కమలాలను వికసింపచేయు కాంతి కలవాడా! స్వచ్ఛమైన పద్మపు రేకులవంటి కన్నులు కలవాడా! చంద్రునివంటి కాంతి కలిగిన శరీరము కలవాడా! కమలములవంటి ఆరు చక్రములు కలిగిన యోగ విద్య నిండిన హృదయము కలవాడా! నీకు నమస్సులు.. నమస్సులు.

2. అమృతము కొరకు కూర్మావతారంలో సముద్రాన్ని మథించినవాడా! రామావతారంలో వంతెన కట్టి సేతువును బంధించినవాడా! క్షీర సముద్రము మధ్యలో శయనించువాడా! మత్స్యావతారములో సముద్రము మధ్యలో విహరించువాడా! మత్స్య, కూర్మావతారములు ధరించినవాడా! సముద్రుని కుమార్తె లక్ష్మిని వివాహము చేసుకొని సముద్రునికి అల్లుడైన వాడా! సంసారమను సముద్రమును ఎండించువాడా! (సంసారమునుండి ఉద్ధరించువాడని భావము). ఏడు సముద్రాలలో (1. లవణసముద్రము, 2. ఇక్షుసముద్రము, 3. సురాసముద్రము, 4. సర్పిస్సముద్రము, 5. దధిసముద్రము, 6. క్షీరసముద్రము, 7. జలసముద్రము.) విహరించువాడా! సముద్రమును పోలిన దయ కలిగినవాడా! నీకు నా నమస్కారమిదే! సముద్రము వంటి లోతైన హృదయము కలవాడా! నీకు నమస్సులు. నమస్సులు.

3. గోవర్ధన పర్వతమును ఎత్తిన వాడా! కొండల శత్రువైన ఇంద్రునితో నమస్కారము పొందిన వాడా! గజేంద్రుని రక్షించి అతనికి ప్రభువైన వాడా! స్వర్గంలో కొండయందున్న పారిజాతమును కృష్ణావతారంలో హరించినవాడా! ఆనంద రస స్వరూపుడా! ఆదిశేషునిపై శయనించువాడా! కొండలకు ప్రభువైనవాడా! శ్రీవేంకటాచల నాయకుడా! భక్తులకు విధేయుడా! పర్వతమువంటి ధైర్యము కలవాడా! ఓ సర్వేశ్వరుడా! ఓ నారాయణుడా! నేను నీకుపదే పదే నమస్కరిస్తున్నాను. నమస్కరిస్తున్నాను.

**విశేషాలు :**

ఈ పాటకు పాఠ పరిష్కారము చేస్తూ పరిష్కర్తలు ఇలా అన్నారు.

1. 'కమలషఙ్కయోగీశ్వర హృదయం నమో నమో తేహిం నమో నమో.' అని రేకు. తర్వాతి చరణములను చూచి పూర్వపరిష్కర్తలు పై విధముగ సవరించిరేమో. 'కమలషట్క.... హృదయ' అని వుండవచ్చునేమో. 'హృదయం' పాఠములో అర్థము అంత సంగతము కాదు. 2. జలధియంతర.... .... తారా = జలధిలో సంచరించు చేప, తాబేటి యవతారములవాడా? అని అర్థము కావచ్చు. ఈ పాటలో కొన్ని సంధులు కొన్ని పదముల అర్థములు సుగమములు సాధువులు కావు.

స్వామి దయతో చేతనయినంతవరకు అర్థములిచ్చాను.



## *56. పరిపూర్ణ గరుడాద్రి*

అహోబిల నరసింహుని వేంకటేశునిగా కొలుస్తూ, అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది. (సంపుటము 01-428)

**పరిపూర్ణ గరుడాద్రి పంచాననం**
**పరమం సేవే పంచాననం**

**1.క్రూరదంష్ట్రాగ్నికణఘోరపంచాననం ।**
**పారీణచక్రధర పంచాననం ।**
**వీరపంచాననం విజయపంచాననం ।**
**భారభూభారహరపంచాననం ॥**

**2.దివిజ పంచాననంతీవ్ర నఖ కాననం**
**భవనాశినీతీర పంచాననం**
**కువలయాకాశ సంఘోష పంచాననం**
**పవి శబ్ద దంతరవ పంచాననం**

**3.శ్రీ వేంకటాఖ్య ఘన శిఖరి పంచాననం**
**పావనం పంచ ముఖ పంచాననం**
**సేవిత ప్రహ్లాద సిద్ధి పంచాననం**
**భావితం శ్రీ యుక్త పంచాననం**

**తాత్పర్యము :**

పరిపూర్ణమైన గరుడ పర్వతములో ఉన్న సింహము వంటి (పంచాననము = విశాలమగు ముఖము గలది.) వేంకటేశుని, పరమాత్మని సేవింతును.

1. క్రూరమైన పండ్ల వెంట కురియు అగ్ని కణములతో భయంకరముగా ఉన్న సింహము వంటి వేంకటేశుని, పాదము ముట్టిన, మిక్కిలి నేర్పు కలిగిన(= పారీణ) చక్రమును ధరించిన సింహము వంటి వేంకటేశుని, వీర సింహాన్ని, విజయమే తన స్వభావముగా కలిగిన సింహము వంటి వేంకటేశుని, భూమికి భారమైన దుష్టులను హరించు సింహము వంటి వేంకటేశుని సేవింతును.

2. దేవతలకు సింహము వంటి వేంకటేశుని, వాడియైన గోళ్ల కొనలు కలిగినవానిని భవనాశినీ తీరములో ఉన్న సింహము వంటి వేంకటేశుని సేవింతును. భూమిలోను, ఆకాశంలోను నిండిపోయిన సింహనాదము కలిగిన సింహము వంటి వేంకటేశుని పిడుగులతో పోల్చదగిన శబ్దములు చేయుచూ, పళ్లు పటపట కొరుకుతున్న సింహము వంటి వేంకటేశుని సేవింతును.

3. శ్రీవేంకటమను పేరు కలిగిన పెద్దకొండమీద ఉన్న సింహమువంటి వేంకటేశుని

లోకాన్ని పవిత్రము చేయువానిని, అయిదు ముఖాలు కలిగిన నరసింహ స్వరూపమైన వేంకటేశుని తనను సేవించిన ప్రహ్లాదునకు సిద్ధి ఇచ్చిన సింహము వంటి వేంకటేశుని భక్తులచే భావించబడేవానిని, లక్ష్మీదేవితో కలిసి ఉన్నవానిని అహోబిల నరసింహ స్వరూపమైన సింహము వంటి వేంకటేశుని సేవింతును.

**ముఖ్య విశేషాలు**

భవనాశినీతీర పంచాననం

అహోబిల క్షేత్రంలో ఉన్న భవనాశిని అను కోనేరు ఇది. సంసార పరమైన కష్టాలను నాశనం చేసే తీర్థం కావడం వలన దీనికి 'భవనాశిని' అనే పేరు వచ్చింది.

గరుడాద్రి

ఏడుకొండలలో ఒకటి గరుడాద్రి. (శేషాద్రి, నీలాద్రి, గరుడాద్రి, అంజనాద్రి, వృషభాద్రి, నారాయణాద్రి, వేంకటాద్రి). కద్రువ పుత్రులు నాగులను చంపిన గరుత్మంతుడు పాపము పోగొట్టుకోవటం కోసం విష్ణువును గూర్చి తపస్సు చేశాడు. తిరిగి వైకుంఠం చేరే వరమివ్వమని విష్ణువుని ప్రార్థించాడు. విష్ణువు ఏడుకొండల మీద అవతరిస్తున్నానని చెప్పి గరుత్మంతుడిని పర్వత రూపంలో అక్కడే ఉండమని చెప్పారు. ఇదే గరుడాద్రి. మహాభాగవతుడైన ప్రహ్లాదుడు ఉగ్రమూర్తిగా దర్శనమిచ్చిన స్వామికి అంజలి ఘటించి సాష్టాంగ ప్రమాణం చేశాడు. శ్రీనారసింహస్వామి తన అభయ మంగళ దివ్య హస్తాన్ని ప్రహ్లాదుని తలపైనుంచి దీవించాడు. ప్రహ్లాదుడు పరవశించి పలువిధాల స్తుతించాడు. ప్రసన్నుడైన స్వామి ఏమయినా వరాన్ని కోరుకొమ్మన్నాడు.

"స్వామీ! నా తండ్రి చేసిన భాగవతాపరాధాన్ని మన్నించు" అని కోరాడు ప్రహ్లాదుడు. "నాయనా. నిన్ను కొడుకుగా పొందినపుడే నీ తండ్రితో 21 తరాలు (తల్లివైపు 7 తరాలు, తండ్రివైపు 7 తరాలు, ప్రహ్లాదుని తరువాతి 7 తరాలు) పావనమైనాయి. నా స్పర్శతో నీ తండ్రి పునీతుడైనాడు. నీ తండ్రికి ఉత్తర క్రియలు చేసి రాజువుకా. నా యందు మనసు నిలిపి, విజ్ఞుల ఉపదేశాన్ని పొందుతూ పాలన చేయి" అని ఆశీర్వదించాడు స్వామి.



## *57. ప్రలపనవచనైః ఫలమిహాకిం*

నాయకుడు రాత్రి మరియొకదాని యింటికిపోయి యా చిహ్నములతో రాగా చూచి కోపమునొందిన నాయికను ఖండితా నాయిక అంటారు. అన్నమయ్య ఆటువంటి ఖండితా నాయికగా మారి స్వామివారిని మధుర భక్తితో ఈ సంస్కృత కీర్తనలో అధిక్షేపిస్తున్నాడు. (05-39 కీర్తన)

**ప్రలపనవచనైః ఫలమిహాకిం ।**
**చల చల కుడ్య క్షాళనయాకిం ॥**

**1.ఇతర వధూమోహితం త్వాంప్రతి ।**
**హితవచనై రిహ ఫలమిహ కిం ।**
**సతతం తవానుసరణ మిదం మమ ।**
**గతజల సేతుకరణ మిదానీం ॥**

**2.వికల వినయ దుర్విటం త్వాం ప్రతి ।**
**సుకుమారార్ద్ర స్తుత్యాకిం ।**
**ప్రకట బహల కోపనం మమతే ।**
**సకలం చర్విత చర్వణమేవ ॥**

**3.శిరసా నతసుస్థిరం త్వాంప్రతి ।**
**విరసాలాపన విధినాకిం ।**
**తిరువేంకటగిరి దేవత్వదీయ ।**
**విరహ విలసనం వృథా చరణం ॥**

**తాత్పర్యము :**

అర్థములేని, అక్కరలేని మాటలతో ఇక్కడ ఇంకా ప్రయోజనమేముంది? గోడని శుభ్రం చేయటం వల్ల ప్రయోజనమేముంది? నడు. నడు. (నువ్వెంత మెత్తమెత్తని మాటలు చెప్పినా నేను లొంగను. నేను రాతి గోడలాంటి దానను.) ఇంకొక స్త్రీయందు మోహము ఉన్న నీతో మంచి మాటలు చెప్పటం వల్ల ఇక్కడ ప్రయోజనమేముంది? (నా మంచి మాటలు నీ తలకెక్కవు)

1. ఎప్పుడూ నిన్ను అనుసరించే ఈ నా ప్రయత్నము ఇప్పుడు నీరు పోయినపిదప కట్ట వేసినట్లు వ్యర్థప్రయత్నము అయింది. (నువ్వు చాలా మంచివాడవని నమ్మి నిన్ను అనుసరించాలని చూసాను. కాని అది వ్యర్థమని నాకు తెలిసింది)

2. కపట వినయాలు కలిగిన దుష్ట వేశ్యాలోలుడవయిన నీకు మెత్తగా బతిమిలాడింపులతో కూడిన పొగడ్తలతో పనేముంది? అందరికీ తెలిసేటట్లు ఎక్కువగా కోపించిన నావల్ల నీకు ఉపయోగమేముంది? అంతా నమలినదానిని తిరిగి నమలుట. (నెమరువేయుట, చెప్పిన దానినే మరల చెప్పుట.)

3. తలవంచి ఎంత కాలము నమస్కరించినా నీ విసుగుకొలిపే మాటలతో (రసములేని మాటలతో) ప్రయోజనమేముంది? (నాకు నమస్కరించి మచ్చిక చేసుకోవాలని చూస్తున్నావు. కాని నాకు తెలుసు. నీ మనస్సులో నా మీద ప్రేమ లేదు. ఈ విసుగుగొలిపే నయగారపు మాటలెందుకు?) వేంకటాద్రి పర్వతములో ఉండే దేవా! నీకు సంబంధించిన విరహముతో ఉండుట వృథా ప్రయత్నము.

**విశేషము :**

అన్నమయ్య మధుర భక్తి ఆంతర్యాన్ని అర్థం చేసుకోవటానికి మనం ప్రయత్నం చేయాలి. సాధారణంగా తామర తుమ్మెదల మధ్య ఉన్న బంధాన్ని ప్రేయసీ ప్రియులుగా వర్ణిస్తుంటారు. కాని పొంచి తామరపువ్వుల బోలిన పాదాలాతడు / వంచి తుమ్మెదల కొప్పు వడిసోక మొక్కవే" అను ఒక చరణంలో అన్నమయ్య వేంకటేశుని పాదాలను తామరలతో పోల్చాడు. ఆ పాదాలకు నమస్కరించినప్పుడు ఆ పాదాలను తాకే నాయిక కురులను తుమ్మెదలతో పోల్చాడు. వేంకటేశుని పాదాలను ఆశ్రయించమని శృంగారపు పోలికలను, భక్తి పోలికలుగా మార్చి చెప్పిన అన్నమయ్య – ఈ కీర్తనలో ఖండితా నాయికా రూపంలో స్వామిని అధిక్షేపిస్తున్నాడు. పదాల రూపం మారుతుంది. కాని పదాల లోపల మ్రోగే భక్తి గంటల సవ్వడి ఒక్కటే.



## *58. పృథుల హేమ కౌపీన ధరః*

వామనావతారాన్ని పొగుడుతూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది. (సంపుటము 04 – 72 అనుబంధ కీర్తన)

**పృథుల హేమ కౌపీన ధరః ।**
**ప్రథిత వటుర్మేబలం పాతు ॥**

**1.సూపా సక్తః శుచిస్సులభః ।**
**కోప విదూరః కులాధికః ।**
**పాప భంజనః పరాత్ప రోయం ।**
**గోపాలో మే గుణం పాతు ॥**

**2.తరుణః ఛత్రీ దండ కమండలు ।**
**ధరః పవిత్రీ దయాపరః ।**
**సురాణాం సంస్తుతి మనోహరః ।**
**స్థిరస్సుధీర్మే ధృతిం పాతు ॥**

**3.త్రివిక్రమః శ్రీ తిరువేంకటగిరి ।**
**నివాసోయం నిరంతరం ।**
**ప్రవిమల మస్నృణ కబళ ప్రియోమే ।**
**దివా నిశాయాం ధియం పాతు ॥**

**తాత్పర్యము :**

విశాలమైన, గొప్పదైన బంగారు కాంతులు వెదజల్లే గోచీని ధరించిన ప్రసిద్ధుడైన బ్రహ్మచారి నా బలాన్ని రక్షించుగాక.

1. పప్పు అన్నము అంటే ఇష్టము కలవాడు, పవిత్రుడు, భక్తులకు సులభుడు, కోపములేనివాడు, కులము చేత అధికుడుపాపమును నశింపచేయువాడు, శ్రేష్ఠులందరికి శ్రేష్ఠుడు (= పరాత్పరుడు) అయిన ఆ వామనావతారి అయిన గోపాలుడు నా గుణము కాపాడుగాక.!

2. చిన్నవయస్సు కలవాడు, గొడుగును ధరించినవాడు, దుడ్డుకఱ్ఱ, సంన్యాసు లుంచుకొను మట్టిపాత్ర కలవాడు. దర్భలు ధరించినవాడు, (= పవిత్రీ), కనికరము గలవాడు. దేవతల యొక్క పొగడ్తలతో మనస్సును ఆకర్షించువాడు, దృఢమైన మనస్తత్వము కలవాడు, పండితుడు అయిన వామనుడు నాధైర్యము, సంతోషము, సౌఖ్యమును కాపాడుగాక!

3. మూడులోకములను మూడడుగులుగా కొలచిన విష్ణువు. పవిత్రమైన వేంకట పర్వతముపై నివాసముండేవాడు అయిన ఇతడు ఎప్పుడు నిర్మలమైన, మృదువైన అన్నపు ముద్దకు ఇష్ట పడేవాడు. అటువంటి వామనుడు రాత్రి పగలు నా బుద్ధిని కాపాడుగాక!

**విశేషాలు :**

పృథుల హేమ కౌపీన ధరః

ముంజిత్రాడు (= ముంజ అను పేరు గల దర్భకు సంబంధించిన మొలతాడు) లోనగువాని ధరించి వేదము చదివి బ్రహ్మచర్యవ్రతమునం దుండువాడిని బ్రహ్మచారి అంటారు. పూర్వం బ్రహ్మచారి లక్షణాలలో ఒక లక్షణం గోచీని ధరించటం. అదే అన్నమయ్య ఈ కీర్తనలో పేర్కొన్నాడు. సొంపుతో గోణము (= గోచీ) కట్టిన వేంకటేశుని శుక్రవారపు అభిషేకాలలో దర్శించిన కవి, ఈ గేయంలో తాదాత్మ్యముతో వామనుని కౌపీన ధారిగా సందర్శించి పల్లవి మొదలుపెట్టాడు.

బ్రహ్మచారికి, గోచీకి ఉన్న సంబంధం గురించి మన పూర్వీకులు తమషాగా ఒక సామెత కథ చెప్పారు. ఒక బ్రహ్మచారి చదువైపోయిన తర్వాత ఒక చోట గుడిసె వేసుకున్నాడు. అతనికి రెండు గోచీలే ఉన్నాయట. ఒకటి కట్టుకొని, ఒకటి ఉతుక్కునే వాడట. ఈ ఆరేసిన గోచీని ఒక ఎలుక కొట్టెయ్యడంతో గోచీని

కాపాడుకోలేకపోయాడు. ఎలుకనుంచి గోచీని కాపాడుకోవడానికి, ఒక పిల్లిని పెంచాడు. పిల్లికి పాల కోసం ఒక ఆవును కొన్నాడు. ఆవును చూసుకోడానికి ఒక మనిషిని పెట్టేడు, ఆ మనిషే గోవును మేపి, పాలు తీసిఇస్తున్నాడు. క్రమంగా బ్రహ్మచారి అవసరాల కోసం పెళ్ళి చేసుకున్నాడు. పెళ్లయిన తర్వాత కుటుంబంలో వస్త్రాడంబరము (పటాటోపము) పెరిగింది. అప్పుడు కౌపీన సంరక్షణార్థం అయం పటాటోపః ( గోచీని రక్షించుకోవటానికి ఈ కుటుంబ వస్త్రాడంబరము) అని వాపోయాడట ఆ బ్రహ్మచారి.

ఘోటక బ్రహ్మచారి అని తెలుగులో ఇంకో మాట. ఘోటకం అంటే గుఱ్ఱం. బ్రహ్మచారి పేరుకే గాని నిజం కాదనే భావంలో ఈ ఘోటక బ్రహ్మచారి పద బంధం వచ్చింది. అన్నమయ్య వర్ణించిన ఈ బ్రహ్మచారి మాత్రం శ్రేష్ఠులకందరికి శ్రేష్ఠుడు.

పాతు (= రక్షించుగాక)

గోచీని ధరించిన బ్రహ్మచారి సంసారికంటె బలవంతుడు. అందుకే ఆయన నాకు బలాన్నివ్వాలి అని అన్నమయ్య సార్థక పద ప్రయోగము. ఇలాగే ఈ కీర్తనలో పాతు (= రక్షించుగాక) కి ముందు విశేషణాలు కవి కోరుకొన్నదానికి అనుగుణంగా ఉంటాయి. ఉదా: శ్రేష్ఠులకందరికి శ్రేష్ఠుడు (= పరాత్పరుడు) అయిన ఆ వామనావతారి అయిన గోపాలుడు నా గుణము కాపాడుగాక! ఇలా చక్కటి పరికరాలంకార ప్రయోగములతో అన్నమయ్య కీర్తించిన వామనుడు మనలని కూడా రక్షించుగాక!



## *58. బ్రువంతి బౌద్ధా బుద్ధ ఇతి (01-164)*

**బ్రువంతి బౌద్ధా బుద్ధ ఇతి**
**స్తువంతి భక్తా సులభ ఇతి**

**1.గదంతికిల సాంఖ్యాస్త్వాం పురుషం**
**పద వాక్యజాః పదమితి చ**
**విదంతి త్వా వేదాంతినః**
**సదాబ్రహ్మ లసత్పదమితి చ**

**2.జపంతి మీమాంసకా స్త్వాంచ**
**విపుల కర్మణో విభవ ఇతి**
**లపంతి నయ సకలా స్సతతం**
**కృపాళు కర్తా కేవలమితి చ**

**3.భణంతి వేంకటపతే మునయో**
**హ్యణిమాదిప్రద మతులమితి**
**గుణవంతం నిర్గుణం పునరితి**
**గృణంతి సర్వే కేవలమితి చ**

**తాత్పర్యము :**

వేంకటేశా! నిన్ను బుద్ధ మతాన్ని అనుసరించే బౌద్ధులు బుద్ధుడవని చెబుతున్నారు. భక్తులు సులభుడవని స్తుతి చేస్తున్నారు.

1. సాంఖ్యులు నిన్ను పురుషుడవని చెప్పుచున్నారు కదా! పద వాక్యవేత్తలు శబ్ద బ్రహ్మవని పలుకుతున్నారు. వేదాంతము తెలిసిన వారు నిన్ను తెలుసుకొంటారు. నిత్య బ్రహ్మవని, ప్రకాశించే స్థానము కలవాడని పలుకుతున్నారు.

2. కర్మబ్రహ్మప్రతిపాదక శాస్త్రమయిన మీమాంస శాస్త్రము చదువుకొన్నవారు నిన్ను విపుల కర్మ యొక్క వైభవమని జపిస్తున్నారు. న్యాయశాస్త్రము తెలిసినవారు ఎప్పుడూ కేవలము కృపాలువైన కర్తవని నీ గురించి చెబుతుంటారు.

3. ఓ వేంకట పతీ ! మునులు నిన్ను సాటిలేని అణిమాది సిద్ధులు ప్రసాదించువాడవని పలుకుతుంటారు. సగుణుడవని, మళ్లీ నిర్గుణడవని కేవలుడవని చెబుతున్నారు.

**విశేషాలు :**

బ్రువంతి బౌద్ధా బుద్ధ ఇతి

"బౌద్ధులు అంటే బుద్ధమతస్థులు. ఇది సంస్కృత విశేష్యము. ఈమతమును స్థాపించినవాఁడు శాక్యబుద్ధుఁడు అని ప్రసిద్ధికి ఎక్కిన గౌతముఁడు. ఇతఁడు రమారమి రెండువేల నాలుగువందల సంవత్సరములకు ముందు జీవించి ఉండినటుల తెలియవచ్చుచు ఉన్నది. ఈ మతము సత్య శీల శమ దమాదిగుణములను విశేషముగ బోధించును. ఎట్టివానికిని ఇది శాంతమును ఉపదేశించునే కాని వైరమును పుట్టింపదు. సత్వగుణ ప్రధానము అయి అడఁకువ నమ్రత వినయము ఇత్యాది సాధుగుణముల నేర్పుటయందు మ యేమతమును దీనిని మించి ఉండదు. అయినను బౌద్ధులు పురాణములను వేదములను విశ్వసింపరు. వర్ణాశ్రమభేదముల ఒప్పుకొనరు. కొందరు నిరీశ్వరవాదులు, మరికొందరు సృష్టికి కారణము ఏదియో అది ఒకటి కలదు అని చెప్పుదురు గాని అందుల దృఢమైన మనోనిశ్చయముగాని నమ్మకముగాని వీరికి లేదు. వీరు భరతఖండమున ఇపుడు సకృత్తుగా కానఁబడుచు ఉన్నారు". (బౌద్ధులు: పురాణనామచంద్రిక (యెనమండ్రం వెంకటరామయ్య) 1879). సాంఖ్యదర్శనానికి మూలపురుషుడు కపిల ముని. సంఖ్యఅనే పదంనుంచే సాంఖ్య అనేపేరు వచ్చిందంటారు. ప్రత్యక్షం, అనుమానం, శబ్దం అనే మూడు ప్రమాణాలని సాంఖ్యులు అంగీకరిస్తారు. వీరు ప్రకృతినీ పురుషులను(జీవుడు) మాత్రమే నిత్యాలుగా గ్రహిస్తారు.

ప్రకృతికి సృష్టికి ముందు నుంచీ ఉనికి ఉంది. ప్రకృతి జడమైనదైతే పురుషుడు చైతన్య స్వరూపుడు.

మనస్సు, దేహము, ఇంద్రియాలకన్న భిన్నమైన వాడు. సాక్షిగా లోక వ్యవహారాలన్నిటినీ చూస్తూంటాడు. ఆది, అంతమూ లేనివాడు. ప్రకృతికన్న భిన్నమైనవాడు. ఏ గుణ విశేషాలూ లేనివాడు. శుద్ధ స్ఫటికంలా నిర్మలమైనవాడు. స్ఫటికం ముందు ఏ వస్తువుంచినా దాన్ని ప్రతిబింబింపచేస్తుంది. అలాగే పురుషుడూ నిర్మలుడవడంవల్ల తనముందు ఉండే వస్తువులను ప్రతిబింబింపజేస్తాడు. ప్రకృతి ప్రపంచ వ్యవహారాలు నడుపుతుంటే జీవుడు భోక్తగా అనుభవిస్తూంటాడు. కాని కర్తృత్వం లేదు. సత్వగుణ ప్రధానమైన అహంకారం నుంచి స్పర్శ, శబ్ద, రస ,రూప, గంధాలనే వాటిని గ్రహించే అయిదు జ్ఞానేంద్రియాలు, వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ లనే అయిదు కర్మేంద్రియాలూ, ఉభాయాత్మకమైన మనస్సు ఏర్పడతాయి. తమః ప్రధానమైన అహంకారం నుంచి పంచ స్థూలభూతాలకూ కారణమైన సూక్ష్మ భూతాలు పుడతాయి. వీటినే భూతతన్మాత్రలు అంటారు. వీటినుంచే స్థూలమహాభూతాలైన అగ్ని, నీరు, ఆకాశం, వాయువు, పృథ్వి అనే అయిదూ ఏర్పడతాయి. ఇలా పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, పంచ భూతతన్మాత్రలు, పంచ మహాభూతములూ మనస్సు, బుద్ధి, మహత్తూ ప్రధానంతో కలసి మొత్తం ఇరవైనాలుగు తత్త్వాలను అంగీకరిస్తారు.

గదంతికిల సాంఖ్యాస్త్వాం పురుషం

సమ్యక్ జ్ఞానాన్ని అంటే సరియైన జ్ఞానాన్ని కలిగిస్తుంది కాబట్టి దానిని సాంఖ్యవాదమని అన్నారు. ప్రపంచానికంతా ప్రకృతి, పురుషుడు మూలమని ఈ రెండూ స్వయం సిద్ధాలని సాంఖ్యులు చెబుతారు. ప్రత్యక్ష, అనుమాన, శబ్ద ప్రమాణాల ద్వారా జ్ఞానాన్ని సంపాదిస్తామని చెప్పిన సాంఖ్యులు ఆత్మను అంగీకరించారు. ఎందరు ప్రాణులుంటారో అన్ని ఆత్మలుంటాయనీ సాంఖ్యులు చెబుతారు. వీరి దృష్టిలో ఆత్మా చైతన్యం రెండూ ఒకటే. అన్నమయ్య ఈ సాంఖ్య వాదములోని పురుషుడిని తన కీర్తనలో పేర్కొన్నాడు. ప్రజ్ఞానం బ్రహ్మ అనేది అభ్యాస వాక్యం. అహం బ్రహ్మాస్మి అనేది అనుభూతి వాక్యం. తత్త్వమసి అనేది ఉపదేశవాక్యం. అయమాత్మాబ్రహ్మ అనే సమ్మత వాక్యం. (అం.వే.ప.)

వేదార్థము ఇది అని నిశ్చయించే న్యాయాన్ని చెప్పే మీమాంస శాస్త్రము. ఇందు కర్మకాండము పూర్వమీమాంస అని, బ్రహ్మకాండము ఉత్తరమీమాంస అని

రెండు రకాలుగా చెబుతారు. వీటినే కర్మమీమాంస, బ్రహ్మమీమాంస అని అందురు.

1. అణిమ, 2. మహిమ, 3. గరిమ, 4. లఘిమ, 5. ప్రాప్తి, 6. ప్రాకామ్యము, 7. ఈశత్వము, 8. వశిత్వము. అణిమ అష్ట సిద్ధులలో మొదటిది. శరీరాన్ని సూక్ష్మాతి సూక్ష్మం చేయగలిగే సిద్ధి. శిలలో సైతం ప్రవేశించడానికి అనువైన సూక్ష్మరూప ధారణ శక్తి

1.అణిమ . అణువంత సూక్ష్మ రూపాన్ని ధరించగలగడం .
2.మహిమ . బ్రహ్మాండమైన విరాట్ స్వరూపాన్ని పొందగలగడం .
3.గరిమ . బ్రహ్మాండగోళాల కంటే బరువుగా ఉండడం .
4.లఘిమ .గడ్డిపోచ కంటే తేలికగా ఉండగలగడం .
5.ప్రాప్తి .కోరిన వస్తువు ను లభింప చేసుకోవడం .
6.ప్రాకామ్యము .ఆకాశగమనము లభిస్తుంది .
7.ఈశత్వము . సర్వానికి అధికారి కావడం .
8.వశిత్వము .సర్వప్రాణి కోటిని వశం చేసుకుని శాసించగలగడం.

ఇవి లభింప చేసుకున్నవారు మహాత్ములు అవుతారు .వీరికి మామూలు మానవులకు ఉండే కోరికలు ఏమి ఉండవు .వీరు తమ శక్తులని ప్రజల సంక్షేమానికిఉపయోగిస్తారు.



## *60. ఫాల నేత్రానల (2-281)*

**ఫాలనేత్రానల ప్రబల విద్యుల్లతా**
**కేలీ విహార లక్ష్మీనారసింహా**

**1.ప్రళయమారుత ఘోర భస్త్రికా పూత్కార**
**లలిత నిశ్వాస డోలా రచనయా**
**కులశైల కుంభినీ కుముద హిత రవిగగన**
**చలన విధి నిపుణ నిశ్చల నారసింహా**

**2. వివర ఘన వదన దుర్ధ్విధ హసన నిష్ఠ్యూత-**
**లవ దివ్య పరుష లాలా ఘటనయా**
**వివిధ జంతువ్రాత భువన మగ్నీకరణ**
**నవనవ ప్రియ గుణార్ణవ నారసింహా**

**3.దారుణోజ్జ్వల ధగద్ధగిత దంష్ట్రా నల వి**
**కార స్ఫులింగ సంగ క్రీడయా**
**వైరి దానవ ఘోర వంశ భస్మీకరణ-**
**కారణ ప్రకట వేంకట నారసింహా**

**భావం :**

హిరణ్యకశిపుడు స్తంభాన్ని పగులగొట్టినప్పుడు, అతనిని చంపటానికి బయటకివచ్చిన నరసింహస్వామి వర్ణన అన్నమయ్య ఈ కీర్తనలో చేస్తున్నాడు.

లక్ష్మీదేవితో కూడి నరసింహస్వామీ! నీ నుదుట ఉన్న అగ్ని (= ఫాలనేత్రానల) నుండి, వృద్ధి పొందే (= ప్రబల) మెరుపులతో (= విద్యుల్లతా) ఆటలాడుకొనే వాడివి (= కేలీ విహార)

1. నరసింహ స్వామీ! నీ నిట్టూర్పులో (= నిశ్వాస) ప్రళయ కాలానికి సంబంధించిన గాలి (= మారుత) ఉంది. భయంకరమైన కొలిమి తిత్తిలో నిప్పు రాజేయటానికి ఊదే పూత్కారముంది. నీ నిట్టూర్పు ఉయ్యాలలా మారి ఏడుకుల పర్వతాలను, (ఉదయ, అస్త, హిమ, వింధ్య, మేరు, త్రికూట, లోకాలోక పర్వతాలు) భూమిని (= కుంభినీ) చంద్రుడిని, (= కుముద హిత) సూర్యుడిని, ఆకాశాన్ని ఒక ఊపు ఊపుతోంది. నువ్వు మాత్రం నిశ్చలంగా ఉన్నావు.

2. నరసింహస్వామీ! నీ గొప్పదయిన నోటిని (= ఘనవదన) తెరిచావు. (= వివర) దుర్మార్గులను (= దుర్విధ) చూసి అట్టహాసం (= హాసన) చేస్తున్నావు. నీవు వేసిన (= నిష్ఠ్యూత) ఉమ్మి (= లాలాజలం) దివ్యమైనది. తీవ్రమైనది. ఆ ఉమ్మితో అనేక జీవ సమూహాలు ఉన్న (= వివిధ జంతువ్రాత) లోకాలను (= భువన) నాశనం చేయగల (= అగ్నీకరణ) సమర్థుడివి. స్వామీ! నువ్వు ఎప్పటికప్పుడు కొత్త కొత్త గుణాలకు సముద్రంలాంటివాడివి. (నవనవ ప్రియ గుణార్ణవ).

3. నరసింహస్వామీ! మా వేంకటేశ్వరుడివి నువ్వే! నీ కోర పల్లు (= దంష్ట్రా) భయంకరంగా, ధగధగలాడుతూ ప్రకాశిస్తున్నాయి. వికృతమైన (= వికార) శత్రువులైన భయంకర రాక్షస వంశాలను భస్మం చేయటం కోసం (= భస్మీకరణ) పటపటలాడుతూ ఒరుసుకొంటున్న నీ పళ్ల మధ్య నిప్పురవ్వలు స్నేహం చేస్తున్నాయి. (= స్ఫులింగ సంగక్రీడయా) వేంకటేశ్వరా! నువ్వే ఆ నరసింహుడివి.

**విశేషాలు :**

అన్నమయ్య దృష్టిలో శివుడు, విష్ణువు ఇద్దరూ ఒక్కటే. 'బ్రహ్మమొక్కటే.. పరబ్రహ్మ మొక్కటే' అన్న విశాలమైన సమ దృక్పథం ఉన్నవాడు. 'ఎంత మాత్రమున ఎవ్వరు దలచిన అంత మాత్రమే నువ్వు' అని వేంకటేశ్వరునిలో అందరు దైవాలను చూసిన సంస్కారి. అన్నమయ్య ఈ కీర్తనలో వేంకటేశ్వరుని నరసింహునిగా

భావించాడు. శివుడికి సంబంధించిన మూడో కన్నును నరసింహునిలో చూసాడు. నుదుట ఉన్న కన్నులో మంటలు వ్యాపిస్తుండగా ప్రకాశించాడని (నిటల నేత్రమున నెరమంటలదర) నరసింహున్ని ఒక తెలుగు గీతంలో శివుడిగా వర్ణించాడు. ఆ విషయాన్నే ఈ కీర్తన ప్రారంభంలో సంస్కృత భాషలో సింహ గర్జనలకు తగిన శైలిలో చెప్పాడు.

అహోబిలం కిందనుండి కొండ పైన ఉన్న అహోబిలానికి వెళ్లేటప్పుడు దారిలో కారంజ నరసింహ స్వామి విగ్రహం కనబడుతుంది. ఈ స్వామికి శివుడిలా నుదుట కన్ను, ఒక చేతిలో బాణం, ఇంకో చేతిలో చక్రం కనబడతాయి. హనుమంతుల వారు ఈ కారంజ వృక్షం (= కానుగ చెట్టు) కింద రాముల వారి కోసం తపస్సు చేస్తూ కూర్చుంటే, నరసింహస్వామి ప్రత్యక్షమై నేనే రాముడిని అన్నాడట. నువ్వు నా రాముడివి కాదని హనుమంతుడు తిరస్కరిస్తే అప్పుడు నరసింహుడు నేనే విష్ణువుని, నేనే రాముడిని, శివుడిని' అంటూ శివుడిలా నుదుట కన్ను, రాముడిలా చేతిలో బాణం, విష్ణువులా చేతిలో చక్రంతో కనిపించాడని ఇక్కడ స్థల పురాణం. అన్నమయ్య శివకేశవాభేద దృష్టికి కారంజ నరసింహ స్వామి సాక్ష్యం పలుకుతాడు.

నవ నరసింహులలో ఈ కారంజ నరసింహుడు కూడ ఒకడు. మిగతా వాళ్ళు భార్గవ, యోగానంద, ఛత్రవట, అహోబిల, వరాహ, మాలోల, జ్వాలా, పవన నరసింహులు. అన్నమయ్య 'నవ నవప్రియ నారసింహ' అనే సంబోధనలో నవ నరసింహుల ప్రసక్తిని తెచ్చాడు.

ఈ కీర్తనలో లక్ష్మీనరసింహ సంబోధన ప్రత్యేకంగా చేయటానికి ఒక కారణముంది. యోగ నరసింహుడు అపారమైన జ్ఞానాన్ని, శాంతగుణాన్ని కొలిచే తనను కొలిచే భక్తులకు ప్రసాదిస్తే, లక్ష్మీనరసింహుడు అపారమైన దయను ప్రసాదిస్తాడు. దయతో సంపద, మోక్షం, ఆపద నుంచి రక్షించటం మొదలైన అన్ని గుణాలుంటాయి. అందుకే లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్' (నరసింహస్వామీ! నీ చేతుల రక్షణ నాకు ప్రసాదించు) అని శంకర భగవత్పాదులు లక్ష్మీనరసింహుని వేడుకొన్నారు. లక్ష్మీనరసింహుని కొలిచేవారికి దయ తప్పకుండ లభిస్తుంది. లక్ష్మీనరసింహుని ప్రత్యేకంగా గొంతెత్తి పిలిచిన ఈ అన్నమయ్య కీర్తన చదివినవారికి ఆ ఫలితం సిద్ధిస్తుంది.

నరసింహుడు జడలను అటు ఇటు కదల్చటం వల్ల గాలి మంచి వేగంగా పుట్టింది. ఆ వేగానికి ఆకాశంలో పోతున్న విమానాలు ఉయ్యాల ఊగుతున్నాయన్నాడు

పోతన. (7-285). అన్నమయ్య స్వామి బలంగా వదిలిన నిట్టూర్పుకే అన్ని అల్లకల్లోలమయి ఉయ్యాల ఊగుతున్నాయన్నాడు. రెండవ ఊహలో బలం ఎక్కువ ఉందని సాహితీవరులు ఒప్పుకోక తప్పదు. నరసింహుడు పళ్లు పటపట కొరికినప్పుడు పుట్టిన నిప్పురవ్వలు శత్రురాజుల వంశాలను కాల్చివేస్తాయనే అద్భుతమైన ఊహ, వర్ణనలకు నిధియైన ఎఱ్ఱన కూడా చేయలేకపోయాడు. (నృసింహపురాణం. 5-82)

వంశమంటే వెదురు అని ఇంకొక అర్థముంది. నిప్పుసోకిన వెంటనే చాలా కాలం ఎండిన వెదురు భగ్గుమంటుంది. రాక్షస వంశాలు కూడా చాలాకాలం నుంచి ప్రజలను బాధపెడుతున్నాయి. అవి కూడా స్వామివారి పళ్ళ పటపటలలో పుట్టిన అగ్ని జ్వాలలకు వెంటనే భగ్గుమంటాయని అందమైన ఇంకో అర్థం వస్తోంది. గోత్రం, కులం ఇలాంటి ఇతర పర్యాయపదాలు వాడకుండా, వెదురు అని మరో అర్థం వచ్చేటట్లుగా వంశం అని సరియైన పదాన్ని ప్రయోగించి రసానందాన్ని కలిగించిన అన్నమయ్యను పొగడకుండా ఉండలేం.

విష్ణుమూర్తి ఎత్తిన ఇతర అవతారాలలో చాలా మటుకు భూలోకంలో మానవుడు మొదలైన రూపాలలో ఎక్కువ కాలం ఉన్నాయి. కాని నరసింహావతారపు నిడివి తక్కువ. ప్రభావం ఎక్కువ. - అన్నమయ్య కీర్తన లానే -

పండితలోకంలో భాగవతానికి సంబంధించి శివుడు చెప్పినట్లుగా అందమైన చాటు శ్లోకం ఉంది. 'భాగవతం నాకు అర్థమైంది. శుకుడికి అర్థమైంది. వ్యాసుడికి పూర్తిగా అర్థమయిందో లేదో! కాని శ్రీధరుడికి మాత్రం నరసింహస్వామి దయవల్ల పూర్తిగా అర్థమైంది.' అని దాని భావం. వేంకటేశుని రూపంలో ఉన్న నరసింహుని దయతో అన్నమయ్య కూడ అద్భుతమైన ఈ కీర్తన రాసి మనలిని తరింపచేసాడు.



## *61. భావయామి గోపాల బాలం (1-137)*

**భావయామి గోపాల బాలం మన-**
**స్సేవితం తత్పదం చింతయేహమ్ సదా**

**1.కటి ఘటిత మేఖలా ఖచిత మణి ఘంటికా-**
**పటల నినదేన విభ్రాజమానం**
**కుటిల పద ఘటిత సంకుల శింజితానతం**
**చటుల నటనా సముజ్జ్వల విలాసం**

**2.నిరత కర కలిత నవనీతం బ్రహ్మాది-**
**సుర నికర భావనా శోభిత పదం**
**తిరు వేంకటాచల స్థితమనుపమం హరిం**
**పరమ పురుషం గోపాలబాలం**

**ముఖ్య పదార్థం :** గోపాల బాలం = ఆవులను కాసే బాలుని; భావయామి = తలుస్తాను; మనస్సేవితం = మనస్సు కొలిచేవాడిని; తత్పదం = అతని దివ్యపాదాలను; సదా = ఎల్లప్పుడు; చింతయేహం = ధ్యానిస్తాను; కటిఘటితమేఖలా = మొలతాడులో; ఖచిత = పొదిగిన; మణి ఘంటికా = మణులతో ఉన్న చిన్న గంటలయొక్క; పటల = విశదమయిన; నినదేన = చప్పుడుతో; విభ్రాజమానం = ప్రకాశించువానిని; కుటిల పదఘటిత = వంకరగా వేసిన అడుగులతో; సంకుల = వ్యాపించిన; శింజిత = మోగే అందెల చప్పుడుతో; ఆనతం = వంగినవానిని; చటుల = అందమైన; నటనా = నృత్యంతో; సముజ్జ్వల = బాగా ప్రకాశించే; విలాసం = విలసము గలవాడిని; నిరత = ఎప్పుడూ; కరకలిత = చేతిలో ఉంచుకొన్న; నవనీతం = కొత్తగా తీసిన వెన్నముద్ద కలిగినవానిని; బ్రహ్మాది = బ్రహ్మ మొదలయిన; సుర నికర = దేవతలందరి; భావనా శోభిత = భావనలలో ప్రకాశించే; పదం = అడుగులు కలవానిని; తిరువేంకటాచల = శ్రీవేంకటాచల పర్వతములో; స్థితమ్ = ఉన్న; అనుపమం = సాటిలేని, శ్రేష్ఠుడైన; హరిం = హరిని; పరమ = శ్రేష్ఠుడయిన; పురుషం = పురుషుని (తలుస్తాను).

**భావం :**

యశోదమ్మ దగ్గర పారాడుతూ, నడుస్తూ, నృత్యం చేస్తున్న చిన్నికృష్ణయ్యని అన్నమయ్య ఈ కీర్తనలో మనోహరంగా వర్ణిస్తున్నాడు. చిట్టిపొట్టి అడుగులు వేస్తూ మాముద్దు కన్నయ్య నడుస్తుంటే మొలతాడుకు ఉన్న చిరుగంటలు అందంగా మోగుతున్నాయి. అసలు మన హృదయాలు గంటలుగా మారాయేమో! అదుగో మనలని అనుగ్రహించటానికి కృష్ణుడు నృత్యం చేస్తున్నాడు. అటు కాలు ఇటు, ఇటు కాలు అటు వేసి, అందెలు ఘల్లు ఘల్లు అంటుంటే మా బాల కిట్టయ్య ఎంత చక్కటి నృత్యం చేస్తున్నాడో కదా! ఆ విలాసం ఇంకెవరికయినా ఉంటుందా!

అదుగో! అమ్మ ఎప్పుడు పెట్టిందో చేతిలో వెన్నముద్దతో వెన్నదొంగ మురిసిపోతూ మెరిసిపోతున్నాడు. ముద్దు ముద్దుగా నడుస్తుంటే అందరూ మురిసిపోయే అడుగులతో తమ ఆలోచనలు మెరిసిపోతుంటే బ్రహ్మ మొదలయిన దేవతలందరూ అదృష్టవంతులమనుకొంటున్నారు. ఎవ్వరితో పోలికలేనివాడు, పరమపురుషుడు గోపాల బాలుడు. ఆ చిన్ని కృష్ణుడు వేంకటేశునిగా వేంకటాచలంలో ఉన్నాడు. ఆ ఆవులు కాసే బాలుడిని, నన్ను రక్షించమని ధ్యానిస్తాను.

స్వామివారు భూలోకంలో ఉన్నది సరిగ్గా 125 సంవత్సరాలని ఒక లెక్క.

ఈ 125 సంవత్సరాల జీవిత కాలంలో పెద్దరికపు చేష్టల కంటె శ్రీకృష్ణుని బాల్య క్రీడలు కవులు అధికంగా మనస్సేవితాలయ్యాయి. మనస్సేవితమనేది ఒక అద్భుతమైన పదబంధం. చేతులు, కాళ్ళు భగవంతుని సేవలో యాంత్రికంగా నిమగ్నమవుతాయికాని, మనస్సు సేవించటమనే విషయం మానవులలో తక్కువగా జరుగుతుంది. రాగద్వేషాలకు అతీతులై, భగవంతుని మనస్సేవ చేయమని అన్నమయ్య సందేశం. భాగవతంలో కర్దమ మహాముని చూసిన స్వామి మనస్స్పృశ్యస్మితేక్షణుడు. (మనస్సును తాకే చిరునవ్వుల చూపులవాడు) ఆ చిన్నికృష్ణుడిని మనస్సేవితునిగా చేసిన అన్నమయ్య ధన్యుడు.

మర్కట కిశోర న్యాయం, మార్జాల కిశోర న్యాయం – అని రెండు పద్ధతులు భక్తిప్రపంచంలో ఉన్నాయి. ఒక కొమ్మ నుంచి ఇంకో కొమ్మకు దాటేటప్పుడు తల్లి కోతిని – పిల్లకోతి గట్టిగా పట్టుకొని ఉంటుంది. ఇక్కడ తల్లికి రక్షణ బాధ్యతలేదు. పిల్లకే బాధ్యత. ఈ విధానంలో భక్తుడిదే బాధ్యత. జీవుడు తన రక్షణకు తాను ప్రయత్నాలు చేస్తుంటాడు. మార్జాల కిశోరన్యాయం దీనికంటే ప్రతేకమైనది. పిల్లి తన పిల్లలని తానే రక్షిస్తుంది. ఆహారం అందిస్తుంది. ఒకచోటనుంచి ఇంకో చోటికి తానే తీసుకువెళుతుంది. ఇక్కడ తల్లిదే రక్షణ బాధ్యత. పిల్లకి సంబంధంలేదు. అన్నమయ్య లాంటి మహాభక్తులు అనుసరించిన శరణాగతి మార్గం ఇదే. స్వామికే సర్వం సమర్పణ చేయాలి. తన రక్షణ బాధ్యతలు అన్ని స్వామికే అప్పజెప్పే ఈ ఉత్తమ భక్తి విధానంలో వేలాది కీర్తనలు అన్నమయ్య రాసాడు. ఈ భావయామి కీర్తనలోని సదా (= ఎల్లప్పుడు) అనే పదం కీలకమైంది. సర్వకాల సర్వావస్థల్లోను స్వామిని ధ్యానించాలి. శరణు కోరాలి. ఈ కీర్తన ఇచ్చే సందేశం ఇదే. చింతయేయమ్ కు బదులు "చింతయేహమ్" అను పాఠమే మనం గ్రహించాలి. ముత్తుస్వామిదీక్షితులవారు కూడా చింతయేహమ్ అని శివ సంకీర్తనలలో తరచూ ప్రయోగించారు.

అమ్మ భావనాగమ్య (భావించటం చేత తెలియదగినది – లలితాసహస్రం) కృష్ణయ్య కూడా భావనా గమ్యుడు. కేవలం మనకే కాదు. బ్రహ్మమొదలైన దేవతల భావనలకు – చిన్నికృష్ణుడు శోభనిస్తాడని అన్నమయ్య చెబుతున్నాడు. అంటే మనం కృష్ణయ్యను ఒక్కసారి భావిస్తే చాలు. ఆ ఊహలు వెలిగిపోతాయి. అతడు బ్రహ్మాది భక్తుల భావాల వెలుగుతో ప్రకాశించే పదాలు కలవాడని కవి మాట. పదాలకు రంగు, రుచి, వాసన ఉంటాయంటే కవులలాగే చెబుతారని అనుకొనేవాళ్ళు ఈ అన్నమయ్య భావనాశోభ చూసి "పదాలకు రుచి ఉంటుంది. నిజమేస్మీ" అనకుండా ఉంటారా?

ఈ కీర్తనలో నిరత కరకలిత నవనీతం (చేతిలో ఉంచుకొన్న కొత్తగా తీసిన వెన్నముద్ద కలిగినవానిని) పాదాన్ని విన్నవెంటనే – "చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ" అనే పద్యం గుర్తుకు వస్తుంది. ఆ మాటకొస్తే అమ్మ చేతిముద్ద లాంటి కమ్మనైన ఈ పద్యం కూడా అన్నమయ్యదే అని కొందరు విమర్శకుల భావన.

ఇంతకీ వెన్నముద్దకీ, కృష్ణుడికి సంబంధం ఏమిటి? ఆయనకి ఇంకేం పనిలేనట్టు అస్తమాను ఈ వెన్న దొంగతనాలు ఏమిటి? వెన్నముద్దలు చేతిలో పెట్టుకోవటమేమిటి? ఈ ప్రపంచం నీళ్ళవంటిది. మనస్సు పాలవంటిది. నీళ్ళలో పాలను కలిపితే – స్వచ్ఛమైన పాల ఉనికి మనకు కనిపించదు. అదే పాలను పెరుగుగా మార్చి చిలికితే వెన్న వస్తుంది. ఆ వెన్నముద్దను నీళ్ళలో ఉంచితే, అది నీళ్ళలో కలవదు. తేలుతుంది. మన జీవుల మనస్సు వెన్న కావాలని కృష్ణయ్య సందేశం. నీళ్ళలాంటి ప్రపంచంలో ఉంటున్నా – ప్రాపంచిక బంధాలు అంటుకోకూడదు. ఇది చెప్పినంత తేలిక కాదు. పాలలాంటి మనస్సు వెన్నగా మారాలంటే కృష్ణమూర్తి అనుగ్రహం జీవుడికి అవసరం. నన్ను ఆశ్రయించండి... స్మరించండి. మిమ్మల్ని నా చేతుల్లో పెట్టుకొని చూసుకొంటానని స్వామి వెన్నముద్దనవు చేతిలో ధరిస్తున్నాడు. ఇది అర్థం చేసుకొన్న అన్నమయ్య లాంటి మహాభక్తులు సదా ఆయనను స్మరించి తరించారు. అన్నమయ్య కీర్తనలు చదివి ఆనందించాలి. ఆయన మార్గాన్ని అనుసరించి తరించాలి.



## *62. మందరధర మధుసూదన*

వేంకటేశుని అనేక నామములతో పొగుడుతూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది. (సంపుటము 01-267 కీర్తన)

**మందరధర మధుసూదన**
**నందగోపనందనా**

**1.నరసింహా! గోవింద! నవనీతానంద**
**హరి!ముకుంద! నయనారవింద**
**కరివరద !గరుడగమనరూప-**
**గురుచాపా! యదుకులదీపా**

**2.భవదూర! భయహర! పరిపూర్ణామృత**
**భువనపాలన! సురపాలన**
**భువనభూషణ !పరపురుష !పురాతన**
**నవభోగా కరుణా!యోగా**

**3.పంకజాసననుత భవ్యనిర్మలపాద-**
**పంకజ !పరమ పరాత్పర**
**వేంకటశైలనివేశ శు-**
**భంకరా క్షేమంకరా**

**తాత్పర్యము :**

తాబేలు రూపంలో మందర పర్వతాన్ని ధరించిన వాడా ! మధువనే రాక్షసుని చంపిన వాడా! అనేక గ్రామములకధిపతి యైన నందుడను గొల్లవాని కుమారుడా!

1. నరసింహావతారము ధరించిన వాడా! గోవిందుడా! అప్పుడే చిలికి తీసిన వెన్నను తిని ఆనందపడేవాడా! ఓ శ్రీహరీ ! మోక్షమునిచ్చువాడా! పద్మములవంటి కన్నులు కలవాడా! ఏనుగుకు వరమిచ్చినవాడా! సారవంతములైన రెక్కలు గలవాడు గరుత్మంతుడు. ఆ గరుత్మంతుని మీద కూర్చున్న మనోహరమైన రూపము కలవాడా! శత్రువులను బాధపెట్టు వెదురు విల్లును కోదండము అంటారు నాలుగు మూరలతో పెద్దదిగా ఉండే ఆ కోదండమును ధరించినవాడా! యయాతి కుమారుడు యదువు. ఇతని వంశస్థులే యాదవులు. ఆ యాదవకులానికి దీపము వంటివాడా!

2. ఈ సంసార దుఃఖాన్ని పోగొట్టేవాడా! సంసార భయాన్ని పోగొట్టేవాడా! పరిపూర్ణమైన జ్ఞానామృతముతో నిండినవాడా! లోకములను పాలించువాడా! దేవతలను పాలించువాడా! ఈ లోకానికి అలంకారమువంటి వాడా! శ్రేష్ఠమైన పురుషుడా! ఆది లేనివాడా! ఎప్పుడూ కొత్త భోగాలను అనుభవించువాడా! కనికరము కలవాడా! ధ్యానము కలిగించువాడా!

3. పద్మము కలిగిన బ్రహ్మ చేత పొగడబడినవాడా! గొప్పవైన, నిర్మలమైన పాదములు కలవాడా! గొప్పవాడా! శ్రేష్ఠులకందరికి శ్రేష్ఠుడా! వేంకట పర్వతమునందు నివసించువాడా! శుభములను కలిగించువాడా! క్షేమములను కలిగించువాడా!

**విశేషాలు :**

మధుసూదన

వాసుదేవ మహామంత్రంలోని 'వ' అన్న అక్షరానికీ, కన్యారాశికీ నియామకునిగా మధుసూదనుని చెబుతారు.

నందగోపనందనా

భగవంతుణ్ణి తనలో కల్గి ఆనందించేవాడు కాబట్టి నందుడని పేరు. ఆ భగవంతున్ని దుష్టుల దృష్టిలో పడకుండా దాచి గోప్యంగా – రహస్యంగా ఉంచుతాడు కనుక గోపుడు. నంద గోప నందనుడే అంటూ అన్నమయ్య ఈ నంద గోప పదాన్ని చాలా ఆప్యాయంగా ఇంకో గీతములో ప్రయోగించాడు.



## *63. మర్ద మర్ద మమ బంధాని*

స్వామి వారి సుదర్శన చక్రాయుధాన్ని కొనియాడుతూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది. (02-081)

**మర్ద మర్ద మమ బంధాని**
**దుర్దాంత మహాదురితాని**

**1.చక్రాయుధ రవిశత తేజోంచిత!**
**సక్రోధసహస్ర ప్రముఖ !**
**విక్రమక్రమావిస్ఫులింగకణ !**
**నక్రహరణ! హరిసవ్యకరాంకా**

**2.కలితసుదర్శన! కఠినవిదారణ**
**కులిశకోటిభవ ఘోషణా**
**ప్రళయానలసంభ్రమ విభ్రమకర**
**రళితదైతగళ రక్తవికీరణా**

**3.హితకర శ్రీవేంకటేశ ప్రయుక్త !**
**సతతపరాక్రమ! జయంకర**
**చతురోఽహంతే శరణమ్ గతోఽస్మి ।**
**ఇతరాన్ విభజ్య యిహ మాం రక్ష**

**తాత్పర్యము :**

ఓ సుదర్శన చక్రమా ! జన్మజన్మాంతరాలనుండి వస్తున్న ఈ సంసారపు సంకెళ్లను నుగ్గు నుగ్గు చేయి. అణపరాని నా మహా పాపములను అణచి వేయి. (నిందితమైన నడత కలది దురితము = పాపము)

1. వంద మంది సూర్యుల కాంతితో కూడిన దానా! ఓ చక్రాయుధమా! కోపముతో కూడిన వేయి సంఖ్య కల అంచులు అనే ముఖములు కలదానా! శత్రువులపై పరాక్రమముతో కూడిన సంచారమునుండి ఆవిర్భవించుచున్న (= ఆవిః) నిప్పుకణములు కలదానా! ఏనుగును చంపిన దానా! శ్రీహరి కుడి చేతికి గుర్తు అయినదానా!

2. అందమైన సుదర్శన చక్రమా! కఠినులైన రాక్షసులను చీల్చేదానా! కోటి వజ్రాయుధములనుండి పుట్టిన ధ్వనిని కలిగినదానా! ప్రళయ కాలములోని నిప్పువంటి వేగము కలిగిన విభ్రమము కలిగించేదానా! మోగుతున్న రాక్షసుల గొంతుకలనుండి వచ్చే నెత్తురును నాలుగు వైపులకు వెదజల్లుచున్నదానా!

3. లోకానికి మేలుచేసే విష్ణు స్వరూపుడయిన వేంకటేశునిచే ప్రయోగింపబడినదానా! ఎప్పుడు పరాక్రమము కలదానా! జయమును కలిగించుదానా! నేర్పు కలిగిన నేను నీకు శరణాన్ని పొందాను. మంచివారికి ఇతరులైన శత్రువులను నాశనము చేసి ఈ లోకములో నన్ను రక్షింపుము .

**విశేషాలు :**

చక్రాయుధ

సూర్యుణ్ణి సానబట్టేటప్పుడు రాలిన తేజస్సును పోగు చేసి, దేవశిల్పి అయిన విశ్వకర్మ చక్రాకారమైన ఆయుధంగా రూపొందించాడు. ఇదే సుదర్శన చక్రము. దానిని, మహావిష్ణువుకు విశ్వకర్మ ఆయుధంగా ఇచ్చాడు. ఇది శ్రీహరి అనుకొన్న మాత్రంలో వచ్చి, కుడిచేతిని చేరుతుంది. ఒక్కసారి ప్రయోగించగానే ఎంతటి వాణ్ణయినా తరిమి, చంపి, తిరిగి స్వామి దగ్గరికి వస్తుంది. ఈ చక్రాయుధం వల్ల చనిపోయినవారు విష్ణుదేవుని దివ్యతేజస్సులో కలిసిపోతారు.

మహాదురితాని

పంచ–మహాపాతకములు అని ప్రసిద్ధి పొందిన అని అయిదు పాపాలున్నాయి. 1. సువర్ణస్తేయము, 2. సురాపానము, 3. బ్రహ్మహత్య, 4. గురుపత్నీ సంగమము, 5. పై పాతకములు చేసినవానితో స్నేహము. పంచ–మహాపాతకములు అని కొంతమంది అంటే మరికొంతమంది 1. బ్రహ్మహత్య, 2. భ్రూణహత్య, 3. బాలహత్య, 4. గోహత్య, 5. స్త్రీ హత్య. పంచ మహా పాపాలన్నారు. ఈ పాపాలన్నీ తాను చేసానని కాదు కవి ఇక్కడ చెబుతోంది. ఇటువంటి వాటితో పోలిన పాపాలు చేసిన జీవులను రక్షించమని జీవులతరపున కవి నివేదన.

ద్రుపదాదివ ముంచతు ద్రుపదాదివేన్ముచానః స్విన్నస్స్నాత్వీ విమలదివ, పూతం పవిత్రేనే ఆజ్యం , ఆపశ్శున్ధన్తు మైనసః (పంగగానున్న కొయ్యలో కాళ్లు చేతులు దూర్చి బిగించటాన్ని బండ కొయ్య వేయటం అంటారు. ఆ బండకొయ్యనుంచి విడిపించినట్లుగా, చెమటపట్టిన వాడు స్నానమాచరించి మురికిని పోగొట్టునట్లుగా,

జ్ఞానముచే మూల ప్రకృతి తొలగిపోయినట్లుగా, ఆ పరమాత్మ నన్ను సకల పాపాలనుండి విడిపించుగాక) అని ప్రతిరోజు పవిత్రమైన సంధ్యావందనములో పాపాలనుంచి విముక్తి చేయమని స్వామిని వేడుకొంటాం. అదే ధోరణిలో కవి ఇక్కడ పాపాలను అణచి వేయమని చక్రాన్ని ప్రార్థిస్తున్నాడు.

ప్రముఖ

ప్రకృష్టమయిన ఉద్యోగము కలవాడు ( ప్రకృష్టం ముఖమారంభోన్యేతి ప్రముఖః) అని ప్రముఖ శబ్దానికి అర్థం. ముఖ్యమైన వాడు అని ఈ పదానికి మొత్తం మీద అర్థం. అయితే అన్నమయ్య ఈ కీర్తనలో ముఖము అనే అర్థంలో ప్రముఖ శబ్దాన్ని ప్రయోగించాడు.

ముగింపు

స్వామిని / చక్రాన్ని శరణుపొందినవారు నేర్పు కలిగినవారని కవి ఈ కీర్తనలో చెబుతున్నాడు. స్వామిని ఆశ్రయించి మనము కూడా నేర్పు కలిగినవారమవుదాం.



## *64. మా జహిహి దుష్టమనాయితి*

అన్నమయ్య మనుమడు తాళ్లపాక చిన తిరుమలాచార్యులవారు రచించిన సంస్కృత కీర్తన ఇది. (10-007)

**మాజహిహి దుష్టమనాయితి**
**యోజయ తవపదయుగామృతేన**

**1.పరమాత్మన్ మమపామరచిత్తం**
**చిరం పాపం చికీర్షతి**
**కరుణానిధే !అకారణబంధో**
**గురుతరాం కృపాం కురు మయి దేవ**

**2.అంతర్యామిన్ !హరే !మదాశా**
**సంతాప ఏవ సమేధతే**
**దాంతికరానంతగుణనిధే**
**భ్రాంతిం వారయ !పావన చరిత**

**3.నలినోదర !మాం నానామోహ**
**విలసత్కృతీవ విమోహయ**
**కలిత శ్రీవేంకటనాథత్వం**
**సలలితం ప్రసాదయ స్వామిన్**

**తాత్పర్యము :**

ఓ వేంకటేశా ! నేను దుష్ట కార్యక్రమాలు చేస్తున్నానని, దుష్టుడనని (దుష్టమనాయితి) నన్ను విడిచిపెట్టకు. (మాజహిహి). నీ పాద పద్మములనుండి స్రవించే అమృతములో (తవపదయుగామృతేన) నన్ను కలుపు. (యోజయ)

1. స్వయంప్రకాశం కలిగి, జ్ఞానరూపమైన ఓ ఆత్మ స్వరూపుడా! అజ్ఞానినైన నా మనస్సు ఎప్పుడూ పాపాన్నే చేస్తుంటుంది. దయకు నిధి వంటివాడా! నీ అంతట నువ్వే నా మీద ప్రీతితో కారణము లేకుండా బంధువైన వాడా! (ప్రీతిని పొందించే వాడు బంధువని అర్థం.) ఓ దేవా ! నాయందు దయను చూపించవయ్యా!

2. లోపల ఉండేవాడా! (లోపలనుండి జీవుని, ఇంద్రియాదులను తమతమ కృత్యములలో నియమించువాడు అంతర్యామి) ఓ హరీ ! నా ఆశ అను సంతాపము పెరిగిపోతోంది. (ఆశలు పెరుగుతున్నాయని తగ్గించమని విన్నపము) బాహ్యేంద్రియ నిగ్రహము కలిగించే అంతులేని గుణాలకు నిధి వంటి వాడా! ఉన్నది లేనట్టును, లేనిది ఉన్నట్టును తలచే నా భ్రాంతిని పోగొట్టు. ఓ పవిత్ర చరిత్రుడా!

3. పద్మము నాభియందు కలవాడా! అనేక రకాల మోహాలతో ప్రకాశిస్తూ, అదృష్టవంతుడిని అనుకొనే నా మోహము (మనస్సును దుఃఖ పెట్టే దానిని మోహము అంటారు.) తొలగించు. నువ్వు వేంకటాచల పర్వతములో కొలువై ఉన్నావు. ఓ స్వామీ! భక్తితో అందంగా ఉండేటట్లు నాకు జీవితాన్ని అనుగ్రహించు.

**విశేషాలు :**

మాజహిహి దుష్టమనాయితి

1. ఇతరుల డబ్బుని కోరుకొనుట 2. అశుభాలని గురించి ఆలోచించటం, 3. పరలోకమే లేదు, దేహమే ఆత్మయనెడి బుద్ధి. (ఇవి మానసిక పాపములు) 4. కఠినంగా మాట్లాడటం, 5. అబద్ధాలు చెప్పటం, 6.ఒక వ్యక్తిని పరోక్షములో దూషించటం , 7. పరస్పరసంబంధము లేనిమాటలు చెప్పటం (ఇవి వాచిక పాపములు), 8. పరద్రవ్యము నన్యాయముగ గ్రహించుట, 9. నిషేధింపబడిన హింస చేయుట , 10. ఇతరుల భార్యను ఆశించుట (ఇవి శరీర పాపములు) ఈ పాపాలలో ఏదన్నా తెలియక దుష్టుడనై చేసానేమో ! నన్ను రక్షించు. దూరము చేయకు అని భక్తుని ఆవేదన.

తవపదయుగామృతేన

"ఆనందామృత – పూరితా హర – పదాంభోజాలవాలోద్యతా" (శివానంద లహరి 49) అనే శ్లోకములో శంకరాచార్యులవారు భక్తి అనే తీగ పరమశివుని పాద పద్మములు అనే పాకుడు కఱ్ఱమీదికి ఎగబాకాలని కోరుకొన్నారు. చినతిరుమలాచార్యులవారు పాద పద్మములనుండి స్రవించే అమృతములో తనని కలిపి వేయమంటున్నారు.

పద్మములనుండి స్రవించేది మకరందము కదా ! అమృతము అని కవి ఎందుకంటున్నాడు? 1.నీరు, 2. పాలు, 3. పెరుగు, 4. నేయి, 5. తేనె అని పంచామృతములు. ఇందులో తేనె – మకరందానికి పర్యాయ పదమే. అందువల్ల మకరందమన్నా, తేనె అన్నా ఒకటే. అందువల్ల దూరార్థములో మకరందము కూడా అమృతము అవుతోంది.

ఇంకొక విశేషము. అమృతము అంటే చావులేనిది. అంటే మోక్షము. అమృతములో నన్ను కలిపివేయి అంటే మోక్షము అనుగ్రహించమని ప్రార్థన.

పరమాత్మన్

ఈ పరమాత్మన్ పదాన్ని పలువురు పలు విధాలుగా నిర్వచించారని నిఘంటువులు చెబుతున్నాయి. అందులో కొన్ని: 1. స్వయం ప్రకాశం కలిగి, జ్ఞానరూపమైన ఆత్మ. 2. కార్యకారణాలకంటే భిన్నమై, క్షరాక్షరాల కంటే కూడావేరుదై, స్వాభావికంగా నిత్యమై, శుద్ధమై, బుద్ధమై, ముక్తమైన పదార్థం. 3. అవిద్య వల్ల ఆత్మగా తలచిన దేహం మొదలు బుద్ధివరకు ఉన్న తత్త్వాలకు అతీతమైనది. సర్వోత్కృష్టమైనదీ, ఉపద్రష్టృత్వాది విశేషణ విశిష్టమై ప్రకాశించే ఆత్మ. 4. ఆత్మగా కల్పితాలైన పంచ కోశాలకు, విరాట్, హిరణ్య గర్భ, అవ్యాకృత తత్త్వాలకు అతీతమై, బ్రహ్మకు పూర్వం నుంచి ఉన్న పదార్థం. 5. సమస్త భూతాలలోని ప్రత్యక్చేతనం. 6. మాయాశక్తికి ఆశ్రయం. 7. సర్వానికి అధిష్ఠానమైనది. 8. పర దేవత. 9. దైవం / పరబ్రహ్మం.

అకారణబంధో

తల్లివైపు వారు, తండ్రి వైపు వారు ఆ తల్లికి, తండ్రికి పుట్టామన్న కారణముతో బంధువులైనవారు. వాళ్లు మన ప్రీతి చూపించటానికి కారణముంది. కాని స్వామి ఎటువంటి కారణము లేకుండానే మన మీద ప్రీతి చూపించేవాడు కనుక చిన తిరుమలయ్య స్వామిని అకారణబంధువు అన్నాడు.

భ్రాంతిం వారయ

సంసారమనే భ్రమ కేవలం భ్రాంతి మూలకమే కాని సత్యం కాదు. ఆత్మ ఏకమైనది. అవయవ రహితమయినది. శరీరం ఎన్నో అవయవాలు కలిగినది. కాని ప్రజలు ఈ రెండింటినీ ఒకటే అని భావిస్తారు. ఇదే భ్రాంతి. ఈ భ్రాంతిని తొలగించమని కవి ప్రార్థన.

విమోహయ

"ఏది తుద దీనికేది మొదలు । పాదుకొను హరిమాయ బరగు జీవునికి" అను కీర్తనలో అన్నమయ్య "యెన్నికొలువులు దనకు నెన్నియనుచరణలు । యెన్నియాసలు మరియు నెన్ని మోహములు ।" అని జీవుని తరపున బాధపడ్డాడు. చిన తిరుమలాచార్యులవారు ఈ మోహాన్ని పోగొట్టుమని ప్రార్థిస్తున్నారు.



## *65. మాదృశానాం భవామయ దేహినాం*

కలియుగములోని జీవుల పాపకృత్యాలను నిరసిస్తూ, వేంకటేశుడే అందరికీ దిక్కని వ్యంగ్యంగా అన్నమయ్య ప్రబోధించిన కీర్తన ఇది. (సంపుటము 1 - 325)

**మాదృశానాం భవామయ దేహినాం**
**యీదృశం జ్ఞానమితి యేపిన వదంతి**

**1. వాచామ గోచరం వాంఛాసర్వత్ర**
**నీచకృత్యైరేవ నిబిడీకృతా**
**కేచిదపి వా విష్ణుకీర్తనం ప్రీత్యా**
**సూచయంతో వా శ్రోతుం న సంతి**

**2. కుటిల దుర్భోధనం కూహకం సర్వత్ర**
**విట విడంబన మేవ వేద్యృధీతం**
**పటు విమల మార్గ సంభావనం పరసుఖం**
**ఘటయితుం కష్టకలికాలే న సంతి**

**3. దురిత మిదమేవ జంతూనాం సర్వత్ర**
**విరస కృత్యైరేవ విశదీకృతం**
**పరమాత్మానాం భవ్య వేంకటానామ**
**గిరివరం భజయితుం కేవా వసంతి**

**తాత్పర్యము :**

మావంటి సంసారమను రోగము (= ఆమయము) కలిగిన దేవా ధారులకు జ్ఞానము ఇలా ఉంటుంది అని ఎవరూ చెప్పరు.

1. అన్ని ప్రదేశాలలో మానవుల కోరిక అనేది మాటలకు అందనంతగా, చెడు ప్రయత్నములతో బాగా దట్టముగా ఉన్నది. (ఈ కలియుగములో మానవుల దురాశను మాటలలో వివరించటానికి సాధ్యము కాదని కవి హృదయము). కొద్ది మందయినా విష్ణు కీర్తనమును ప్రీతితో సూచించుటకు కాని, వినుటకు కాని లేరు.

2. అన్ని చోట్లా చెడ్డవాళ్లయొక్క దుర్బోధ, మోసము (= కుహకము), విటుల అనుకరణమే విద్యగా అందరిచే చదువబడుచున్నది. (ప్రతివారు కలియుగంలో దుర్బోధలు, మోసాలు చేయుటలో పట్టభద్రులవుతున్నారని కవి ఆవేదన). సమర్థమైన, స్వచ్ఛమైన మార్గమును గౌరవించుటకు, పరసుఖాన్ని, (ఇతరులకు సుఖమైన దానిని) చేయుటకు ఈ కష్ట కలికాలములో ఎవరూ లేరు.

3. అన్నిచోట్లా జీవులయొక్క పాపము, విసుగు కలిగించు పనులతో (రసహీనమైన కృత్యములతో) తెలియ పరచబడినది. (పాపము జీవులతో చేయరాని పనులను ఈ కలియుగములో చేయిస్తున్నదని కవి ఆంతర్యము). పరమాత్మ అగు గొప్పదైన వేంకటమను పేరు కల పర్వతముపై ఉన్న శ్రేష్ఠుడైన వేంకటేశుని కొలుచుటకు ఎవరును లేరు. (కలియుగములోని జీవులందరికి వేంకటేశుడే దిక్కు అని, పాపాల మార్గంలో పడవద్దని కవి వ్యంగ్య ప్రబోధము)

**విశేషాలు :**

భవామయము

ఆమయము అను పదానికి వ్యుత్పత్తి ఇది. వ్యు. మీఙ్ = హింసాయామ్. ఆ + మీ = అచ్. (కృ.ప్ర.) దీనిచే హింసింపబడుదురు. (ఆంధ్రశబ్దరత్నాకరము (చెలమచెర్ల రంగాచార్యులు)1966)

సంసారము జ్ఞానము కోరుకొనేవారికి రోగంలా హింసిస్తుంది. ఒక పట్టాన వెలుగు దగ్గరికి వెళ్లనివ్వదు. అందుకే అన్నమయ్య సంసారాన్ని రోగంతో పోలుస్తూ భవామయము అన్నాడు. కంసాంతకుని భక్తి కలిగితే సంసారమే మేలు. (03-447) అని తన తెలుగు కీర్తనలో చెప్పిన దానిని ఈ సంస్కృత కీర్తనలో కాస్త వ్యంగ్యంగా గిరివరం భజయితుం కేవా నసంతి (= పర్వతము పై ఉన్న శ్రేష్ఠుడైన శ్రీవేంకటేశుని కొలుచుటకు ఎవరును లేరు) అని చెప్పాడు.

భాగవతము మొదలైన గ్రంథాలలో కలియుగము చాలా రకాల దోషాలకు నెలవని చెప్పారు. (01-17-38, 39) వాటిలో విట విడంబనము మొదలైన వాటిని

అన్నమయ్య ఈ కీర్తనలో చెప్పాడు. కలియుగమెటులైనా గలదుగా నీ కరుణ (02–430) అని అన్నమయ్య స్వామి అభయ హస్తంలా అభయాక్షరాలతో కలియుగంలో జీవిస్తున్న మనకు అభయమిచ్చాడు. కలియుగము ఎట్లా ఉన్నా నామీద నీ దయ ఉంది కదా! అది చాలు అని వేంకటేశునితో అన్నమయ్య సంభాషణ. వేంకటేశుని దయ సంపాదించటానికి మనము నిరంతరము యత్నించాలి. ఈ సంస్కృత కీర్తన వెనుక ప్రతిధ్వని అదే.



## *66. మాధవ కేశవా మధుసూదన (04-330)*

అన్నమయ్య తిరుమల వేంకటేశునికి ఆర్తితో సమర్పించిన భక్తి సుమహారం ఈ కీర్తన. ఇందులోని అర్థ పరమార్థాలు తెలుసుకొని మనం కూడా స్వామి పద సేవ చేద్దాం.

**మాధవ కేశవ మధుసూదన విష్ణు**
**శ్రీధరా పదనఖం చింతయామో వయం**

**1.వామన గోవింద వాసుదేవ ప్రద్యుమ్నా**
**రామ రామ కృష్ణ నారాయణాచ్యుతా**
**దామోదరానిరుద్ధ దైవపుండరీకాక్ష**
**నామత్రయాధీశ నమో నమో**

**2.పురుషోత్తమ పుండరీకాక్ష దివ్య**
**హరి సంకర్షణ యధోక్షజ**
**నరసింహ హృషీకేశ నగధర త్రివిక్రమ**
**శరణాగతరక్ష జయజయ సేవే**

**3.మహితజనార్దన మత్స్య కూర్మ వరాహ**
**సహజభార్గవ బుద్ధ జయతురగ కల్కి**
**విహితవిజ్ఞాన శ్రీవేంకటేశ శుభకరం**
**అహమిహ తవపద దాస్యమనిశం భజామి**

**తాత్పర్యము :**

మధు కులములో జన్మించినవాడా! మధు విద్య ద్వారా గ్రహించదగినవాడా! (మాధవ). కేశి అనే రాక్షసుని సంహరించినవాడా! అందమైన కేశ సంపద కలవాడా! (కేశవ). మధుడు అనే రాక్షసుని సంహరించినవాడా! (మధుసూదన). ప్రపంచమంతా నీ రూపమైనవాడా! (విష్ణు). లక్ష్మిని (సంపదను) ధరించినవాడా! (శ్రీధరా). నీ కాలిగోటి కాంతిని మేము స్మరిస్తుంటాము.

1. పొట్టివాడివై బలిని దానమడిగినవాడా! బలియొక్క గర్వమును సరిచేసినవాడా!

(వామన). గోవులను రక్షించినవాడా! వేదాంత వాక్యముల ద్వారా తెలియదగినవాడా! (గోవింద). ప్రపంచాన్ని మొత్తాన్ని ఆవరిస్తూ, సర్వజీవులయందు ఉండెడివాడా! మిక్కిలి ధనవంతుడా! (వాసుదేవ). ఆత్మలను వెలిగించేవాడా! యోగులు నిత్యానందంతో సుఖించే రూపం కలవాడా! (ప్రద్యుమ్నా). అందరిని ఆనందింపచేసేవాడా! (రామ). కృష్ణ ద్వైపాయన స్వరూపుడా! నీలి మేఘము వలె నల్లనివాడా! (కృష్ణ).

అనమానవైనవాడా! మాయాతీతుడా! నాశనము లేనివాడా! (నారాయణాచ్యుతా). దమమను ఇంద్రియ నిగ్రహముచే తెలియబడినవాడా! లోకాలు ఉదరమందు కలవాడా! యశోదచే కట్టబడిన దామము కలవాడా! (దామోదరా). ఇతరులచే అడ్డగింపబడనివాడా! (అనిరుద్ధ). హృదయ పద్మములో ఉండేవాడా! పద్మములవంటి కన్నులు కలవాడా! (పుండరీకాక్ష). మాధవ, కేశవ, నారాయణ అను మూడు నామములకు ప్రభువా! (నామత్రయాధీశ) నమస్తే.

2. ఉత్తముడైన పురుషుడా! గుణములచేత గొప్పవాడా! (పురుషోత్తమ). దివ్యుడా! (దివ్య). అజ్ఞానము వల్ల పుట్టిన సంసార దుఃఖాన్ని సమూలంగా నాశనం చేయువాడా! (హరి). ప్రపంచమంతా ప్రళయ కాలంలో కదిలిపోయినప్పటికీ (తనలో ఇమిడినప్పటికీ) ఏ విధమైన మార్పు లేనివాడా! (సంకర్షణ). స్వరూప స్థితిలో ఎప్పుడూ ఉండేవాడా! (అధోక్షజ). మానవుని, సింహాన్ని పోలిన అవయవాలు కలవాడా! (నరసింహా). ఇంద్రియములకు అధిపతియై, సర్వసాక్షియైన పరమాత్మా! ఆనందమునకు నిలయుడా! (హృషీకేశ). గోవర్ధన పర్వతమును ధరించినవాడా! (నగధర) మునులు మూడు లోకములకు త్రి అని పేరు పెట్టారు. ఆ మూడు లోకములలోను నడిచితివి (క్రమ). కనుక నువ్వు త్రివిక్రముడివి. (మూడడుగులతో ముల్లోకములు వ్యాపించినవాడా.) శరణన్న వారిని రక్షించేవాడా! నీకు జయము. జయము. నిన్ను సేవింతును.

3. గొప్పవాడా! (మహిత). దుఃఖము కల్గించువాడా! ఆనందము కల్గించువాడా! (జనార్దన). మత్స్య, కూర్మ, వరాహ, పరశురామ, బుద్ధ, కల్కి అవతారములు దాల్చినవాడా! (మత్స్య కూర్మ వరాహ సహజభార్గవ బుద్ధ జయతురగ కల్కి) విధింపబడిన విజ్ఞానము కలవాడా (విహిత విజ్ఞాన). శ్రీవేంకటేశా! శుభకరుడా! ఈ లోకంలో నీ పదసేవను నిరంతరము కోరుకొందును.

**పరమార్థం :**

ఈ కీర్తనలోని చాలా నామాలు విష్ణు సహస్రనామాల్లో ఉన్నాయి. పల్లవిలోని

"చింతయామి యూయం" (ధ్యానిస్తున్నాను మిమ్మలిని) పాఠంకంటె "చింతయామో వయం" (మేము ధ్యానిస్తున్నాము) పాఠం యుక్తియుక్తంగా ఉంది.

పదనఖం అంటే స్వామివారి కాలిగోరని అర్థం. పాదాలను ధ్యానిస్తున్నాను అంటే చాలు. కాలిగోర్లను అనటంలో కవి విశిష్టత ఉంది. "నఖదీధితి సంఛన్న సమజ్జన తమోగుణా" (జనుల యొక్క అజ్ఞానమనే చీకటి – ఆమె గోళ్ళ కాంతుల చేత తొలగిపోతుంది.) అని అమ్మకి లలిత సహస్ర నామావళిలో ఒక పేరు. కేశాది పర్యంతం దేవతలను ఆరాధించే ఈ పద్ధతిని అన్నమయ్య ఈ పాదంలో అనుసరించాడు.

నామ మహిమ

"యజ్ఞానాం జప యజ్ఞోస్మి" అని గీతలో స్వామి చెప్పిన మాట ప్రసిద్ధం. పేరుకి, దేవుడికి తేడా లేదు. "నారాయణస్య నామోచ్చారణ మాత్రేణ నిర్ధూత కలిర్భవతి" అని కలిసంతారణోపనిషత్తు చెబుతోంది. "నామ నామినో రభేదః" పేరుకి, దేవుడికి తేడా లేదు. ఈ కలియుగంలో మోక్షాన్ని పొందటానికి "నామస్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవ తరణే" నామ స్మరణాన్ని మించిన ఉపాయం ఇంకొకటి లేదని పెద్దలు చెప్పారు. అందుకే అన్నమయ్య ఇన్నిసార్లు స్వామి నామాలను తన కీర్తనలో ప్రస్తావించాడు.

నామత్రయాధీశ

'నామత్రయాధీశ' అను అన్నమయ్య సంబోధనలో ఇంకో విశిష్టత ఉన్నదని సముద్రాల లక్ష్మణయ్యగారు దూరవాణి సంభాషణలో పేర్కొన్నారు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను నామత్రయమను పదం సూచిస్తోంది. ఈ ముగ్గురికీ అధీశుడని – అనగా పరబ్రహ్మమని అన్నమయ్య సంబోధనలోని ఆంతర్యం.

విజ్ఞానము అంటే అనుభవ జ్ఞానం. ఆనంద ప్రాప్తి అనుభవ జ్ఞానం వలననే కలుగుతుంది. ఈ విజ్ఞానము మనలో కలిగించేవాడు కనుక స్వామిని 'విహిత విజ్ఞాన' అని అన్నమయ్య పేర్కొన్నాడు.

అన్నమయ్య పాటలన్నీ మాధవాలయాలు. ఈ 'మాధవ కేశవ' కీర్తనలో వినిపించే నామాలను గొంతెత్తి భక్తితో పలికితే స్వామితో అనుభవజ్ఞానం తప్పక కలుగుతుంది.



## *67. మాధవ ! భూధవ ! మదన జనక*

వేంకటేశుని రకరకాల విశేషణాలతో కీర్తిస్తూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది. (04-321)

**మాధవ భూధవ మదన జనక**
**సాధురక్షణ చతుర! శరణు శరణు**

**1.నారాయణాచ్యుతానంత గోవింద శ్రీ-**
**నారసింహా కృష్ణ నాగశయన**
**వారాహ వామన వాసుదేవ మురారి**
**శౌరి జయజయ శరణు శరణు**

**2.పుండరీకేక్షణ భువనపూర్ణగుణ**
**అండజగమన నిత్య హరి ముకుంద**
**పండరి రమణ రామ బలరామ పరమ పురుష**
**చండ భార్గవ రామ శరణు శరణు**

**3.దేవదేవోత్తమ దివ్యావతార నిజ-**
**భావ భావనాతీత పద్మనాభ**
**శ్రీవేంకటాచల శృంగారమూర్తి నవ**
**సావయవ సారూప్య శరణు శరణు**

**తాత్పర్యము :**

లక్ష్మీదేవికి మగడా! భూదేవికి మగడా! మన్మథునికి తండ్రియైన వాడా! మంచి వారిని రక్షించే విషయములో నేర్పరీ! నీకు శరణము. శరణము

1. ఓ నారాయణుడా! అచ్యుతుడా! అనంతుడా! గోవిందుడా! శ్రీ నరసింహుడా! కృష్ణుడా! ఆదిశేషునిపై పడుకొన్నవాడా! వరాహమూర్తీ! వామనుడా! వాసుదేవుడా! మురారీ! శౌరీ! నీకు జయము. జయము. నీకు శరణము. శరణము.

2. తెల్లతామరలవంటి కన్నులు కలవాడా! లోకమంతానిండిన గుణములు కలవాడా! గరుత్మంతుని వాహనముగా కలిగినవాడా ! శాశ్వతుడా ! హరీ! ముకుందుడా! పండరి క్షేత్రములో వెలసి అనందించువాడా! రాముడా! బలరాముడా! శ్రేష్ఠుడైనవాడా! భయంకర స్వభావము కలిగిన పరశురాముడా! నీకు శరణము. శరణము.

3. దేవతలకు నాయకుడైన ఉత్తముడా! గొప్పవైన అవతారములు కలవాడా! తనవయిన భావములతో ఎవరైనా భావించుటకు కూడా అతీతమయిన సత్వ రజస్తమో గుణములు దాటిన వాడా ! పద్మ నాభుడా! శ్రీవేంకట పర్వతములో నెలకొన్న శృంగార మూర్తీ! అందమయిన అవయవములతో కలిసిన రూపముతో సారూప్య ముక్తిని ఇచ్చువాడా! నీకు శరణము. శరణము.

**విశేషాలు :**

మాధవ భూధవ

1. లక్ష్మీ దేవి, భూదేవి అని రెండు రూపాలలో మనం పూజిస్తున్నాం. నిజానికి అమ్మవారు ఒక్కరే. అమ్మవారు మూడు స్థానాల్లో లయార్చ, భోగార్చ మరియూ అధికారార్చ అనే రూపాల్లో దర్శనమిస్తుందని పెద్దలు చెబుతారు. లయార్చ అంటే భగవంతుని యొక్క వక్షస్థలంపై ఉన్న రూపం. భోగార్చ అంటే భగవంతునికి ప్రక్కగా ఉండే రూపం. ఒంటరిగా భగవంతుడు ప్రక్కన లేని రూపంలో దర్శనమిచ్చే రూపం అధికారార్చ.

మన మానవ సంబంధాలు దేవునికి అంటగడితే కొన్ని ప్రశ్నలకు జవాబులు తెగవు. ఉదాహరణకి శ్రీ వేంకటేశ్వర సుప్రభాతంలో వేంకటేశుడు భూదేవి పుత్రి సీతకు భర్తగా చెబుతారు. అదే సుప్రభాతంలో భూదేవి భర్తగా చెబుతారు. రెండింటికి సమన్వయం కష్టం. నారాయణుడు భూదేవికి భర్త. శ్రీ రాముడు సీతకు భర్త. మన వావి వరుసలు సర్వము తానైన భగవంతునికి అంటకట్టకూడదు.

ఒకటికి రెండుసార్లు లేదా వేయిసార్లు దేవుని పొగడటం మనకు అలవాటు. లేకపోతే మనకు తృప్తి ఉండదు. అందుకే దేవుని ఇద్దరు భార్యలతో కలిపి పూజిస్తున్నాం. తత్వం ఒకటే అనే జ్ఞానం వచ్చేంతవరకు వేంకటేశుని ఇద్దరు భార్యలతో కలిసి పూజించే అలవాటు పెద్దలు చేసారు. అన్నమయ్య కూడా అందుకే 'పన్నిన లక్ష్మి భూమి పతివి నీవు' అన్నాడు. (నీకే నే శరణు అను నాగీత వ్యాఖ్య)

పండరి రమణ

పాండురంగడు మహారాష్ట్రములో పండరీపురములో వెలసిన దేవుడు. ఆ స్వామిని పండరి రమణ అని ఆత్మీయతతో అన్నమయ్య పిలుస్తున్నాడు. నామదేవుడు అనే భక్తునికి అలవడిన జ్ఞానము స్థిరమైనదా? కాదా?" యని పండరినాథుడు పరీక్షింపదలచి ఒకనాడు శునకరూపముతో అచటకు వచ్చాడు. కొందరు తరిమివేసారు. మరికొందరు దానిని దుడ్డు కర్రలతో బాదారు. ఆ శునకం పారిపోయి తిరిగి వచ్చి తటాలున నామదేవుని చేతిలోని రొట్టెను నోట గరచుకుని పారిపోవటం మొదలుపెట్టింది. నామదేవుడు చీదరించుకోకుండా నేయి, పంచదార అద్దిన రొట్టెముక్కలను దాని నోటికి అందించాడు. ఆ శునకము ప్రీతితో ఆ రొట్టెముక్కలు తిన్నది. తర్వాత నామదేవుని ఒడిలోని కుక్క దివ్యమంగళ విగ్రహమై నామదేవుని

అనుగ్రహించి మాయమైంది. ఇలా ఎంతోమంది భక్తులను అనుగ్రహించినవాడు పాండురంగడు.

"చలువ నీ మోవితేనె చవిగొన్నయందాకా. / పలుకులు చాలించు పండరంగి విట'లా(21-513) అని అన్నమయ్య పండరంగి రాయడిని చాలాచోట్ల కొనియాడాడు.

సారూప్య

జనన మరణ బంధ విమోచనం ముక్తి. అవిద్య నశించడం ముక్తి. ఇలాంటి ముక్తులు నాలుగు విధాలని కొందరు, ఐదు విధాలని కొందరు అంటారు.

ఐదు విధాల ముక్తులివి : 1. సార్ష్టి (అంటే స అష్టించే శక్తి, సమానాధికారం కలది అనే అర్థాలు ఉన్నాయి), 2. సాలోక్యం, 3. సామీప్యం, 4. సారూప్యం, 5. సాయుజ్యం. నాలుగు విధాలనే వారు 'సార్ష్టి'ని ఇందులో చేర్చరు. సార్ష్టి, సాయుజ్యం ఒకటే అని సూర్య రాయాంధ్ర నిఘంటువు వివరించింది.

తాను ఉపాసించే దేవతను నిరంతరం ధ్యానించడం చేత ఆ దేవతా రూపాన్ని యథాతథంగా ధరించడం "సారూప్యముక్తి". వైకుంఠంలో విష్ణువులా, మణిద్వీపంలో అమ్మలా, కైలాసంలో శివునిలా రూపాలు. పొందడం. నిరంతరం దేవునిలోకాన్ని భావించటం చేత ఆ దేవతాలోకంలో నివసించడం "సాలోక్యం". దేవతకి సమీపంలో ఉండగలిగే ముక్తి "సామీప్యం". దేవతకు భిన్నము కాకుండా దేవతలో విలీనం కావడం "సాయుజ్యం". అన్నమయ్య ఇందులో సారూప్యాన్ని కోరుకొన్నాడు ఈ కీర్తనలో. మనము కూడా అన్నమయ్యతో గొంతు కలిపి స్వామి వారిని ప్రార్థిద్దాం.



## *68. మామనునేతు (05-252)*

**మామనునేతు మాగతవానసి**
**కౌముక విద్యా కల చలరే**

**1.భిల్ల వధూ కుచ పీడన కుతుకో**
**త్ఫుల్ల కరాంబుజ భూషణ!**
**పల్లవ గోపక పరివృత! శరజన**
**వల్లభ! రతి పరవశ! చలరే**

**2.గోపీజన కుచ కుంకుమ పంకవి**
**లేపన మిళిత లలిత దేహ!**
**తాపకరణ ! సంతత బహు వినయా**
**లాప ! రూపమేళన! చలరే**

**3.పరవనితామణి పరతంత్రత్వాత్**
**పరుష నఖాంకిత పతిరసికిమ్**
**కురువక భూరుహ కుంజ గృహంతే**
**తిరువేంకట నగాధిప చలరే**

**తాత్పర్యము :**

నన్ను ఎందుకురా బతిమిలాడుకొంటావు!? (మామనునేతుం అసి) నీ దగ్గరికి వచ్చాను... నీ దగ్గరికి వచ్చాను – అని పది సార్లు చెప్పక్కర్లా. ఇప్పటికి వచ్చావురా! (ఆగతవాన్ రే) ఒప్పుకొంటున్నా. కామవిద్యాకళలు బాగా తెలిసినవాడా ! (కాముక విద్యాకళ) చేయి పట్టుకొని బతిమిలాడుకొంటావేమిటి? ఒరేయ్! ముందు ఇక్కడినుంచి వెళ్లి పో! (చలరే).

1. ఓ నరసింహ స్వామి వేషము వేసిన వాడా ! ఆ బోయ జాతి స్త్రీల స్తనములను మర్దించుటలో కుతూహలము చేత వికసించిన చేయి అనే పద్మము కలిగినవాడా! విటులైన గొల్లవాళ్లు చుట్టూ ఉన్నవాడా! (పల్లవ గోపక పరివృత) ఇతరులు కాక తన ప్రియురాలు మాత్రమే ఎరుగునట్లు తప్పు చేయు శరులకు నాయకుడా ! (శరజనవల్లభ). సంభోగములో పరవశించేవాడా! (రతి పరవశ !). ఒరేయ్! ముందు ఇక్కడినుంచి వెళ్లి పో! (చలరే).

2.ఓ కృష్ణావతారము ఎత్తినవాడా ! కౌగిలింతలలో గోపికల స్తనముల యొక్క కుంకుమలు చందనాదులు అంటుకొనుట చేత అందమైన శరీరము కలవాడా! (గోపీజన కుచ కుంకుమ పంకవిలేపన మిళిత లలిత దేహ!). తాపము కలిగించేవాడా! (తాపకరణ !) ఎప్పుడూ నక్క వినయాలు చూపిస్తూ మాట్లాడేవాడా ! (సంతత బహు వినయాలాప) అనేక రూపాలతో కలిసేవాడా! (రూపమేళన) ఒరేయ్! ముందు ఇక్కడినుంచి వెళ్లి పో! ( చలరే).

3. ఓ వేంకటేశుడా! నువ్వు ఇతర స్త్రీలకు బానిసవి కనుక (పరవనితామణి పరతంత్రత్వాత్). వాళ్ళు నీతో ఆడుకొంటూ వాళ్ల పదునైన గోళ్లు గుచ్చుతారు. ఆ నఖక్షతాల గుర్తులు కలిగినవాడా! (పరుష నఖాంకిత) ఇలాంటి దాసుడవైన నిన్ను ఎవడ్రా స్వామి, పతి అన్నది?! (పతిరసికిమ్) (నువ్వు దాసుడివిరా అని వెక్కిరింత). నీ ఇల్లు ఇక్కడ కాదురా! ఆడవాళ్లతో క్రీడించే గోరంట్ల చెట్ల పొదరిళ్లు నీ ఇళ్లు. (కురువక భూరుహ కుంజ గృహంతే). ఓ శుభమైన వేంకట పర్వతముపై ఉండేవాడా ! ముందు ఇక్కడినుంచి వెళ్లి పో! ( చలరే).

**విశేషాలు :**

అవస్థా భేదాలను బట్టి శృంగార రసంలో ఎనిమిది రకాల నాయికలుంటారు. భర్త పరస్త్రీ కాంక్ష లేకుండా తనపైనే అనురాగంతో తనకు అధీనుడై ఉంటే ఆ నాయిక 'స్వాధీన పతిక'. తన ప్రియుడు వచ్చే సమయానికి ఇంటిని, గదిని, తననూ అలంకరించుకొని ఉండేది 'వాసక సజ్జిక'. విభుడు పరకాంతలోలుడై రాత్రంతా గడిపి, తెల్లవారుజామున ఇంటికి రాగా ఈసడించి కసరి కొట్టి తగాదాలాడేది 'ఖండిత'. ఆ తరువాత పశ్చాతాప పడేది 'కలహాంతరిత'. ప్రియుని రాక కోసం విరహంతో ఉ ండేది 'విరహోత్కంఠిత'. ఇతర ప్రాంతానికి వెళ్లిన ప్రియుని కోసం విరహంలో కృశించేది 'ప్రోషిత భర్తృక'. మదనపీడితయై, ప్రియుణ్ణి అన్వేషిస్తూ వెళ్లేది 'అభిసారిక'. సంకేత స్థలానికి వెళ్లి ప్రియుడు కనిపించక బాధ పడేది 'విప్రలబ్ద'. అన్నమయ్య సాహిత్యంలో వీళ్లందరూ మనకు కనబడతారు. ప్రస్తుత కీర్తనలో ఉన్నది ఖండిత.

శఠజనవల్లభ

అనుకూలుcడు, దక్షిణుcడు, దృష్టుcడు, శఠుcడు అని శృంగార నాయకులు నలుగురు. 1. దక్షిణుడు (భార్య లందరి యందును సమాన ప్రేమ కలవాడు). 2. అనుకూలుడు (పెక్కు మంది భార్య లున్నను ఒక్కతె యందే అనురాగము కలవాడు). 3. దృష్టుcడు (తన తప్పు బయలు పడినను భయ పడని వాడు). 4. శఠుడు (ఇతరులు కాక తన ప్రియురాలు మాత్రమే ఎగునట్లు తప్పు చేయువాడు). ఇక్కడ నాయిక స్వామివారిని శఠులకు నాయకునిగా చెబుతోంది.

ముగింపు

అన్నమయ్య శృంగారానికి "అబ్బే" అని పెదవి విరిస్తే – స్వామి వారు కూడా అలా అనుకొనే భక్తుడిని చూసి "అబ్బా! ఇంకా వీడు మధుర భక్తి సంప్రదాయంలో ఎదగలేదురా!" అని నవ్వుకొంటాడు.



## *69. యోగి భోగి నటనం కురు*

యోగులకు, భోగులకు వేంకటేశ్వరుడు అనందం కలిగిస్తాడని అన్నమయ్య ఈ సంస్కృత కీర్తనలో వర్ణిస్తున్నాడు. (సంపుటము 11–588)

**యోగి భోగి నటనం కురు వు(ఉ)ల్లాసాననమోహన**
**సాగరోద్భవకన్యకాపతి సారస శ్రీవేంకటగిరియోగి**

**1. లీలానక్షత్రజాలాధికరంద**
**మాలాత్రైవిక్రమాకారయోగి**
**హాలాహలకర కోలాహలకర**
**శూలాయుధవంద్య పరిపూర్ణయోగి**

**2. కాళీవినుత ప్రహేళిచరితాహి**
**మౌళిఘనసారవిన్యస్తయోగి**
**గరుడపక్షివాహగమనవిహారి**
**గురునాగశైలేశ గోరక్కు రే**

**3. మురళీనాదశృంగ మోహనమురారి రే**
**కరుణానందసాగరశాయి రే**
**పరమ శ్రీవేంకటపతియవతార**
**నరరూపగోపికానాథ గోరక్కు రే**

**తాత్పర్యము :**

యోగులకు, భోగులకు ఆనందము కలిగించే నాట్యాన్ని చేయి! వికాసము పొందిన మోముతో అందరిని ఆనందింపచేయువాడా! సముద్రమునుండి పుట్టిన లక్ష్మీదేవికి భర్తయైనవాడా! చంద్రునిలా ఆహ్లాదము కలిగించువాడా! శ్రీవేంకట పర్వతముపై ఉన్న యోగీశ్వరుడా!

1. లీలగా నక్షత్ర సమూహాన్ని పైన కత్తుల (బుట్టల) మాలగా ధరించిన త్రివిక్రమావతారాన్ని పొందిన యోగీ! (= మూడు లోకములను మూడడుగులుగా కొలిచి యాక్రమించినవాడు త్రివిక్రముడు – వామనుడు). పాల సముద్రమున పుట్టిన విషమునకు కారకుడా! తరువాత అమృతమును సృష్టించి దేవతలలో ఉత్సాహపు కలకలమును సృష్టించినవాడా! శూలము చేతియందు ధరించిన శివునిచే నమస్కరింప బడినవాడా! పరిపూర్ణత్వము పొందిన యోగీ!

2. పార్వతీదేవిచే నమస్కరింపబడినవాడా! నాగాభరణములను శిరస్సున ధరించి, కర్పూరమువలె శాంతిని ప్రసాదించే యోగీ! గరుడ పక్షిని వాహనముగా చేసుకొని విహరించువాడా! పెద్దదైన శేషాచలమునకు ప్రభువా! యోగాచార్యుడా!

3. పిల్లనగ్రోవి మ్రోత అను కొండ కొమ్ముపై విహారము చేసే ఓ మురారీ! దయ అను ఆనంద సముద్రములో శయనించువాడా! ఓ శ్రేష్ఠుడైన శ్రీవేంకటేశ్వరుని అవతారము ధరించినవాడా! గోపికలను మానవ రూపములో ఉన్న మునులకు ప్రభూ! ఓ యోగీశ్వరుడా!

**విశేషాలు :**

అధి

అన్నమయ్య ఈ గీతంలో అధికరండ అని ప్రయోగించాడు. ఇందులో అధి అనేదానిని ఉపసర్గ అంటారు. దీనికి విడిగా ప్రయోగములేదు. అది అనేదానిని ఇంకో పదంతో కలిపి ప్రయోగించాలి. అధి అంటే 1. అధిక్యము, 2. అతిశయము, 3. పై భాగము అను అర్థాలు చెప్పుకోవాలి. అధికరండ లోని అధికి 'పైభాగము' అను అర్థము వస్తుంది.

కాళి : "కాళ వర్ణత్వాత్ కాళీ. నీల వర్ణము కలది కనుక పార్వతీదేవికి కాళి అని పేరు.

గోరక్కు

అన్నమయ్య ఈ కీర్తనలో వాడిన గోరక్కు అనే పదం యోగానికి సంబంధించింది. వామాచార (= వేదవిరుద్ధమైన ఆచారము) తత్పరుడయిన యోగిని గోరక్ లేదా గోరక్కుడు అంటారు. గోరక్కుడు అనేవాడు నవనాథులలో నొకడు. మత్స్యేంద్రనాథుని ప్రధాన శిష్యుడు. 'గుణరత్న నిధియును గోరక్కుడనగ' అని నవనాథ చరిత్రలో ఉంది. (పు. 254) గోరక్ష అనే పదాన్ని మరాఠీ పదంగా భాషా చారిత్రక వ్యాసావళిలో (శ్రీనాథ యుగము – అన్యదేశ్యములు 185 పే.) పేర్కొన్నారు. పతంజలి మహర్షి కంటే ముందుగా యోగశాస్త్రాన్ని బోధించినవాడు గోరక్‌నాథుడు అని ఒక ప్రతీతి.

వేద నిలయుడైన వేంకటేశ్వరుని అన్నమయ్య వేద విరుద్ధ మతాచారుడయిన గోరక్కుగా ఎందుకు సంబోధించాడని ప్రశ్న. వేద విరుద్ధమతాన్ని బోధించిన బుద్ధుని దశావతారాలలో ఒకనిగా అన్నమయ్య అనేక కీర్తనలలో చెప్పాడు. బుద్ధునిలానే గోరక్కుడు కూడా. అన్నీ ఆయన స్వరూపాలే.

యోగి భోగి నటనం కురు

వేంకటేశ్వర స్వామిని యోగిగా పేర్కొని 'స్వామీ! మా హృదయంలో నాట్యము చేయి!' అంటే "అమ్మయ్య" అని సంతోషపడే వాళ్లము. కాని అన్నమయ్య స్వామివారిని యోగిగాను, భోగిగాను మా హృదయాలలో నాట్యము చేయవయ్యా అంటున్నాడు. యోగి, భోగి రెండు శబ్దాలు విరుద్ధాలు. ఇక్కడ ఒక సూక్ష్మము ఉంది.

యోగి – భోగి ఇద్దరూ అనుభవించేది ఆనందమే. భోగిది పరిమితమైన ఆనందము. యోగిది అపరిమితానందము. భోగిగా జీవనాన్ని మొదలుపెట్టిన జీవుడు యోగిగా పరిణతి చెందకపోతే అతని జీవితానికి సార్థకము లేదు. ఈ సందేశము

యోగి భోగి పద ప్రయోగాలలో ఉంది.

అన్నమయ్య కీర్తనల్లో ఒకచోట చెప్పిన విశిష్ట పదానికి ఆయన ఇంకో కీర్తనలో ఎక్కడో అర్థ వివరణ ఉంటుంది. ఈ కీర్తనలోని యోగి పదము అలాంటిదే. యోగి అనే పదానికి వివరణ “తానె తానే యిందరి గురుడు । సానబట్టిన భోగి జ్ఞాన యోగి ॥” అను కీర్తనలో ఉంది. పూర్తి కీర్తన ఇది.

తానె తానే యిందరి గురుడు । సానబట్టిన భోగి జ్ఞానయోగి ॥

అపరిమితములైన యజ్ఞాల వడిచేయ । బ్రపన్నులకు బుద్ధి వచరించి ।
తపముగా ఫలపరిత్యాగము సేయించు । కవురుల గరిమల కర్మయోగి ॥

అన్ని చేతులను బ్రహ్మార్పణవిధి జేయ । మన్నించు బుద్ధులను మరుగజెప్పి ।
ఉన్నతపదమున కొనరగ గరుణించు । పన్నగశయనుడే బ్రహ్మయోగి ॥

తనరగ గపిలుడై దత్తాత్రేయుడై । ఘనమైన మహిమ శ్రీవేంకటరాయడై ।
వొనరగ సంసార యోగము గృపసేయు । అనిమిషగతుల నభ్యాసయోగి ॥

(4–355)

సానబట్టు అంటే వాడిచేయుట. నిశితముగా పరిశీలించే నేర్పుకలిగిన భోగి వేంకటేశ్వరుడు. భోగము ఆనందపు అనుభూతిలో నేర్పును నెమ్మదిగా తగ్గిస్తుంది. కాని వేంకటేశ్వర భోగి దగ్గర అలాంటిది కుదరదు. తనకు భోగాలు కల్పించి రకరకాల సేవలు చేసే వారి మనస్సులలో ఎంతవరకు తన మీద భక్తి ఉందో స్వామి నిశితంగా పరిశీలిస్తాడు. గొప్పకోసం, ఆడంబరం కోసం తనకు భోగాలు చేస్తున్నారా? నిజంగానే పరిపూర్ణ భక్తితో చేస్తున్నారా అని గమనిస్తాడు. తగ్గట్టుగా అనుగ్రహిస్తాడు. అందుకే స్వామిని సానబట్టిన భోగి అన్నాడు అన్నమయ్య.

యోగాభ్యాసము చేయువాడు యోగి. స్వామివారు మామూలు యోగి కాడు. కర్మయోగి. లెక్కలేనన్ని యజ్ఞాలను వేగంగా చేయటానికి శరణాగతులకు మనస్సులో ఆ బుద్ధి వచ్చేటట్లు చేస్తాడట. నిష్కాముడై విహిత కర్మలను చేసేవాడిని కర్మయోగి అంటారు. తన భక్తులను కూడా కర్మయోగులుగా, జ్ఞానయోగులుగా చేస్తాడని ఇక్కడ భావము. వేంకటేశ్వరుడు శ్రీమత్ భగవద్గీతలో చెప్పిన జ్ఞానయోగి. జ్ఞానమంటే పరమాత్మని తెలిసికోవటము. ఎటువంటి వికారాలు లేకుండా బ్రహ్మములో మనసును కేంద్రీకరించుట జ్ఞానయోగము. జ్ఞానయోగి శరీరానికి సంబంధించిన విషయములలో శ్రద్ధచూపించుడు. శరీరబాధలను తనకు కావని భావిస్తుంటాడు. యోగము చేత

లభ్యమయ్యే పరబ్రహ్మమైన వేంకటేశ్వరుని జ్ఞానయోగి, కర్మయోగి అని చెప్పుటలో సర్వమూ అతని స్వరూపమని కవి హృదయముగా తలచాలి.

మురళీనాదశృంగ మోహనమురారి

మురళి అనే పేరు వస్తే చాలు కవులు మైమరచిపోతారు. 'స్ఫురదధరకలిత మురళీనాద సుధయా' అని నారాయణ తీర్థులు పొంగిపోయారు. శరత్కాలములో యమునా నదీ ఒడ్డున పౌర్ణమినాటి పండువెన్నెలలో బృందావనములో శ్రీకృష్ణుడు త్రిభంగిగా నిలబడి, అందంగా వేణువును పూరిస్తుంటే అందరూ పరవశించిపోయేవారు. దీనిని అన్నమయ్య పిల్లనగ్రోవి మ్రోత అను కొండ కొమ్ముపై విహారము చేసే ఓ మురారీ! అన్నాడు. మురళీనాదమనేది ఒక శిఖరము. దాని మీద విహారము చేసే స్వామి అనుగ్రహము పొందాలంటే మన భక్తి కూడా శిఖరస్థాయికి చేరాలని సందేశము.

నరరూప గోపికానాథ

గోపికలు పూర్వ జన్మలో మహా పండితులు, మునులు. వారి అదృష్టముకొద్దీ స్వామి కృష్ణావతారము ఎత్తినప్పుడు గోపికలుగా వారు జన్మించారు. ఇట్లు భగవంతుడైన కృష్ణుడాత్మారాముండయ్యును గోపసతు లెంద ఱందఱకు నిందఱై నిజప్రతిబింబంబుల తోడం గ్రీడించు బాబు పోలిక రాసకేళి సలిపిన. (భా. 10.1-1099.వ.) అని పోతన్నగారు గోపికలు స్వామివారి ప్రతిబింబాలని విస్పష్టంగా చెప్పారు. అదొక యోగమాయ. అందుకే 'యోగి భోగ నటనం కురు' కీర్తనలో యోగ ప్రసక్తి ఉన్న నరరూపగోపికానాథ సంబోధన.



## *70. రాజీవ నేత్రాయ రాఘవాయ నమో (02-273)*

**రాజీవ నేత్రాయ రాఘవాయ నమో ।**
**సౌజన్య నిలయాయ జానకీశాయ ॥**

**1.దశరథ తనూజాయ తాటకా దమనాయ ।**
**కుశిక సంభవ యజ్ఞ గోపనాయ ।**
**పశుపతి మహా ధనుర్భంజనాయ నమో ।**
**విశద భార్గవరామ విజయ కరణాయ ॥**

**2. భరిత ధర్మాయ శూర్పణఖాంగ హరణాయ।**
**ఖరదూషణాయాది రిపు ఖండనాయ ।**
**తరణి సంభవ సైన్య రక్షకాయనమో ।**
**నిరుపమ మహా వారినిధి బంధనాయ॥**

**3. హత రావణాయ సంయమి నాథ వరదాయ ।**
**అతులిత అయోధ్యా పురాధిపాయ ।**
**హితకర శ్రీ వేంకటేశ్వరాయ నమో ।**
**నితత వావిలిపాటి వీర రామాయ ॥**

**తాత్పర్యము :**

రాజును (చంద్రుని) అనుసరించి జీవించునది రాజీవము. అంటే ఎర్రకలువ. అటువంటి నేత్రములు కల రామునికి నమస్కారం. మంచితనానికి నిలయంగా ఉండే రామునికి నమస్కారం. రఘువంశములో జన్మించినవాడు రాఘవుడు. అటువంటి రామునికి నమస్కారము. జనకుని కుమార్తె అయిన జానకికి ప్రభువయిన రామునికి నమస్కారం.

1. దశరథుని కుమారునికి, తాటకిని అణచిన రామునికి నమస్కారం. కుశికునికి పుట్టినవాడు విశ్వామిత్రుడు. అతని యజ్ఞమును కాపాడిన రామునికి నమస్కారం. పాశము (తాడు) ఉంటుంది కనుక పశువు అన్నారు. మానవునికి కూడా పాశాలు (బంధాలు) ఉంటాయి కనుక మానవులు పశువులు. మానవ జీవులనే పశువులకు పతి శివుడు. ఆయన ధనుస్సును విరిచిన రామునికి నమస్కారము. భృగువంశమున పుట్టినవానిని భార్గవుడు అంటారు. ఇక్కడ పరశురాముడు. ఆయనపై విజయాన్ని సాధించిన రామునికి నమస్కారము.

2. భరితము అంటే పూరితము. పూరించబడిన ధర్మము కలవాడు రాముడు. అంటే ధర్మ స్వరూపుడని భావము. అటువంటి రామునికి నమస్కారము. శూర్పణఖ యొక్క అవయవములను ఖండించుటకు కారకుడయిన రామునికి నమస్కారము. మంచి మెడ గలవానిని సుగ్రీవుడంటారు. పార్వతి దేవి శాపము వలన స్త్రీ గా మారిన ఋక్షవిరజాడను వానరుని వాలప్రదేశమునందు ఇంద్రునిరేతస్సు. మెడ ప్రదేశములో సూర్యుని రేతస్సు పడింది. అపుడు వాలప్రదేశమున పడిన రేతస్సు వల్ల వాలి, మెడలో పడిన రేతస్సు వలన సుగ్రీవుడు పుట్టారు. అంటే సుగ్రీవుని తండ్రి సూర్యుడు. ఈ విషయాన్ని అన్నమయ్య ఇక్కడ ప్రస్తావిస్తున్నాడు. సూర్యుని వలన సంభవించిన సుగ్రీవుని సైన్యమును రక్షించిన రామునికి నమస్కారము. పోలికలేని మహా సముద్రమును బంధించిన రామునికి నమస్కారము.

3. రావణుని సంహరించిన రామునికి నమస్కారము. సంయమి నాథులంటే ముని శ్రేష్ఠులు. వారికి వరములు ఇచ్చే రామునికి నమస్కారము. సాటిలేని అయోధ్యా

నగరానికి చక్రవర్తయిన రామునికి నమస్కారము. అందరికి మేలును కలిగించే వేంకటేశ్వరుని అవతారములో ఉన్న రామునికి నమస్కారము. చిత్తూరు జిల్లా మదనపల్లి తాలూకాలో ఉన్న వాయిల్పాడు గ్రామంలో రామచంద్రుడిని అన్నమయ్య వావిలిపాటి రామచంద్రునిగా చెబుతాడు. వ్యాప్తి కలిగిన వావిలిపాటి వీర రామచంద్రునికి నమస్కారము.



## *71. రాధామాధవ రతిచరితమితి*

రాధాకృష్ణుల విహారాలను ఆధ్యాత్మికతతో ముడివేస్తూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది. (5 - 166)

**రాధామాధవరతిచరితమతి**
**బోధావహం శ్రుతిభూషణం ॥**

**1.** గహనే ద్వావపి గత్వా గత్వా
రహసి రతిం ప్రేరయతి సతి ।
విహరతస్తదా విలసంతౌ
విహతగృహాశౌ వివశౌ తౌ ॥

**2.** లజ్జాశబల విలాసలీలయా
కజ్జలనయన వికారేణ ।
హృజ్జావ్యవహృత(హిత) హృదయా రతి
స్సజ్జా సంభ్రమచపలా జాతా ॥

**3.** పురతో యాంతం పురుషం వకుళైః
కురంటకైర్వా కుటజైర్వా ।
పరమం ప్రహరతి పశ్చాల్లగ్నా-
గిరం వినాపి వికిరతి ముదమ్ ॥

**4.** హరి సురభూరుహ మారోహతీవ స్వ
చరణేన కటిం సంవేష్ట్య ।
పరిరంభణ సంపాదితపులకై
స్సరుచిర్జాతా సుమలతికేవ ॥

**5.** విధుముఖదర్శన విగళితలజ్జా-
త్వధరబింబఫలమాస్వాద్య
మధురోపాయనమార్గేణ కుచౌ
నిధివద్దత్వా నిత్యసుఖమితా ॥

**6.** సురుచిరకేతక సుమదళ నఖరై-
ర్వర చిబుకం సా పరివర్త్య
తరుణిమ సింధౌ తదీయదృగ్జల-
చరయుగళం సంసక్తం చకార ॥

**7.** వచన విలాసైర్వశీకృత్య తం
నిచులకుంజ మానితదేశే ।
ప్రచురసైకతే పల్లవశయనే-
రచిత రతికళా రాగేణాస ॥

**8.** అభినవకల్యాణాంచితరూపా-
వభినివేశ సంయతచిత్తౌ ।
బభూవతు స్తత్పరౌ వేంకట
విభునా సా తద్విధినా స తయా ॥

**9.** సచ లజ్జావీక్షణో భవతి తం
కచభర గంధం ధూపయతి ।
నచలతిచేన్మానవతీ తథాపి
కుచసంగాదనుకూలయతి ॥

**10.** అవనతశిరసాప్యతి సుభగం
వివిధాలాపైర్వివశయతి ।
ప్రవిమల కరరుహరచన విలాసై
ర్భువనపతిం తం భూషయతి ॥

**11.** లతాగృహమేళనం నవసై
కతవైభవ సౌఖ్యం దృష్ట్వా ।
తతస్తతశ్చరసౌ కేలీ-
వ్రతచర్యాం తాం వాంఛంతౌ ॥

**12.** వనకుసుమ విశదవరవాసనయా-
ఘనసారరజోగంధైశ్చ ।
జనయతి పవనే సపది వికారం-
వనితా పురుషౌ జనితాశౌ ॥

**13.** ఏవం విచరన్ హేలా విముఖ-
శ్రీవేంకటగిరి దేవోయమ్ ।
పావనరాధాపరిరంభసుఖ-
శ్రీ వైభవసుస్థిరో భవతి ॥

**తాత్పర్యము :**

రాధామాధవుల సంభోగ చరిత్ర చాలా (చరితమతి) జ్ఞానాన్ని కలిగిస్తుంది. (బోధావహం) వేదాలకే అలంకారం. చెవులకి చాలా హాయి కలిగిస్తుంది. (శ్రుతిభూషణం) (ప్రపంచము లయమయ్యే సమయములో సర్వేశ్వరుని వేదాలు చేసిన స్తోత్రాన్ని శ్రుతిగీతలు అంటారు. అన్నమయ్య తన కీర్తన కూడా శ్రుతి భూషణమంటున్నాడు.)

1. ఎరుగరానిది, చొరరానిదయిన ప్రదేశములో (గహనే) ఇద్దరూ కూడా (ద్వావపి) వెళ్ళి, వెళ్ళి- (గత్వా గత్వా) ఏకాంతంలో (రహసి) మదనుడు రతిని ప్రేరేపిస్తుంటే (రతిం ప్రేరయతి సతి) చక్కగా ప్రకాశించే ఆ ఇద్దరూ (విలసంతౌ) అప్పుడు (తదా) విహరిస్తున్నారు (విహరతః) ఇళ్ల గురించిన మాట మరిచిపోయి (విహతగృహాశౌ) పరవశులై వారిద్దరూ (వివశౌ తౌ) విహరిస్తున్నారు.

2. ఎక్కువ సిగ్గుతో, ( లజ్జాశబల) విలాసముల లీలతో (విలాసలీలయా) కాటుకకంటి యొక్క వికారముతో (శృంగారములో కాటుక చెదరటం ఇక్కడ వికారము) హృదయములో పుట్టిన మన్మథునితో ఎడములేని (హృజ్జావ్యవహృత) హృదయము కలిగిన రాధ రతికి సిద్ధమై, సంభ్రమముతో, చంచలత్వము కలిగినది అయినది.

3. తనకు ముందుగా వెళుతున్న కృష్ణుడనే పరమపురుషునిపొగడ పూలతో (వకుళైః)

తుమ్మి పూలతో, ( కురంటకైర్వా) వర్షర్తువులో పూచేకొండ మల్లె పూలలతో (కుటజైర్వా) వెనుకగా వెళుతూ (పశ్చాల్లగ్నా) రాధాదేవి బాగా కొడుతున్నది. (పరమం ప్రహరతి) మాటలు ఏమీ లేకుండానే తన సంతోషాన్ని చేష్టల ద్వారా చెబుతోంది.

4. కృష్ణుడనే కల్పవృక్షాన్ని ఎక్కేదానిలా తనపాదాలను ఆయన నడుము మీద ఉంచింది. ఆ కౌగిలింతలో సంపాదించిన పులకలతో పూలతీగలా (సుమలతికేవ) కాంతితో రాధమ్మ ప్రకాశించింది.

5. చంద్రబింబంలాంటి శ్రీ కృష్ణుని ముఖాన్ని చూసిన తరువాత జారిపోయిన సిగ్గు కలిగినదై కృష్ణునియొక్క పెదవి అనే దొండపండును ఆస్వాదించి తియ్యనైన ఎదురు బహుమతులు ఇచ్చే మార్గములో తన రెండు స్తనములను రెండు నిధులులా కృష్ణునికి ఇచ్చి రాధమ్మ నిత్య సుఖాన్ని పొందుతోంది.

6. అందమైన మొగలిపూల రేకులవంటి తన గోరులతో శ్రేష్ఠమైన కృష్ణుని గడ్డాన్ని ఆ రాధమ్మ వెనుకకు తిప్పింది. తన యౌవనమనే సముద్రములో కృష్ణమూర్తి కన్నులనే రెండు చేపలను బాగా తిరిగేటట్టు చేసింది.

7. అందమైన మాటలతో ఆ కృష్ణుని వశము చేసుకొని ఎర్రగన్నేరు పొదలు గౌరవించిన ప్రదేశములో, విశాలమయిన ఇసుక తిన్నెలలో, చిగురు పడకల మీద సంభోగ కళలను రచిస్తూ ఆ రాధమ్మ అనురాగము కలిగినది అయింది.

8. కొత్తగా పెళ్లి చేసుకొన్న మధుర రూపాలు కలిగిన వారయి చొరవ, పట్టుదల కలిగిన మనస్సు కలిగిన వారయి, కృష్ణుడనే వేంకటేశ్వరుని కలిసిన రాధ అనే అలమేలు మంగమ్మ ఆ రతి విధానాలలో మునిగిపోయారు.

9. ఆ కృష్ణుడు సిగ్గుతో కలిగిన చూపులు కలిగిన వాడయ్యాడు. అతనిచేత రాధమ్మ తన జుట్టు వాసనను ఆఘ్రాణింపచేస్తోంది. ఇంత చేసినా ముందు కార్యక్రమానికి అయ్యగారు కదలక పోతే అభిమానవతి అయిన ఆ రాధ కొంచెం అలిగినప్పటికీ, ఆయనమీద ప్రేమతో తన స్తనాల సాన్నిధ్యము సిగ్గుతో నిండిన కృష్ణయ్యకు తలదాచుకోవటానికి అనుగ్రహిస్తోంది.

10. తనకు ఇష్టుడైన, తలదించుకొన్న కృష్ణమూర్తిని అనేక నిండు మాటలతో పరవశుని చేస్తోంది. స్వచ్ఛమైన నఖ క్షతాల విలాసాలతో, లోకాలకు అధిపతి అయిన కృష్ణమూర్తి శరీరము మీద అలంకారాలు పెడుతోంది.

11. తమ పొదరింటి కూడికను, కొత్తదైన ఇసుకతిన్నెల వైభవంతో ఉన్న సుఖాన్ని చూసి శృంగారకేళి అనే వ్రతాన్ని మళ్లీ మళ్లీ చేయటానికి ఇష్ట పడినవారై ఆ రాధా కృష్ణులు కొత్త కొత్త ప్రదేశాలకోసం అటు ఇటు తిరుగుచున్నారు.

12. చక్కనైన అడవిపూల వాసనల చేత, కమ్మనైన పచ్చ కర్పూరపు రేణువులు కలిసిన వాసనలచేత అప్పుడు (సపది) మన్మథ వికారము కలుగుతుండగా, కొత్తగా పుట్టిన ఆశలతో ఆ రాధాకృష్ణులు క్రీడిస్తున్నారు.

13. ఈ రకంగా శ్రీ వేంకటేశ్వరుడనే కృష్ణుడు ఇతర విలాసాలయందు విముఖుడై అలమేలుమంగమ్మ అనే రాధమ్మ కౌగిలి సుఖంలో ఆ లక్ష్మీ వైభవములో సుస్థిరంగా ఉన్నాడు.

విశేషాలు :

అన్నమయ్య ఈ కీర్తన మొదట్లో బోధావహం (జ్ఞానాన్ని కలిగిస్తుంది) అన్నాడు. ఈ కీర్తన మధుర భక్తి జ్ఞానాన్ని కలిగిస్తుంది. ఈ కీర్తన మొత్తం సారాంశం ఇదే. ప్రేయసీ ప్రియుల శృంగార వర్ణనలు– జీవేశ్వరుల ఐక్యతకు, తపనకు చిహ్నాలు. సంపూర్ణ ఆత్మార్పణే ఈ కీర్తనలోని రహస్యం. ఆ మహోన్నత అర్పణలోనే దైవాన్ని కదిలించే గొప్ప శక్తి ఉంది. ఆ ప్రేమకే దైవం కట్టుబడుతుంది.

దేవీభాగవతం రాధాదేవి ఉపాసనను చెప్పింది. గోలోకంలో రాధాకృష్ణులను దేవతలందరూ పూజించారు. గానరసంలో రాధాకృష్ణులు కరగి జలమై ప్రవహించారట. ఇప్పటికీ రాత్రివేళలో రాధాకృష్ణులు బృందావనానికి వస్తారని నమ్ముతుంటారు.

మండపాక పార్వతీశ్వరకవి తన 'రాధాకృష్ణ సంవాదము' అనే కావ్యంలో తన రాధాకృష్ణ ఉపాసనను యిలా చెప్పారు.

"మురళి, ప్రణవంబు గోపికల్ ముక్తజశము
గోగణంబు చిరంతన గోగణంబు
రాధ మూల ప్రకృతి లక్ష్మి బ్రహ్మవిద్య
కృష్ణు డానందమయ తత్త్వమిదె నిజంబు"

కృష్ణుడు ఆనందమయ రూపం, లక్ష్మి బ్రహ్మవిద్యా జ్ఞానం, రాధ ప్రకృతి స్వరూపం, గోపికా సమూహము ముక్తిజనం, అన్నమయ్య చెప్పినట్లు ఈ రాధా కృష్ణ స్మరణము వేదాలకే అలంకారం. చెవులకి చాలా హాయి కలిగిస్తుంది.( శ్రుతిభూషణం). మనం కూడా దీనిని దృఢంగా నమ్మి ప్రచారం చేద్దాం.



## 72. రామం ఇందీవర శ్యామం

(శ్రీరామచంద్రుని సేవా భావనలో అన్నమయ్యలో ఆనందంతో ఉప్పొంగిన సంస్కృత కీర్తన ఇది. (రేకు 377, సంపుటము 04-452 కీర్తన)

**రామమిందీవర శ్యామం పరాత్పర**
**ధామం సుర సార్వభౌమం భజే**

**1. సీతా వనితా సమేతం**
**స్ఫీత వానర బలవ్రాతం**
**పూత కౌసల్య సంజాతం**
**వీత భీత మౌని విద్యోతం**

**2. వీరం రణరంగ ధీరం**
**సౌరధర్మ కులోద్ధారం**
**క్రూర దానవ సంహారం**
**శూరాధారం సుగుణోదారం**

**3. పావనం భక్త సేవనం**
**దైవిక విహగవ ధావనం**
**రావణానుజ సంజీవనం**
**శ్రీవేంకట పరిచిత భావనం**

**తాత్పర్యము :**

నల్లని కలువలా మెరిసిపోయే నలుపురంగు కలవానిని (ఇందీవర శ్యామం), శ్రేష్ఠములయిన వాటిలో శ్రేష్ఠమయిన నిలయము కలవానిని (పరాత్పర ధామం), దేవతల చక్రవర్తిని, రాముని సేవింతును.

1. సీతాదేవితో కలిసిన వాడిని, అధికమైన కోతుల సమూహము కలవానిని, పవిత్రురాలయిన కౌసల్యాదేవికి పుట్టిన వానిని, తొలగిన భయము కల దండకారణ్య మునుల గుంపు మధ్య ప్రకాశించేవానిని, రాముని సేవింతును.

2. వీరుని, యుద్ధరంగంలో స్థిరముగా ఉండేవానిని, గొప్పదయిన ధర్మాన్ని, రఘుకులాన్ని ఉద్ధరించిన వానిని, క్రూరులయిన రాక్షసులను సంహరించిన వారిని, పరాక్రమ వంతులకు ఆధారమైనవానిని, మంచి గుణములచేత గొప్పవాడైన రాముని సేవింతును.

3. లోకాలను పవిత్రము చేసేవానిని, భక్తుల సేవ కలిగిన వానిని, దేవాంశ కలిగిన పక్షుల రాజయిన గరుత్మంతుని వాహనముగా కలిగిన వానిని, విభీషణునికి లంకాధిపత్యము ఇచ్చి అతనిని చక్కటి కీర్తితో జీవింపచేసిన వానిని శ్రీవేంకటాచలములో వేంకటేశునిగా ప్రసిద్ధమైన నివాసము కలిగిన రాముని సేవింతును.

**విశేషాలు :**

ఇందీవర శ్యామం

కపిల దేవహూతి సంవాదములో సాత్వికమును వర్ణిస్తూ పోతన్న గారు "సమస్తమైన యోగులలో శ్రేష్ఠులచే కొలవబడి శరత్కాలపు నల్లకలువ వలె నల్లని రంగు కలదై ఉంటు"దన్నాడు. (3-89వ). శ్రీరామచంద్రునిది అటువంటి సాత్విక స్వరూపము. వాల్మీకి కథం ఇందీవర శ్యామో రక్త అక్షః ప్రియదర్శనః (అయోధ్య కాండ) అన్నాడు. ఇలా కవులందరికీ రాముడంటే ఇందీవర శ్యాముడు అనిపిస్తాడు. ''వందే వాసుదేవం'' కీర్తనలో కూడా ఇందీవర శ్యామం అని అన్నమయ్య ప్రయోగించాడు.

పరాత్పర

పరాత్పర రఘువర నిన్ను నెరనమ్మితిర పరమదయాకర - అని మైసూర్ వాసుదేవాచార్యులవారు ఈ పరాత్పర పదముతోనే కీర్తన మొదలుపెట్టారు. "శుద్ధబ్రహ్మ పరాత్పర" (నామ రామాయణం) "రామామరుగేల చరాచర రూప పరాత్పర" (త్యాగరాజ స్వామి) మొదలయినచోట్లా సుగంధంలా వ్యాపించింది ఈ పదబంధం. తారతమ్యాలకూ, తరతమ భేదాలకూ తావులేని వాడు పరాత్పరుడు. పరాశక్తి దేవ ఋషి ప్రార్థనల మేరకు హిమవత్పర్వత పుత్రికగా చైత్రశుద్ధ నవమినాడు అవతరించింది. ఆమె పరాత్పరి. శ్రీమన్నారాయణుడు శ్రీరాముడిగా అవతరించినది నవమి తిథినాడు. ఈయన పరాత్పరుడు. కవులందరూ పరాత్పర అని రాముని అంటే అన్నమయ్య ఒక అడుగు ముందుకు వేసి "పరాత్పర ధాముడు" అన్నాడు.

వీత భీత మౌని విద్యోతం

ఖడ్గం చ పరమ ప్రీతః తూణీ చ అక్షయ సాయకౌ ।
వసతః తస్య రామస్య వనే వన చరైః సహ ॥ (1-1-43)

సీతా లక్ష్మణులతో శ్రీరాముడు దండకారణ్యమున నివసించే సమయములో పరిసరములలోనున్న మునులందరూ తమను బాధిస్తున్న రాక్షసులను చంపమని కోరుటకై శ్రీరాముని దగ్గరకు వచ్చారు. (1-1-43)

ఋషయః అభ్యాగమన్ సర్వే వధాయ అసుర రక్షసాం ।
న తేషాం ప్రతి శుశ్రావ రాక్షసానాం తథా వనే ॥ (1-1-44)

ప్రతిజ్ఞాతః చ రామేణ వధః సంయతి రక్షసాం ।
ఋషీణాం అగ్ని కల్పానాం దండకారణ్య వాసీనాం ॥ (1-1-45)

శ్రీరాముడు ఆ మునుల ప్రార్థనను విన్నాడు. అగ్నితో సమానులైన ఆ ఋషీశ్వరుల యెదుట "ఆ వనములోని రాక్షసులను అందఱిని యుద్ధమున మట్టుపెట్టెదను" – అని అతడు ప్రతిజ్ఞ చేసాడు. (1-1-44, 45) చెప్పినట్లుగానే రాక్షసులను చంపాడు కనుక అన్నమయ్య తొలగిన భయము కల దండకారణ్య మునుల గుంపు మధ్య ప్రకాశించేవానిగా రాముని ఈ కీర్తనలో వర్ణించాడు.



## *73. రామ దశరథ రామ నిజ సత్య*

శ్రీరాముని గుణ గణాలను సంబోధిస్తూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది. (4-156)

**రామా దశరథ రామా నిజ సత్య -**
**కామా నమో నమో కాకుత్థ్స రామ ॥**

**1.కరుణానిధి రామ కౌసల్యానందన రామ**
**పరమ పురుష సీతాపతి రామ**
**శరధి బంధన రామ సవన రక్షక రామ**
**గురుతర రవివంశ కోదండ రామ ॥**

**2.దనుజహరణ రామ దశరథ సుత రామ**
**వినుతామర స్తోత్ర విజయరామ**
**మనుజావతారా రామ మహనీయ గుణ రామ**
**అనిలజప్రియ రామ అయోధ్యారామ॥**

**3.సులలితయశ రామ సుగ్రీవా వరద రామ**
**కలుష రావణ భయంకర రామ**
**విలసిత రఘురామ వేదగోచర రామ**
**కలిత ప్రతాప శ్రీ వేంకట గిరి రామ ॥**

**తాత్పర్యము :**

ఓ రాముడా! దశరథుని కుమారుడా! సత్యము మాట్లాడుటలో ప్రీతి కలవాడా! కకుత్థ్సవంశములో జన్మించినవాడా! రామా ! నీకు నమస్కారము.

1. దయకు నిలయమయినవాడా! రామా! కౌసల్యాదేవి కుమారుడా! రామా! ఓ పరమాత్మా! సీతాదేవికి పతియైనవాడా! రామా! సముద్రంపై వంతెనని నిర్మింపచేసిన వాడా! రామా! విశ్వామిత్రునియాగమును కాపాడినవాడా! రామా! గొప్పదైన

సూర్యవంశములో జన్మించినవాడా! నాలుగు మూరల విల్లును ధరించినవాడా!

2. దనువునందు జన్మించినవాడు దానవుడు. ఆ రాక్షసులను సంహరించినవాడా! రామా! దశరథుని కుమారుడా! రామా! వినయముతో ఉన్న దేవతలతో నమస్కరింపదగినవాడా! విజయములుపొందే రామా! మనుష్యుని అవతారమెత్తిన రామా! గొప్పవైన గుణములు కలిగిన రామా! వాయు కుమారుడైన హనుమంతునికి ఇష్టమైన వాడా! యోద్ధుంశక్యా = యోధ్యా- నయోధ్యా. యుద్ధముచేసి ఆక్రమింప అలవికానిది అయోధ్య, శత్రువు యుద్ధం చేయడానికి సాధ్యం కాని అటువంటి అయోధ్యలో జన్మించిన వాడా!

3. అందమైన కీర్తిని కలిగినవాడా! సుగ్రీవునికి రాజ్యమును లభింపచేసెదనని వరమునిచ్చి కాపాడిన వాడా! పాపాత్ముడైన రావణాసురునికి భయంకరమైన వాడా! రామా! కాంతితో ప్రకాశించే రామా! వేదములలో కనిపించే వైభవము కలిగిన రామా! ప్రతాపము కలిగినవాడా! శ్రీవేంకటాచల పర్వతముపై వేంకటేశ్వరుని అవతారములో ఉన్న రామా! నీకు నమస్కారము.

**విశేషాలు :**

కాకుత్థ్స రామ

ఇక్ష్వాకుని పౌత్రుడగు వికుక్షి కొడుకు. ఇతఁడు విష్ణువు యొక్క అనుమతిచే వృషభరూపుఁడైన దేవేంద్రుని ప్రార్థనంబున అతని మూపురము ఎక్కి రాక్షసులతో యుద్ధము చేసినందున ఇతనికి కకుత్థ్సుఁడు అనియు, ఇంద్రవాహనుఁడు అనియు పేర్లు కలిగెను. ఇతనికి పురంజయుఁడు అని నామాంతరము కలదు. వికుక్షి ఇక్ష్వాకు కొడుకు అని కొన్నియెడల చెప్పి ఉండినను వాల్మీకి రామాయణమునందు అతడు ఇక్ష్వాకు పుత్రుడైన కుక్షి కొడుకు అని చెప్పి ఉన్నది. మయు వికుక్షి కొడుకు బాణుడు అనియు ఉన్నది. అది కకుత్థ్సునికి నామాంతరముగా ఉండవచ్చును. పురాణ నామచంద్రిక (యెనమంద్రం వెంకటరామయ్య) 1879.

సత్యకామా

సత్య కాముడు అనే పేరు ఉపనిషత్తుల్లో కనబడుతుంది. ప్రశ్నోపనిషత్తులో పిప్పలాదుడు అనే బ్రహ్మవేత్తను ఆరుగు మహర్షులు వచ్చి ఆరు ప్రశ్నలు వేస్తారు. సుకేశుడు, సత్యకాముడు, సౌర్యాయణి, కౌసల్యుడు, భార్గవుడు, కబంధి – ఇందులో సత్య కాముడు ఒకడు. ఛాందోగ్యపనిషత్తులో గోసేవ చేసిన సత్యకాముడు కనబడతాడు.

అయోధ్య

మోక్షదాయకములగు పుణ్య నగరములు ఏడింటిలో మొదటిది. అయోధ్య, మథుర, మాయ, కాశి, కాంచి, అవంతి పురి, ద్వారక - ఇవి పుణ్యనగరములు.



## *74. వందే వాసుదేవం (01-53)*

వాసుదేవుని గుణగణాలను పొగుడుతూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది.

**వందే వాసుదేవం**
**బృందారకాధీశ వందిత పదాబ్జం**

**1.ఇందీవరశ్యామ మిందిరాకుచతటీ-**
**చందనాంకిత లసత్-చారు దేహం**
**మందార మాలికామకుట సంశోభితం**
**కందర్పజనక మరవిందనాభం**

**2.ధగధగిత కౌస్తుభాదరణ వక్షస్థలం**
**ఖగరాజ వాహనం కమలనయనం**
**నిగమాదిసేవితం నిజరూపశేషప-**
**న్నగరాజ శాయినం ఘననివాసం**

**3.కరిపురనాథసంరక్షణే తత్పరం**
**కరిరాజవరద సంగతకరాబ్జం**
**సరసీరుహాననం చక్రవిభ్రాజితం**
**తిరు వేంకటాచలాధీశం భజే**

**తాత్పర్యము :**

వసుదేవుని కుమారుడయిన వాసుదేవునికి నమస్కరించుచున్నాను. దేవతల ప్రభువయిన ఇంద్రునిచే పూజింపబడిన పాదములు గలవాసు దేవునికి నమస్కరించుచున్నాను.

1. నల్ల కలువలా ఉండే శరీర కాంతి గలవానికి, లక్ష్మీ దేవి యొక్క స్తనద్వయములోని గంధపు గుర్తుచే ప్రకాశిస్తున్న అందమైన శరీరము కలవానికి, మందారమాలతో కలిసిన కిరీటముతో ప్రకాశిస్తున్నవానికి, కుత్సితమైన దర్పము కలిగిన మన్మథుని తండ్రికి, బొడ్డులో పద్మము కలవానికి నేను నమస్కరించుచున్నాను.

2. హృదయము నందు ధగధగ మెరుస్తున్న కౌస్తుభమణిని ఆదరించిన వానికి (అనగా ధరించినవానికి) గరుత్మంతుడు వాహనముగా గలవానికి, కమల నేత్రునికి, వేదాలు, ఉపనిషత్తులు మొదలైన వాటి చేత బాగా కొనియాడబడువానిని, తన ఆకారమే

అయిన ఆదిశేషునిపై శయనించే వానికి, వైకుంఠమను గొప్ప నివాసము కలవానికి నేను నమస్కరించుచున్నాను.

3. హస్తినాపురనాథుడైన పరీక్షిత్తు రక్షణలో ఆసక్తి కలవానికి, గజేంద్రునికి వరములిచ్చినవానికి, కరిరాజుని రక్షించిన వానికి, శరణుకోరిన వారికి స్నేహహస్తము అందించు పద్మము వంటి చేతులు కలవానిని, చేతులలో చేరిన పద్మము కలవానికి (అనగా పద్మము చేతిలో ధరించినవానికి) పద్మము వంటి ముఖము కలవానికి, చేతిలో సుదర్శన చక్రముచే ప్రకాశించువానికి, శుభమైన వేంకట పర్వతముపై ప్రకాశిస్తూ మనందరికి ప్రభువయిన వేంకటేశునికి నమస్కరించుచున్నాను.

**విశేషాలు :**

వాసుదేవం

వాసుదేవ శబ్దమునకు మూడు అర్థాలున్నాయి. 1. కృష్ణుడు. (వసుదేవుని కొడుకు అని ఒక అర్థము.) 2. వాసుదేవుడు అనేవాడు కరూశదేశమునకు రాజు. ఇతడు కృష్ణునితో పోటీపడి అతనిచేతిలో చనిపోయాడు. 3. వాసుదేవుడు అనేవాడు ఆంధ్రశబ్ద చింతామణికి వృత్తి వ్రాసిన ఒక పండితుడు.

కౌస్తుభ

విష్ణువక్షస్థలములోని మణిని కౌస్తుభమంటారు. కౌస్తుభము. కుస్తుభమంటే సముద్రము. అందులోనుంచి పుట్టింది కనుక కౌస్తుభము. అని పేరు వచ్చింది.

కరిపురనాథసంరక్షణే

హస్తినాపురాన్ని (కరిపురము) ధర్మరాజు ఇలాంటి విష్ణు (కృష్ణ) భక్తులు ఎందరో పాలించి ఉండవచ్చు. కాని ఈ కీర్తనలో కరిపురనాథుడు పరీక్షిత్తే. పోతన గారి భాగవతంలో – అభిమన్యుని భార్య ఉత్తర గర్భంలో ఉన్న పరీక్షిత్తు, బ్రహ్మాస్త్ర తాపానికి కుమిలిపోతుంటే విష్ణువు కాపాడిన ఘట్టం దయార్ద్రంగా వర్ణింపబడింది. "కుయ్యిడ శక్తి లే దుదరగోళములోపల నున్నవాఁడ ది / క్కెయ్యది దా ననాథ నని యెప్పుడుఁ దల్లి గణింప విందు నే డియ్యఘవహ్ని వాయుటకు నెయ్యది మార్గము నన్నుఁ గావ నే/ యయ్య గలండు? గర్భజనితాపద నెవ్వఁ డెంగు దైవమా! "నాకు ఏడ్వటానికి కూడా ఓపిక లేదు; నాకు దిక్కెక్కడ? అమ్మ అనాథనని అనుక్షణం బాధపడుతుంటే వింటుంటాను. నన్ను ఆదుకొనే తండ్రి ఎక్కడ ఉన్నాడో" అని విలపించాడు పరీక్షిత్తు. బాధకి తారస్థాయి యైన వాక్యం ఈ పద్యం చివరిలో

ఉంది. ఎవరైన బయట ఉండి రక్షించమంటే కాపాడతారు. తల్లి గర్భంలో ఉన్న నన్ను ఎవరు రక్షిస్తారు?" అని పరీక్షిత్తు ప్రశ్న.

విష్ణుదేవునిచే రక్షింపబడిన పరీక్షిత్తునకు విష్ణు రాతుడు అను పేరు భాగవతం ఇస్తే – పరీక్షిత్తుని రక్షించిన విష్ణువును ఈ గీతంలో అన్నమయ్య కరిపుర నాథ సంరక్షకుడు అన్నాడు.



## *75. వందేహం జగద్వల్లభం*

వేంకటేశునికి నమస్కరిస్తూ, శరణు కోరుతూ పెదతిరుమలాచార్యుల వారు రచించిన కీర్తన ఇది. (సంపుటము 15–235)

**వందేహం జగద్వల్లభం దుర్లభం**
**మందరధరం గురుం మాధవం భూధవం ॥**

**1. నరహరిం, మురహరం నారాయణం వరం**
**హరిమచ్యుతం ఘన విహంగవాహం**
**పురుషోత్తమం పరం పుండరీకేక్షణం**
**కరుణాభరణం కలయామి శరణం ॥**

**2. నందనిజనందనం నందకగదాధరం**
**యిందిరానాథ మరవిందనాభం**
**యిందు రవిలోచనం హితదాసవరదం**
**ముకుందం యదుకులం గోపగోవిందం ॥**

**3. రామనామం యజ్ఞరక్షణం లక్షణం**
**వామనం కామినం వాసుదేవం**
**శ్రీమదావాసినం శ్రీవేంకటేశ్వరం**
**శ్యామలం కోమలం శాంతమూర్తిం ॥**

**తాత్పర్యము :**

ప్రపంచానికి ప్రభువైన వానికి, ( = జగద్వల్లభం), పొందశక్యము వానికి (= దుర్లభం), నేను నమస్కరిస్తున్నాను (వందేహం). కూర్మావతారంలో మందర పర్వతాన్ని ధరించిన వానికి (= మందరధరం), లక్ష్మీ భర్త యైన వానికి (= మాధవం), భూదేవి భర్తయైన వానికి (= భూధవం).

1. నరసింహ స్వరూపుని, మురుడను రాక్షసుని చంపిన వానిని, నారాయణుని, మోక్షమిచ్చు పరమాత్మని (= పరం), హరిని, నాశనము లేనివానిని, గొప్పదైన గరుడ వాహనము కలవానిని, అందరిలో ఉత్తముని, మోక్ష స్వరూపుని (= పరం), పద్మముల

వంటి కన్నులు కలవానిని, దయకు ఆభరణమైన వానిని, శరణు కోరుచున్నాను (= కలయామి).

2. నందుని కుమారుని, నందకమను ఖడ్గాన్ని, కౌమోదకి అను గదను ధరించినవానిని, లక్ష్మీపతిని, పద్మము నాభియందు కలవానిని, సూర్యచంద్రులను కన్నులుగా కలవానిని, ఆశ్రయించిన భక్తులను కాపాడువానిని, మోక్షము నిచ్చువానిని (= ముకుందం), యదుకులము తన స్వరూపముగా కలవానిని, గొల్లవాడైన గోవిందుని (= గోపగోవిందం) శరణు కోరుచున్నాను.

3. రాముడను పేరు కలవానిని, విశ్వామిత్రుని యజ్ఞము రక్షించినవానిని, అన్ని శుభ లక్షణములు కలవానిని, వామనావతారము ధరించినవానిని, కోర్కెలు కలవానిని, వసుదేవుని కుమారుని, కస్తూరిని ధరించిన వానిని (= శ్రీమదావాసినం), శ్రీ వేంకటేశ్వరుని, నల్లనివానిని (= శ్యామలం), సుకుమారుని, శాంత స్వరూపుని నమస్కరిస్తున్నాను.

**విశేషాలు :**

మాధవుడు, భూధవుడు

అన్నమయ్యగా, పెదతిరుమలయ్య కూడా స్వామివారికి ఇద్దరు భార్యలంటూ ఈ గీతంలో మాధవం భూధవం అని వ్రాసారు. అమ్మవారికి లక్ష్మీదేవి, భూదేవి అని రెండు రూపాలలో – వేంకటేశుని భార్యలుగా పూజిస్తున్నాం. అమ్మవారు మూడు స్థానాల్లో లయార్చ, భోగార్చ మరియు అధికారార్చ అనే రూపాల్లో దర్శనమిస్తుందని పెద్దలు చెబుతారు. లయార్చ అంటే భగవంతుని యొక్క వక్షఃస్థలంపై ఉన్న రూపం. భోగార్చ అంటే భగవంతుని ప్రక్కగా ఉండే రూపం. ఒంటరిగా భగవంతుడు ప్రక్కన లేని రూపంలో దర్శనమిచ్చే రూపం అధికారార్చ. మన మానవ సంబంధాలు దేవునికి అంటగడితే కొన్ని ప్రశ్నలకు జవాబులు తెగవు. ఉదాహరణకి శ్రీవేంకటేశ్వర సుప్రభాతంలో వేంకటేశుడు భూదేవి పుత్రి సీతకు భర్తగా చెబుతారు. అదే సుప్రభాతంలో భూదేవి భర్తగా చెబుతారు. రెండింటికి సమన్వయం కష్టం. నారాయణుడు భూదేవికి భర్త. శ్రీరాముడు సీతకు భర్త. మన వావి వరుసలు సర్వము తానైన భగవంతునికి అంటకట్టకూడదు.

ఒకటి రెండుసార్లు లేదా వేయిసార్లు దేవుని పొగడటం మనకు అలవాటు. లేకపోతే మనకు తృప్తి ఉండదు. అందుకే దేవుని ఇద్దరు భార్యలతో కలిపి పూజిస్తున్నాం.

తత్త్వం ఒకటే అనే జ్ఞానం వచ్చేంతవరకు వేంకటేశుని ఇద్దరు భార్యలతో కలిసి పూజించే అలవాటు పెద్దలు చేసారు. అన్నమయ్య కూడా అందుకే 'పన్నిన లక్ష్మి భూమి పతివి నీవు' అన్నాడు (నీకే నే శరణు అను నా గీత వ్యాఖ్య)

దుర్లభుడు

సమావర్తో నివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః ।
దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా ॥

అని విష్ణు సహస్ర నామములలో ఉన్న దుర్లభ నామము ఈ కీర్తనలో ప్రత్యక్షమయింది. చెప్పవచ్చేదేమిటంటే అన్నమయ్య లేదా, వారి సంతతి కీర్తనలు చదువుతుంటే విష్ణు సహస్ర నామ పారాయణ ఫలము కూడా దక్కుతుంది. ఆ నామాలు చాలా కీర్తనల్లో కనబడుతుంటాయి.

నంద నిజ నందనుడు

నందనందనుడు అనేది ప్రసిద్ధమయిన పదము. నందుని కుమారుడు అని చెప్పుకొంటాము. ఈ నంద నిజ నందనుడు (= అంటే నందుని నిజమైన కుమారుడు) ఏమిటి? దీనిని ఎలా సమన్వయించుకోవాలి?

పూర్వజన్మలో నందుడు 'ద్రోణుడు', యశోద 'ధర'. వారు బ్రహ్మ గురించి తపస్సు చేస్తే బ్రహ్మ సాక్షాత్కరించాడు. 'మాకు హరిభక్తి స్థిరముగా ఉండునట్లు వరమివ్వమని ఆ దంపతులు బ్రహ్మను కోరారు. బ్రహ్మ అనుగ్రహముతో ఆ ద్రోణుడే నందుడుగానూ, ధర యశోదగానూ పుట్టారు. బ్రహ్మవర ప్రభావముతో కృష్ణుడు వారి యింట కుమారుడయ్యాడు. నిజానికి కృష్ణుడు నందుని కన్న కొడుకు కాదు. పెంచుకొన్న కొడుకు. కాని ఆ విషయము తెలియనంత మమకారముతో నిజమైన కన్న కుమారునిలా కృష్ణుడు పెరిగాడని చెప్పటానికి పెదతిరుమలయ్య నిజనందనుడు అని పదప్రయోగం చేసాడు. మహాభారతములో ఉత్తర గోగ్రహణ సందర్భములో తిక్కనగారు కూడా ఇటువంటి ప్రయోగము చేసారు.

సింంబాకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగ స్ఫూర్జిత యూథదర్పనసముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతార నివాస ఖిన్నమతిన స్మత్సేనపై వీడె వ
చ్చెం గుంతీసుత మధ్యముండు సమర స్థేమాభి రామాకృతిన్.

అర్జునుడు వస్తున్నాడని చెప్పటానికి కుంతీసుత మధ్యముడు అని ప్రయోగము. నిజానికి కుంతి కొడుకులలో మధ్యవాడు భీముడు. (ధర్మరాజు, భీముడు, అర్జునుడు) కాని అర్జునుడు కుంతీ సుత మధ్యముడని తిక్కనగారి ప్రయోగము. మాద్రికి పుట్టిన నకుల సహదేవులను కూడా కుంతి తన కన్నబిడ్డలుగా చూసుకొంది. కనుక లోకంలో కుంతి కొడుకులంటే అయిదుగురుగా ప్రసిద్ధి చెందారు. ఇప్పుడు వారి మధ్యవాడు అర్జునుడని (ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు) తిక్కన కుంతి మాతృప్రేమను వ్యంగ్యంగా చెప్పాడు. మహాకవుల పదప్రయోగాలు ఇలానే ఉంటాయి.

నారాయణుడు

నారము అంటే నీరు. అది స్థానముగా కలవాడు కనుక భగవంతునికి నారాయణుడు అని పేరు.

హరి

హరతీతి హరిః. హరించువాడు హరి. పాపాలను హరించేవాడని భావం. "హరియను రెండక్షరముల హరి యించును పాతకంబు...." అని పోతనగారు భాగవతంలో అన్నారు.

అచ్యుతుడు

తన పదవి నుండి జాఱనివాడిని అచ్యుతుడని అంటారు. అంటే ఏనాడు నాశనము కాని వాడని భావము.

గోవిందుడు

కృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని ఎత్తి దాని కింద గోవులకు ఆశ్రయం ఇచ్చాడు. అప్పుడు తన గర్వాన్ని పోగొట్టుకొని కృష్ణుడి శక్తిని తెలుసుకొని, గోగణాలకు కృష్ణుడిని ప్రభువును చేసాడు. ఆనాటినుంచి కృష్ణునకు గోవిందుడని పేరు వచ్చింది.

ముగింపు

అన్నమయ్య కీర్తనకు, పెదతిరుమలయ్య కీర్తనకు తేడా కనిపెట్టటం చాలా కష్టం. రేకులతో ఉంది కాబట్టి ఇది తిరుమలయ్య గీతమని చెప్పుకొంటున్నాం. అంతే. అన్నమయ్య భక్తి పరిణతి అడుగడుగునా ఈ గీతంలో కనబడుతుంది.



## 76. శరణు శరణు దేవ సర్వపోషక

వేంకటేశునిలో రాముని చూస్తూ, పరవశిస్తూ శరణు కోరుతూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది. (04- 170)

**శరణు శరణు దేవ సర్వపోషక**
**కరుణానిలయ రామ కౌసల్యానందన**

**1.వారిధిబంధన రావణ శిరచ్ఛేదక**
**మారీచ సుబాహుబలమర్దన**
**దారుణ కుంభకర్ణ దనుజసంహారక**
**వీరప్రతాప రామ విజయాభిరామ**

**2.సవనరక్షక మునిజనకుల నిర్వాహక**
**దివిజవంద్య కపిసేనానాయక**
**వివిధసప్తతాలవిధ్వంసనచతుర**
**భువనేశ సాకేతపురవాస రామ**

**3.హరచాపహర అహల్యాశాపవిమోచక**
**ఖరశరవాలినిగ్రహబిరుద**
**నిరతి శ్రీవేంకటేశ నిజభ క్తరక్షక**
**ధరణిజాసమేత దశరథరామా**

**తాత్పర్యము :**

ఓ రామ దైవమా! అన్నింటిని పోషించువాడా! నీకు నమస్కారము. నమస్కారము. దయకు నిలయమైనవాడా ! రామా ! కౌసల్యాదేవిని సంతోషింపచేయు కుమారుడా! నీకు నమస్కారము.

1.సముద్రముపై సేతువు కట్టిన వాడా ! రావణుని తలలు తెంచినవాడా! మారీచుడు, సుబాహువు అను రాక్షసుల బలమును మర్దించినవాడా! భయంకరుడైన కుంభకర్ణుడు అనే రాక్షసుని సంహరించినవాడా ! శ్రేష్ఠమైన ప్రతాపము కలిగిన రామా ! విజయము చేత మనోహరమైన వాడా! రామా! నీకు నమస్కారము. నమస్కారము.

2. విశ్వామిత్రుని యాగమును రక్షించిన వాడా ! మునిజన సమూహాన్ని రక్షించినవాడా! దేవతలచే నమస్కరింపదగినవాడా! కోతుల సైన్యానికి నాయకుడా! రకరకాలుగా ఉన్న ఏడు తాడి చెట్లను పడగొట్టుటలో నేర్పు చూపించినవాడా! లోకానికి ప్రభువైన వాడా! అయోధ్యా నగర వాసీ! రామా! నీకు నమస్కారము. నమస్కారము.

3. శివుని విల్లు విరిచినవాడా! అహల్యాదేవి శాపాన్నిపోగొట్టిన వాడా! ఖరుడు, శరుడు, వాలి మొదలైన వీరులను నిగ్రహించిన సమర్థుడా! ఎప్పుడూ వేంకటేశ్వరుడివై భూలోకంలో నిలిచి, తన భక్తులను కాపాడేవాడా! సీతతో ఉండేవాడా! దశరథుని

కుమారుడా! రామా! నీకు నమస్కారము.

**విశేషాలు :**

రావణ శిరచ్ఛేదక

రామాయణాన్ని చాలామంది చాలా రకాలుగా అర్థం చేసుకొన్నారు. 'ర' అంటే కాంతి. 'మ' అంటే నేను అని అర్థం. రామ అంటే 'నా లోపలి వెలుగు' అని భావం. రాముడి తలిదండ్రులు కౌసల్య, దశరథులు. దశరథ అంటే పది రథాలు. ఈ పది రథాలూ మన పంచ జ్ఞానేంద్రియాలను, పంచ కర్మేంద్రియాలనూ సూచిస్తాయి.

కౌసల్య అంటే నైపుణ్యం (కుశలత). అయోధ్య అంటే హింసలేని సమాజం అని అర్థం. మీ లోపల ఏం జరుగుతోందో మీరు కుశలతతో గమనిస్తే మీలో జ్ఞానకాంతి ఉదయిస్తుంది. అదే ధ్యానం. మానసిక ఒత్తిడినుంచి విశ్రాంతి పొందేందుకు మీకు కొంత నైపుణ్యం కావాలి. మీ లోపల వెలుగు ఉదయించినప్పుడు మీరే రాముడు. మనసు లేదా బుద్ధి సీతకు చిహ్నం. సీత రావణుని చేత అంటే బుద్ధి అహంకారం చేత అపహరింపబడింది. రావణునికి పది తలలు. రావణుడు (అహంకారం) తన తలలలో అంటే అహంకారపు ఆలోచనలలో చిక్కుకుపోయి ఉన్నాడు. హనుమ అంటే శ్వాస. హనుమంతుని (శ్వాస) సహాయంతో సీత (బుద్ధి) తిరిగి రాముని వద్దకు (మూలానికి) చేరుకోగలిగింది.

జర్మనీలోని రామ్బాగ్, ఇటలీలోని రోమ్ పట్టణాల పేర్లకు మూలం రామ శబ్దమే. ఇండోనేసియా, బాలి, జపాన్ వంటి దేశాలు రామాయణ ప్రభావానికి లోనైనాయి. (– శ్రీ శ్రీ రవిశంకర్, వ్యవస్థాపకులు, ఆర్ట్ ఆఫ్ లివింగ్) ఇది ఒక సమన్వయము. ఈ సమన్వయములో రావణుని తలలు అంటే అహంకారపు ఆలోచనలని చెప్పారు. ప్రతీకాత్మకంగా ఇది బాగానే ఉంది. అసలు అసలు రావణునికి పది తలలు ఉన్నాయా? రామాయణంలో వర్ణించారా?

వాల్మీకి రామాయణము యుద్ధ కాండలో 11 వ సర్గ లోని 26వ శ్లోకములో "రాముని బాణముతో రావణుని యొక్క తల కింద పడింది "రావణస్య శిరోஉ చ్ఛిందత్ అని ఉంది. అంటే రామునికి ఒక్క తల మాత్రమే ఉన్నదని అర్థం కాదు. వాడికి పది తలలున్నాయి. వాడు మాయవి కనుక అవసరమయితే ఒక తల, లేకపోతే పది తలలతో ఉంటాడు. రాముడు ఒక్కో తలను నరుకుతుంటే వందలకొద్దీ తలలు రావణునికి పుట్టుకొచ్చాయని యుద్ధ కాండలో 11 వ సర్గలో 29 వ శ్లోకములో

స్పష్టంగా ఉంది. ఇది వాడి మాయావితనానికి మరొక ఉదాహరణము.

శరణు

శరణు అనే పదానికి ఉన్న రకరకాల అర్థాలలో నమస్కారము ఒకటి. ఆ అర్థాన్ని ఈ కీర్తన వివరణములో ఉపయోగించుకొన్నాను. శరణు శరణు - నమస్కారము. నమస్కారము.



## *77. శరణు శరణు విభీషణ వరదా (2-220)*

శ్రీరాముని కీర్తిస్తూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది.

**శరణు శరణు విభీషణ వరదా**
**శరధిబంధన రామ సర్వగుణస్తోమ**

**1.మారీచసుబాహుమదమర్దన తాటకాహర**
**క్రూరేంద్రజిత్తుల తలగుండుగండా**
**దారుణకుంభకర్ణదనుజ శిరచ్ఛేదక**
**వీరప్రతాపరామ విజయాభిరామ**

**2.వాలినిగ్రహ సుగ్రీవరాజ్యస్థాపక**
**లాలితవానరబల లంకాపహార**
**పాలితసవనాహల్యాపాపవిమోచకజి**
**పౌలస్త్యహరణ రామ బహుదివ్యనామ**

**3.శంకరచాపభంజక జానకీమనోహర**
**పంకజాక్ష సాకేతపట్టణాధీశ**
**అంకితబిరుద శ్రీవేంకటాద్రినివాస**
**ఓంకారరూప రామ వురుసత్యకామ**

తాత్పర్యము :

విభీషణునికి వరమిచ్చినవాడా! నీకు నమస్కారము. నమస్కారము. సేతువు కట్టిన వాడా! రామా ! అన్ని గుణములకు నిలయమైనవాడా! (= స్తోమ).

1. మారీచుడు మరియూ సుబాహులను రాక్షసుల మదమును అణచిన వాడా! తాటకను సంహరించినవాడా! ఇంద్రుని జయించిన క్రూరులైన రాక్షసులకు బాధ కలిగించే పరాక్రమము కలిగినవాడా! (తలగుండు = తలమీద పెట్టిన గుండని శబ్దార్థము.) భయంకరమైన కుంభకర్ణుడనే రాక్షసుని తలను ఖండించినవాడా! వీరులు సంతోషించే పరాక్రమము కలిగినవాడా! విజయములచేత ప్రకాశించువాడా!

2. వాలిని దండించినవాడా! సుగ్రీవుని రాజ్యమునందు స్థాపించిన వాడా! ప్రేమతో

ఆదరించిన వానర సైన్యము కలవాడా! లంకారాజ్యాన్ని అపహరించినవాడా! విశ్వామిత్రుని యాగాన్ని రక్షించినవాడా! అహల్య పాపమును పోగొట్టిన వాడా! పులస్త్య బ్రహ్మవంశమువాడయిన రావణుని హరించిన వాడా! అనేక మహిమలు ఉన్న పేర్లు కలవాడా!

3. శివుని విల్లు విరిచినవాడా! సీతాదేవి మనస్సును హరించినవాడా! తామరపువ్వు లాంటి కన్నులు కలవాడా! అయోధ్యా నగరానికి ప్రభువా! గుర్తు పెట్టుకొనదగిన బిరుదులు కలవాడా! శ్రీ వేంకట పర్వతముపై ఉండేవాడా! ప్రణవాక్షరమైన ఓంకారము రూపముగా కలవాడా! రామా! గొప్పదయిన సత్యము మాట్లాడుటలో ప్రీతి కలవాడా! నమస్కారము.

విశేషాలు :

విభీషణ వరదా

విభీషణుడు రాముని శరణు వేడిన వెంటనే (యుద్ధకాండము 19వ సర్గ 04-5 శ్లో) అతనిని సముద్ర జలాలతో లంకారాజ్యానికి పట్టాభిషిక్తుని చేయించాడు రాముడు. (యుద్ధకాండము 19వ సర్గ 27శ్లో) ఇది రాముడు విభీషణునికి ఇచ్చిన వరము. అందుకే అన్నమయ్య విభీషణవరదా అని సంబోధించాడు.

క్రూరేంద్రజిత్తుల తలగుండుగండా

ఈ సంస్కృత కీర్తనలో ఈ 'క్రూరేంద్రజిత్తుల తలగుండుగండా' సమాసము తెలుగు తనం కలిగినది. అన్నమయ్య వ్రాసిన అసలు సంస్కృత సమాసము వేరే ఉండి ఉంటుంది. కాని రేకుల మీద చెక్కిన వారు ఇలా తెలుగు పదాల విభక్తులు జోడించి పొరబాటున చెక్కి ఉంటారు. తితిదే సంపుటాలలో ఉన్న పాఠము ఇదే కనుక - ప్రస్తుతానికి ఇదే గ్రాహ్యము.

పౌలస్త్యహరణ

శ్రీరాముఁడు లంకపై దండ యాత్రకు వచ్చుచున్న విషయాన్ని సముద్రుడు రావణునితో చెప్పాడు. అప్పుడు రావణుడన్న మాటలను కాటూరి వేంకటేశ్వరరావుగారు పౌలస్త్య హృదయము అను పేరుతో రచించారు. ఎన్నాళ్ళకు! ఎన్నాళ్ళకు! కన్నులు వింశతియు నాకుఁ గల్గినఫల మా సన్నమయి వచ్చె! భుజ గర్వోన్నతి చరితార్థమగు ముహూర్తము వచ్చెన్." ఇటువంటి మధురమైన పద్యాలు ఈ పౌలస్త్య హృదయములో ఉన్నాయి.

వురుసత్యకామ

నిజానికి ఈ సంబోధనలో పదము ఉరు. మేలగు, శ్రేష్ఠమగు, తగు అని ఉరు పదానికి అర్థాలున్నాయి. అయితే రేకులోవురు అని ఉన్నది. అందుకే తితిదే సంపుట ముద్రణలో వురు చేరింది.



## *78. శరణు శరణు వేద శాస్త్రనిపుణ (02-347)*

అంజనేయుని కీర్తిస్తూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన ఇది.

**శరణు శరణు వేద శాస్త్రనిపుణ నీకు**
**అరుదైన రామ కార్యధురంధరా**

**1. హనుమంతరాయ అంజనాతనయా**
**ఘనవాయుసుత దివ్యకామరూప**
**అనుపమలంకాదహన వార్ధిలంఘన**
**జనసురనుత కలశాపురనివాస**

**2.రవితనయసచివ రావణవనాపహార**
**పవనవేగబలాఢ్య భక్తసులభ**
**భువనపూర్ణదేహా బుద్ధివిశారద**
**జవసత్వవేగ కలశాపురనివాస**

**3.సీతాశోకనాశన సంజీవశైలాకర్షణ**
**ఆతతప్రతాపశౌర్యా అసురాంతకా**
**కౌతుక శ్రీవేంకటేశు కరుణాసమేత**
**శాతకుంభవర్ణ కలశాపురనివాస**

**తాత్పర్యము :**

వేదశాస్త్రములలో నైపుణ్యము కలవాడా! అపూర్వమైన రాముని కార్యములను నెరవేర్చుటలో సమర్థుడా!

1. ఓ హనుమంత దేవా ! అంజనాదేవి కుమారుడా! గొప్పవాడైన వాయుదేవుని కుమారుడా!దివ్యమైన, కోరిన రూపము ధరించగలిగినవాడా! పోలికలేని లంకా నగరాన్ని దహించినవాడా! మానవులు, దేవతలచే ప్రశంసలు పొందినవాడా! కలశాపురములో ప్రేమతో నివసించేవాడా!

2. సూర్యుని కుమారుడైన సుగ్రీవునికి మంత్రియైనవాడా! రావణుని అశోక వనాన్నిధ్వంసం చేసిన వాడా! వాయు వేగం వంటి వేగం కలిగిన బలవంతుడా! భక్తులకు సులభంగా వరములిచ్చువాడా! ప్రపంచమంతా నిండిపోయిన శరీరము

కలవాడా! సాటి లేని బుద్ధి కలిగిన పండితుడా! వడి కలిగిన మనో వేగము కలవాడా! కలశాపురములో ప్రేమతో నివసించేవాడా!

3. సీతాదేవి శోకాన్ని నాశనము చేసిన వాడా! సంజీవని పర్వతాన్ని లాగినవాడా! గొప్పదయిన, వ్యాపించిన పరాక్రమ ప్రతిష్ఠ కలిగిన నాయకుడా! రాక్షసులను నాశనము చేసినవాడా! ఎప్పుడూ శ్రీరామ నామములోని సుఖాన్ని అనుభవిస్తుండేవాడా ! (కౌతుక) వేంకటేశుని అవతారములో ఉన్న శ్రీరాముని కరుణతో కూడుకొని ఉన్నవాడా! బంగారమువంటి రంగు కలవాడా! కలశాపురములో ప్రేమతో నివసించేవాడా!

**విశేషాలు :**

ధురంధరా

ధురంధరుడు అనగా బరువు మోయువాడు. పని యొక్క బరువును మోసేవాడు – అంటే ఆ పనిని పూర్తి చేసే నేర్పు కలవాడు అని ఫలితార్థం వస్తుంది.

కౌతుక

కౌతుకమనగా సంతోషము, పాటలోనగు సుఖము అని అర్థాలున్నాయి. అందువల్ల ఎప్పుడూ శ్రీరామ నామములోని సుఖాన్ని అనుభవిస్తుండేవాడా అని కౌతుక శబ్దానికి అర్థము చెప్పబడినది.

కలశాపురనివాస

హంపిలో మాల్యవంతానికి ఎదురుగా ఉన్న కొండల అపత్యకల్లో ఒక చక్కని హనుమద్విగ్రహమున్నది. సుమారు పది అడుగుల ఎత్తు విగ్రహం. ఈతడే కలసాపురంలో వెలసిన హనుమంతుడు. కలశాపురానికి నేడు కసాపురమని వ్యవహారం (అన్నమయ్య పదకోశం– ఆచార్య రవ్వా శ్రీహరి 139 పుట) కసాపురం అనంత పురం జిల్లాలో గుంతకల్లు రైల్వే జంక్షన్ కు అయిదు కిలో మీటర్ల దూరంలో ఉంది. ఈ హనుమంతుని ఆలయం కసాపురం గ్రామానికి బాగా దగ్గర్లో ఉండటం వల్ల కసాపురం ఆంజనేయ స్వామి అని అంటారు. నిజానికి స్వామి ఆవిర్భవించినది నెట్టి కల్లు అనే ఊళ్ళో. కనుక ఆపేరు మీదుగా శ్రీ నెట్టి కంటి ఆంజనేయ స్వామి అనే పేరు వచ్చింది. నెట్టి కంటి అంటే ఒకే ఒక కన్ను గలవాడు అని అర్థం. ఇక్కడ అంజనేయ స్వామికి కుడి కన్ను మాత్రమే ఉంటుంది.



## *79. శ్రీపతి పురనాయకా*

శ్రీ వేంకటేశ్వరుని కీర్తిస్తూ అన్నమయ్య మనుమడు చిన తిరుమలాచార్యులు రచించిన సంస్కృత కీర్తన ఇది. (కీర్తన సంఖ్య 51 సంపుటము 10)

**శ్రీపతి పురనాయకా జయ**
**చింతితాభీష్ట దాయకా**

**1.ఉన్నతోన్నత విగ్రహో దాసోపరిస్థానుగ్రహో**
**సన్నుతామర సుగ్రహోసామవేద పరిగ్రహో**

**2.జానకీ ప్రియకారకాశివ సాధితాఖిల తారకా**
**మానుషాహిత మారకా మామకాఘ నివారకా**

**3.శ్రీవేంకట నాథరూపకాసంచిత రఘుకుల దీపకా**
**భావ సంతోష ప్రాపకాఅభంగ మంజుల చాపకా**

**తాత్పర్యము :**

తిరుపతి నగరానికి నాయకుడా! నీకు జయము (సంస్కృతాన్ని ఇష్టపడని తమిళులు శ్రీని "తిరు" అని, "శ్రీపతి"ని "తిరుపతి"గా మార్చారు. కవి శ్రీపతి అని అసలు పదాన్ని వాడాడు) నిన్ను గురించి ఆలోచించిన వారికి కోరికలు తీర్చువాడా! నీకు జయము.

1. బాగా ఎత్తయిన విగ్రహ స్వరూపము కలవాడా! దాసులకు మీదనున్న (ఉపరిస్థ) దయా స్వరూపుడా! (వేంకటేశుడు దాసులపట్ల దయను చూపిస్తాడని భావము) పొగుడుచున్న దేవతలను బాగా అనుగ్రహించువాడా! సామవేదాన్ని ప్రియంతో పుచ్చుకొనేవాడా! (సామవేదాన్ని ప్రియంగా వినేవాడా అని భావము).

2. జనకుని కుమార్తె అయిన సీతాదేవికి బాగా ఇష్ట మయినవాడా! శివునిచే సాధింపబడిన తారక మంత్రమునకు మూలమయినవాడా! (ఓం రామాయనమః" అను ఆ అక్షరముల మంత్రము తారక మంత్రము. కొంద "ఓం శ్రీరామరామ" అనునదే తారకమని అందురు. రాముడు తారక మంత్రమునకు మూలకారకుడని కవి సన్నుతి) మానవులకు కీడు కలిగించేదాన్ని నశింపచేయువాడా! నా పాపాలను నిర్మూలించువాడా!

3. శ్రీవేంకటేశ్వరుని రూపంలో ప్రకాశిస్తున్న వాడా! త్యాగాలతో ప్రోగు అయిన

రఘు వంశాన్ని ప్రకాశింపచేయువాడా! ఆత్మ (= భావ) సంతోషాన్ని కలుగచేయువాడా! అవమానము, ఓటమి లేని అందమైన ధనుస్సు కలవాడా ! నీకు జయము.



## *80. శ్రీమన్నారాయణ (01-155)*

**శ్రీమన్నారాయణ శ్రీమన్నారాయణ**
**శ్రీమన్నారాయణ నీ శ్రీపాదమే శరణు**

**1. కమలాసతి ముఖ కమల హిత**
**కమలాప్రియ కమలేక్షణా**
**కమలాసనహిత గరుడగమన శ్రీ**
**కమల నాభా నీ పద కమలమే శరణు**

**2. పరమ యోగిజన భాగధేయ శ్రీ**
**పరమ పురుషా పరాత్పరా**
**పరమాతుమ పరమాణురూప శ్రీ**
**తిరు వేంకటగిరి దేవ శరణు**

**ముఖ్యమైన అర్థాలు :** నీ శ్రీపాదమే = కాంతితో కూడిన నీ పాదాలను; కమలాసతి ముఖ = = కమలమువంటి మోము కలిగిన నీ భార్య లక్ష్మీదేవికి; కమలాసనహిత = బ్రహ్మకు హితం చేసేవాడివి; గరుడగమన = గరుత్మంతుడు వాహనముగా కలవాడు; భాగధేయ = గమ్యస్థానానివి; పరమ పురుషా = ఓ పరబ్రహ్మ!; పరాత్పరా = శ్రేష్ఠులందరికీ శ్రేష్ఠుడా!; తిరు వేంకటగిరి = శుభకరమైన వేంకటాద్రి.

**తాత్పర్యము :**

ఓ శ్రీమన్నారాయణా! కాంతితో కూడిన నీ పాదాలను నేను శరణు కోరుచున్నాను.

1. స్వామీ! కమలమువంటి మోము కలిగిన నీ భార్య లక్ష్మీదేవికి, నువ్వు సూర్యుడివంటి వాడివి. నీ భార్య కమలకు నువ్వు మేలు చేకూర్చేవాడివి. నీ చూపులు కమలాలు. నువ్వు పద్మంలో కూర్చునే బ్రహ్మకు హితం చేసేవాడివి. నువ్వ గరుత్మంతుని మీద విహరిస్తుంటావు. నువ్వు కమలనాభుడివి. కాంతితో కూడిన నీ శ్రీపాదాలను నేను శరణు కోరుచున్నాను.

2. స్వామీ! విశిష్టులైన యోగులందరికి నువ్వు గమ్య స్థానానివి. నువ్వు పరబ్రహ్మవు. పరాత్పరుడివి. నువ్వే పరమాత్మవి. నువ్వు పరమాణువు రూపంలో కూడ ఉంటావు. శుభకరమైన వేంకటాద్రి మీద కొలువైన ప్రభూ! వేంకటేశ్వరా! నిన్ను శరణు కోరుచున్నాను.

**విశేషాలు :**

శ్రీమత్, నారాయణ అను రెండు పదాలు కలిస్తే శ్రీమన్నారాయణ అని ఏర్పడింది. శ్రీమత్ అంటే శుభకరమైన, సంపత్కరమైన అని అర్థం. శ్రీమన్నారాయణ అంటే శుభాన్ని, సంపదలను ప్రసాదించే నారాయణుడా! అని అర్థం వస్తుంది. నారమంటే నీరు. నీరు స్థానముగా కలిగిన భగవంతుడు నారాయణుడు.

దేవాలయానికి వెళ్లినప్పుడు పూజారి నెత్తి మీద స్వామివారి పాదాలు గుర్తుగా ఉన్న శఠగోపం ఉంచుతారు. స్వామివారి పాదాలు తల మీద ధరిస్తూ 'స్వామీ! నా తలపుల్లో సదా ఉంటూ, నన్ను రక్షించవయ్యా' అని భక్తితో స్వామి పాదాలను భక్తుడు వేడుకొంటాడు. ఇదే అన్నమయ్య 'నీ పాదాలకు శరణు' అని చెప్పాడు.

కం అంటే నీరు. దానిని అలంకరిస్తుంది కనుక పద్మానికి కమలం అని పేరు వచ్చింది. లక్ష్మి అమ్మవారికి కూడ కమల అని పేరు. (కామ్యత ఇతి – కోరబడినది) అన్నమయ్య ఈ కీర్తనలోని మొదటి చరణంలో కమల శబ్దాన్ని రకరకాలుగా ప్రయోగించాడు. యోగ శాస్త్రం ప్రకారం బ్రహ్మరంధ్ర స్థానంలో ఉండే సహస్రార చక్రాన్ని కమలంతో పోలుస్తారు. ఇది మోక్షానికి గుర్తు.

అన్నమయ్య లక్ష్మీదేవి ముఖం కమలంలా ఉందన్నా, కమలంలో బ్రహ్మ కూర్చున్నాడన్నా, బొడ్డు లో కమలం ఉందన్నా – ఈ విశేషాలన్నీ మానవుడి తుట్ట తుది గమ్యం మోక్షాన్ని (సహస్రార చక్రకమలం) గూర్చి ఆలోచించమని ప్రబోధించమని చెప్పటానికే. అంతేకాని, అమ్మవారి ముఖం అందమైన కమలమట – అనే స్థాయిలోనే ఆలోచనలు ఆగిపోతే – వాడి సంస్కారం అంతవరకే.

కమలమన్నా, తామరపువ్వన్నా ఒకటే. అది మన జాతీయ కుసుమం మాత్రమే కాదు. జాతిని ఉద్ధరించే సహస్రారానికి గుర్తు.

పురమంటే శరీరం. దానిలోపల ఉండేవాడు పురుషుడు. అనగా ఆత్మ. ఈ పురుషుడినే అన్నమయ్య రెండో చరణంలో పరమపురుషుడన్నాడు. పురుషుడన్నా, పూరుషుడన్నా ఒకటే. ప్రాణులలో గొప్పవాడు అనే అర్థంలో ఈ రెండు పదాలు ఉన్నాయి.

ఆతుమ, ఆద, ఇచ్చ – అనేది ఆత్మకి పర్యాయపదాలు. అన్నమయ్య ఆత్మని – ఆతుమ అని వాడుతుంటాడు. అందుకే ఈ కీర్తనలో పరమాతుమ అని ప్రయోగం. పింగళి సూరన కళాపూర్ణోదయంలో కూడా ఆతుమ అని ప్రయోగం కనబడుతోందని రవ్వా శ్రీహరిగారు పేర్కొన్నారు. (అన్నమయ్య పదకోశం – 40 పే.) అన్నమయ్య ప్రభావమది.

భాషాపరమైన ఇంకొక చమత్కారము ఈ కీర్తన పల్లవిలో కనబడుతోంది. 1. శ్రీమన్నారాయణ, 2. శ్రీ మన్నారాయణ, 3. శ్రీ మన్నారాయణ అని మూడు సార్లు స్వామివారి సంబోధన చేయటంలో పరమార్థం 'శ్రీపాదమే' అను తరువాతి పదంలో కనబడుతుంది. శ్రీ మన్నారాయణ అను పదం మూడు సార్లు ప్రయోగించ బడింది. స్వామివారి శుభకరమైన 'శ్రీపాదం' వామనావతారంలో కోరినది కూడ మూడు అడుగులే. దీనిని స్ఫురింపచేయటానికే శ్రీ మన్నారాయణ అని మూడు సార్లు సంబోధన. ఆ పాదాన్ని శరణు కోరితే ప్రహ్లాదుడిలా రక్షింపబడతాం. అలసత్వంలతో బద్ధకిస్తే 'బలి' అయిపోతాం. అన్నమయ్య గురువు మనకు చేసిన ప్రబోధమిదే.

రెండవ చరణమంతా కమల శబ్దమయం. నీపద కమలమే శరణమేని అందమైన ముగింపు. రెండవ చరణమంతా పరమ మయం. ముగింపు సంబోధన తిరు (= పరమ పవిత్ర) మయం. భావానికి భావం. శబ్దానికి శబ్దం. వేటి మీద పరిశోధన చేస్తే – కొత్త కొత్త విషయాలు ఎప్పటికప్పుడు అన్నమయ్య కీర్తనలో స్ఫురిస్తుంటాయి.



## *81. శ్రీశోయం సుస్థిరోయం*

(కీర్తన సంఖ్య 264 సంపుటము 1)

**శ్రీశోఽయం సుస్థిరోయం**
**కౌశికమఖరక్షకోఽయం**

**1.నిగమనిధినిర్మలోఽయం**
**జగన్మోహనసతీపతిం**
**విగత భయోఽయం విజయసఖోఽయం**
**భృగుమునినా సంప్రీతోఽయం**

**2.సకలపతి శ్శాశ్వతోఽయం**
**శుకముఖమునిజనసులభోఽయం**
**ప్రకటబహుళశోభనాధికోఽయం**
**వికచరుక్మిణీవీక్షణోఽయం**

**3.సరసోఽయం పరిసరప్రియోఽయం**
**తిరువేంకటాధిపోఽయం**
**చిరంతనోఽయం చిదాత్మకోఽయం**
**శరణాగతవత్సలోఽయం ॥**

**తాత్పర్యము :**

ఇతడు లక్ష్మీదేవికి ప్రభువు. ఇతడు స్థిరమైనవాడు. కుశికపుత్రుడయిన విశ్వామిత్రుని యాగాన్ని రక్షించిన వాడు ఇతడే.

1. వేదములకు మూలమైన వాడు ఇతడే. మంచివాడు ఇతడే. ప్రపంచాన్ని మోహింపచేసే అందం కలిగిన లక్ష్మీదేవి భర్త ఇతడే. భయమనేదానికి దూరమైన వాడు ఇతడే. అర్జునునికి మిత్రుడైన వాడు ఇతడే. భృగుమునికి బాగా ఇష్టమైన వాడు ఇతడే.

2. సకల జగత్తుకు నాథుడు ఇతడే. శాశ్వతుడు ఇతడే. శుకుడు మొదలైన ముని జనులకు సులభుడు ఇతడే. ప్రకటించబడిన అనేక శుభాలతో అధికుడు ఇతడే. (అనేక శుభ కారకుడు ఇతడే. అని భావం). వికసించిన కన్నులు కలిగిన రుక్మిణీదేవి చూపుల కేంద్రము ఇతడే.

3. సరసుడు ఇతడే. పరిసరాల్లో ప్రియాన్ని నింపేవాడు ఇతడే. ఇతడే శ్రీ వేంకటాచలముపై ఉండువాడు. ఆది మూలమయిన వాడు ఇతడే. పరంజ్యోతి, పరంధాముడు, పరబ్రహ్మము ఇతడే. శరను అన్నవారిపట్ల వాత్సల్యము చూపించేవాడు ఇతడే.

**విశేషాలు :**

భృగుమునినా

1. బ్రహ్మమానసపుత్రులలో ఒకఁడు. కొందరు వరుణుని యజ్ఞమందలి అగ్నినుండి ఇతఁడు పుట్టినట్లు చెప్పుదురు. ఇతని పుత్రుఁడు కవి. పౌత్రుడు అసురులకు గురువు అయిన శుక్రాచార్యులు. ఇదికాక ఇతనికి ఖ్యాతివలన ధాత, విధాత అని ఇరువురు కొడుకులు కలిగిరి. అందు ధాతకు మృకండుఁడు, విధాతకు ప్రాణుఁడును జన్మించిరి. ప్రాణుని కొడుకు వేదశిరుఁడు. వేదశిరుని కొడుకు ఉశేనస్సు. మృకండుని కొడుకు మార్కండేయుఁడు. ఇతని మీసములను దక్షయాగమున వీరభద్రుఁడు పెకివేసినట్లు పురాణముల వలన తెలియవచ్చుచున్నది.

2. ఒక మహర్షి. ఇతఁడు భాగీరథీ దక్షిణతీరమున మహాపద్మము అనియెడు పురమునందు ఉండెను. ఇతఁడు ఒకప్పుడు అగ్నిహోత్రము చేయుటకు తన భార్య పులోమను అగ్నులను ఏర్పపుము అని ఆజ్ఞాపించి తాను స్నానము చేయుటకై

నదికిపోయెను. అప్పుడు పులోముండు అను దానవుండు ఒకండు అచ్చటికి వచ్చి అగ్నిదేవునివలన ఆమె ఇతని భార్య అని ఎఱిగి ఆమెను ఎత్తుకొనిపోవ యత్నింపంగా వెపుచేత పూర్ణ గర్భిణి అయిన అమె తత్తపడునపుడు గర్భము భేదిల్లి గర్భస్రావము అయ్యెను. ఆస్రావమైన పిండము చ్యవనుండు అనంబరంగిన ఋషి అయి తన కోపపు చూపు చేతనే ఆ రక్కసుని భస్మము చేసెను. ఇది అంతయు భృగుమహర్షి ఎఱింగి అగ్నిమీంద అలిగి అతనిని సర్వభక్షకుండవు కమ్ము అని శపియించెను. అట్లైనను బ్రహ్మ అగ్ని యొక్క శుచిత్వమునకు లోపము కాకుండునట్లు అనుగ్రహించెను. (పురాణనామచంద్రిక (యెనమండ్రం వెంకటరామయ్య) 1879 )

త్రిమూర్తులలో అధికుడెవరు అనే చర్చ వచ్చి మునులు ఆ విషయం తెలుసుకురమ్మని భృగుమహర్షిని పంపారు. భృగువు ముందు బ్రహ్మ దగ్గరకి వెళ్లాడు. ఆయన మునిని చూచి చూడనట్లు ఉపేక్షించాడు. భృగువు కోపంలో పూజకి పనికి రావు అని బ్రహ్మను శపించి కైలాసంకు వెళ్లాడు. అక్కడ శివపార్వతులు నృత్యంచేస్తూ భృగువును పట్టించుకోలేదు. కేవలం నీ లింగానికి మాత్రమే అభిషేకం జరుగును అని శివుని శపించి భృగువు వైకుంతానికి వెళ్లాడు. అక్కడ కూడా విష్ణువు కళ్లు మూసుకొని తనను గౌరవించలేదని తన కాలితో తన్నాడు. అయినా విష్ణువు వినయంతో భృగువుకు కాళ్లు నొక్కుతూ ఆయన పాదంలో ఉన్న కన్నును నొక్కివేసాడు. అలా అహంకారం పోయి భృగువు మెచ్చుకొని విష్ణువుని స్తుతించాడు. అందరిలోకి విష్ణువే గొప్ప అని నిర్ణయించాడు. ఈ వృత్తాంతాన్ని స్ఫురింపచేస్తూ అన్నమయ్య భృగుమునినా సంప్రీతోయం అన్నాడు.



## *82. శ్రీహరి నిత్యశేషగిరీశ*

(కీర్తన సంఖ్య 527 సంపుటము03)

**శ్రీహరి! నిత్య! శేషగిరీశ**
**మోహనాకార !ముకుంద !నమో ! శ్రీహరి!**

**1.దేవకీ సుత దేవ వామన**
**గోవిందా గోప గోపీనాథా! శ్రీహరి!**
**గోవర్ధనధర గోకులపాలక**
**దేవేశాధిక తే నమో నమో ॥**

**2.సామజావన! శార్గపాణి!**
**వామనా! కృష్ణ! వాసుదేవ శ్రీహరి!**
**రామనామ ! నారాయణ! విష్ణో**
**దామోదర శ్రీధర నమో నమో ॥**

**3.పురుషోత్తమ పుండరీకాక్ష**
**గరుడధ్వజ కరుణానిధి శ్రీహరి**
**చిరంతనాచ్యుత శ్రీవేంకటేశ్వర**
**నరమృగ తే నమో నమో ॥**

**తాత్పర్యము :**

ఓ శ్రీహరీ ! నిత్యుడా! శేషాచలమునకు ప్రభువా! మోహనమైన ఆకారము కలవాడా! మోక్షమునిచ్చువాడా ! నీకునమస్సులు.

1. దేవకీదేవి కుమారుడా! ప్రకాశించువాడా! వామనావతారమెత్తినవాడా! గోవిందుడా! గోపాలకులకు, గోప కాంతలకు నాథుడా! శ్రీ హరీ ! గోవర్ధన పర్వతమును ధరించిన వాడా ! గోకులమును పాలించువాడా! దేవతలకు ప్రభువా ! అధికుడా! నీకునమస్సులు. నమస్సులు.

2. గజమును కాపాడిన వాడా ! శార్ఙ్గమను ధనుస్సును చేతియందు కలవాడా ! వామనావతారమెత్తిన వాడా ! కృష్ణుడా ! వసుదేవుని కుమారుడా ! రాముడను పేరు కలిగిన వాడా! నారాయణుడా ! ఓ విష్ణు మూర్తీ ! దామోదరుడా ! లక్ష్మిని ధరించిన వాడా! నీకునమస్సులు. నమస్సులు.

3. ఓ పురుషోత్తముడా ! తెల్ల తామరలవంటి కన్నులు కలవాడా ! గరుడుని గుర్తు కలిగిన జెండా కలిగినవాడా ! దయకు నిధివంటి వాడా! శ్రీహరీ! చిరంతనుడా! (అనేక రోజులనుంచి , చిరకాలం నుంచి ఉన్నవాడా) అచ్యుతుడా ! శ్రీ వేంకటేశ్వరుడా! నరసింహావతారము ధరించిన వాడా ! నీకునమస్సులు.నమస్సులు.

**విశేషాలు :**

శార్ఙ్గపాణి!

శార్ఙ్గము అనునది విష్ణువు యొక్క విల్లు. శృంగము (కొమ్ము) తో జేయబడినది. కృష్ణునికి అనేక పేర్లు ఉన్నాయి. అందులో దామోదర ఒకటి. ఇది మహా మంత్రం.

దామోదర

దామము అంటే తాడు. ఉదరము అంటే పొట్ట. అంటే తాడుతో కట్టబడిన పొట్ట కలవాడు అని అర్థం. దామములు అంటే లోకములు. ఉదరము అంటే

లోపలిభాగము. అందుకే పోతన "జగజ్జాలములున్న బజ్జ గట్టన్ వశమే?" అన్నారు.

ఏకాదశీ వ్రతాలు చేసేటప్పుడు మార్గశిరమాసం నుంచి మొదలుపెట్టి కార్తీకమాసంతో పూర్తి చేస్తుంటారు. ఒక్కొక్క మాసంలో ఒక్కొక్క పేరుతో కృష్ణుణ్ణి పిలుస్తుంటారు. మార్గశిరమాసంలో కేశవ, ఇలా కార్తీకానికి దామోదరనామం వస్తుంది. అందుకే కార్తీక దామోదర అంటారు. రోటిని కదిలించుకుంటూ వెళ్ళి రెండు మద్ది చెట్లను కూల్చటమంటే అజ్ఞాన బంధనాలు త్రెంచి మోక్షమును, జ్ఞానాన్ని ప్రసాదించుట అనేది అంతరార్థం. "దామోదర! గుణమందిర సుందరవదనారవిందగోవిందా" అని విష్ణు షట్పదీ స్తోత్రంలో శంకరుల వారు అన్నారు.



## *83. సకలం హేసఖి జానామి*

**సకలం హేసఖి జానామి తత్**
**ప్రకట విలాసమ్ పరమం దధసే**

**1. అలిక మృగమదమయమషీకలనో**
**జ్జ్వలతాం హేసఖి జానామి**
**లలితం తవ పల్లవిత మనసి ని**
**శ్చల తర మేఘ శ్యామం దధసే**

**2. చారు కపోల స్థల కరాంచిత వి**
**చారం హేసఖి జానామి**
**నారాయణమహినాయక శయనం**
**శ్రీరమణం తవ చిత్తే దధసే**

**3. ఘనకుచ శైలాగ్ర స్థిత విధుమణి**
**జననం హేసఖి జానామి**
**కనదురసా వేంకటగిరిపతే**
**ర్వినుతభోగ సుఖ విభవం దధసే.**

**ముఖ్య పదార్థం :**

హేసఖి = ఓ స్నేహితురాలా!; సకలం = అంతా; జానామి = నాకు తెలుసులేవే!; తత్ ప్రకట విలాసమ్ = ఆ ప్రకటించిన విలాసాలతో; పరమం = ప్రధానమైనవాడిని; దధసే = ధరిస్తున్నావు; తవ మనసి = నీ మనస్సులో; మేఘ శ్యామం = నల్లని మేఘము వంటి రంగు కల వేంకటేశ్వరుడు; పల్లవిత = వ్యాపించి; నిశ్చల తర = చలించక ఉన్నాడని చెప్పటానికి; అలి (లీ) క = నీ నుదుటిమీద; మృగమదమయ = కస్తూరి; మషీకలనోజ్జ్వలతాం = నల్లగా మెరిసేట్టు; చారు = అందమైన; కపోలస్థల = నీ చెక్కిలియందు; కరాంచితవిచారం = చేయెందుకు పెట్టావో;

అహినాయక = ఆదిశేషుడనే; శయనం = పాన్పుమీద; నారాయణమ్ = నారాయణుని; శ్రీరమణం = శ్రీ లక్ష్మీదేవికి ఇష్టుని; తవచిత్తే = నీ మనస్సులో తలుస్తున్నదానికి గుర్తుగా; ఘన = ఉన్నతమైన; కుచశైలాగ్ర స్థిత = స్తన పర్వతాలపైన ఉన్న; విధుమణి = చంద్రుడనే మణి; జననం = పుట్టుకలు; కనకదురసా = ప్రకాశించు వక్షస్థలంతో; వేంకటగిరిపతేః = వేంకటేశ్వరుని యొక్క; వినుత = కొనియాడదగిన; భోగసుఖ విభవం = సంభోగ సుఖ వైభవానికి గుర్తుగా;

**భావం :**

ప్రియునితో క్రీడించి అలసిన ఒక నాయికను వేరొక చెలికత్తె మాటలతో ఆటపట్టిస్తున్నది.

ఓ స్నేహితురాలా! అంతా నాకు తెలుసులేవే! ఆ ప్రకటించిన విలాసాలతో ప్రధానమైన వాడిని నువ్వు ధరిస్తున్నావు. నీ నుదుటిమీద కస్తూరి నల్లగా మెరిసేట్టు ఎందుకు పెట్టావో నాకు తెలుసులేవే! నీ మనస్సులో నల్లని మేఘమువంటి రంగు కల వేంకటేశ్వరుడు వ్యాపించి చలించక ఉన్నాడని చెప్పటానికి నీ నుదుటిమీద కస్తూరి నల్లగా మెరిసేట్టు ధరిస్తున్నావు.

అందమైన నీ చెక్కిలి మీద చేయెందుకు పెట్టావో నాకు తెలుసులేవే! ఆదిశేషుడనే పాన్పుమీద చెక్కిలిపై చేతిని ఉంచి పడుకొన్న – శ్రీ లక్ష్మీదేవికి ఇష్టుడైన నారాయణుని – నీ మనస్సులో తలుస్తున్నదానికి గుర్తుగా ఆ చెక్కిట చేతి ముద్రను ధరిస్తున్నావు.

ఉన్నతమైన నీ స్తన పర్వతాలపైన ఉన్న చంద్రుడనే మణి పుట్టుకలు ఎందుకో నాకు తెలుసులేవే! ప్రకాశించు వక్షస్థలంతో వేంకటేశ్వరుని యొక్క సంభోగ సుఖ వైభవానికి గుర్తుగా చంద్రాకారంలో ఉన్న నఖక్షతాలు ధరిస్తున్నావు.

నాయిక కళ్లు ఇంకా మీదిమీదికి వ్యాపిస్తాయేమోనని మన్మథుడికి బెంగ వచ్చిందట. (కళ్లు విశాలంగా ఉన్నాయని చమత్కారం) అందుకని కళ్లు ఇంకా వ్యాపించకూడదని ఒక అడ్డుకట్ట పెట్టాలనుకొన్నాడట. చెక్కిలిమీదికి చెమటతో జారిన కస్తూరి బొట్టు అదేనని పెద్దన భావన. (మను. 2-32) పెద్దన అలా కస్తూరిని చేస్తే అన్నమయ్య కస్తూరిని ఏకంగా స్వామివారి గుర్తుగా ఈ కీర్తనలో మార్చారు.

స్వామివారు నల్లగా ఉంటాడంటే (నీలమేఘ శ్యాముడు) కొంతమంది మనస్సులు ఊరుకోలేక ఒక చమత్కారమయిన సమన్వయం చెప్పారు. స్వామివారు

అసలు ఆకుపచ్చటి రంగులో ఉంటారు. దూరం నుంచి చూసేవారికి నల్లగా కనబడతారని వారి వాదన. కావాలంటే దూరంగా ఉన్నవారికి ఆకుపచ్చని ఆకు నల్లగా కనబడిందని తిక్కనగారు రాసారా లేదా? (విరా. 4-50) అనిదబాయిస్తారు. సంస్కృతంలో భవభూతి ఆకురంగు నల్లగా ఉంటుందని రాసాడు. (ఉత్త. 1వ అంకం) అంతమాత్రాన ఆకు రంగు నలుపు అయిపోతుందా? నీలమేఘ శ్యాముడంటే స్వామి నల్లనివాడవుతాడా! అని ఇంకో దబాయింపు, నిరాకారుడు, సాకారుడు అయిన స్వామి ఈ రంగుల గొడవ పట్టించుకోడు కాని భక్తుల మనస్సులు ఊరుకోవు. అతడు పచ్చని వాడయినా, నల్లనివాడయినా నమ్ముకొన్న భక్తులకు చల్లనివాడు. ఇది అందరూ ఒప్పుకొనే సత్యం.

"రాధికా కృష్ణారాధికా" అను అష్టపదిలో జయదేవుడు "త్యజతి న పాణితలేన కపోలం" (రాధ తన చెక్కిలి మీద చేర్చిన చేయి ఎంత ఎంతసేపటికి తీయటం లేదు) అన్నాడు. అన్నమయ్య కూడా జయదేవుని ప్రభావంతో "చారు కపోల స్థలకరాంచిత విచారం" (చెక్కిట చేతి ముద్ర ఉంచి విచారం చెందుట) అన్నాడు.

ప్రియుని చూసిన వేళ నాయికకు ముఖంలోను, చూపుల్లోను కలిగే అందమైన మార్పులను విలాసంమంటారు. అన్నమయ్య వర్ణించిన ఈ కీర్తనలో నాయిక దగ్గర ప్రియుడు లేడు. అయినా "నీ ముఖంలో విలాసాల సంగతి నాకు తెలుసులేవే!" అని సఖి ఆటపట్టిస్తోంది. నాయకుడు దగ్గర లేకపోయినా అతను ఎదురుగా ఉన్నట్లు భావించుకొని నాయిక పరవశిస్తోందనే మనోహరమైన వ్యంగ్య భావాన్ని అన్నమయ్య ఇక్కడ చెప్పాడు. సీతను చూసానని హనుమంతుడు చెప్పిన వెంటనే చలికాలంలో కోతులు ఆయన మీద కోపగించుకొన్నాయని ఒక కవి రాసాడు. మంచి వార్తేకదా ఆయన చెప్పింది. కోపమెందుకని మనకు అనిపిస్తుంది. సీత కనబడనంతవరకు రాముడు విరహంలో ఉన్నాడు. ఈ విరహపు వేడిలో కొండగుహలన్ని వేడెక్కి ఉండటం వల్ల కోతులకు వెచ్చగా అనిపించి హాయిగా ఉన్నాయి. ఎప్పుడయితే హనుమంతుడు సీతను చూసానని చెప్పాడో రాములవారి విరహం తగ్గింది. కొండ గుహలలో వేడి తగ్గింది. వెచ్చదనం కోల్పోయిన కోతులు హనుమంతుడిమీద కోపగించుకొన్నాయని భావం. ఇటువంటి మనోహరమైన, వ్యంగ్యార్థం అన్నమయ్య విలాస భావంలో కనబడుతుంది.

"జయజయ సర్వేశ" అను నృసింహ కీర్తనలో కూడా అన్నమయ్య 'అహినాయక' శబ్దాన్ని వాడాడు. ప్రస్తుత కీర్తనలో 'అహినాయక శయనం' అంటే

అక్కడ 'అహినాయక సింహాసన రాజిత' అన్నాడు. విష్ణువు అహినాయకునిమీదే (ఆదిశేషుడు) ఎందుకు పడుకొన్నాడనేది ఒక ప్రశ్న. స్వామి పడుకొన్న ఆదిశేషుడు కాలానికి ప్రతీక. శేషమంటే మిగిలినది అని అర్థం. కాలం కూడా ఎప్పుడు మిలిగే ఉంటుంది. దానికి అంతం లేదు. 'అంతం లేని కాలం నా అధీనంలోనే ఉంద'ని చెప్పటానికి స్వామి దానిని వశపరచుకొని దానిమీద శయనిస్తున్నాడు.

ఈ శృంగార కీర్తన వెనుక ఆధ్యాత్మిక వాతావరణం ఉంది. సఖి అనేది ఒక గురువుకు సంకేతం. జీవాత్మ నాయిక. పరమాత్మ నాయకుడు. జీవాత్మకి పరమాత్మకి మధ్య సయోధ్య చేసేవాడు గురువు. ఈ కీర్తనలోని సఖి అటువంటి గురువుకి ప్రతీక. ఉత్తమ గురువుకి ఈ ప్రపంచంలో తెలియనిది ఏమీ లేదు. "అతడు బ్రహ్మవేత్త, జిజ్ఞాసువు. అందుకే అతనిని శరణువేడాలంటో"ంది శ్రీమద్భాగవతం. (తస్మాత్ గురుం... 11-3-21) 'స గురుమేవాభిగచ్ఛేత్' (ఉత్తమ గురువును చేరండి) అని ఉపనిషత్తు. అటువంటి గురువుకి సకలం తెలుసునని అన్నమాచార్యుడు 'సకలం హేసఖి జానామి' అని మరోమారు మనకి ప్రబోధిస్తున్నాడు. లోతును అర్థం చేసుకొన్న వారికి సకలం తెలుస్తుంది. లేదా – కొద్దిపాటి శృంగార భావాలతో తృప్తిపడతారు.

జీవుడికి పరమాత్మతో ఆరు రకాలుగా సంబంధముంటుందని పెద్దలు చెబుతారు. 1. పరమాత్మకే తప్ప జీవుడు ఇతరులకు చెందడు. 2. పరమాత్మ తప్ప ఇంకా వేరే ఎవరూ కాపాడేవారు లేదు. 3. పరమాత్మ తప్పించి ఇంకా వేరే ఎవరూ అనుభవ సమర్థులు కారు. 4. పరమాత్మతో కలిసి ఉండటమే సుఖం. 5. పరమాత్మకి దూరమయితే శోకం 6. పరమాత్మనుద్దేశించి జీవుని సకల వ్యవహారాలు. అన్నమయ్య శృంగార కీర్తనను ఈ సంబంధాల నేపథ్యంలో అర్థం చేసుకోవాలి. నాయికా నాయకుల మధ్య ఈ విధమైన జీవాత్మ పరమాత్మల సంబంధవర్ణన జయదేవుడు మొదలైన భక్తకవులందరి రచనలలోను కనిపిస్తుంది.

స్వామిని ధరించటం, స్వామిని తెలిపే కస్తూరి బొట్టును ధరించటం, స్వామిని అనుకరిస్తూ చెక్కిట చేయి చేర్చటం – ఇటువంటి నాయికా చేష్టలన్నీ పరమాత్మనుద్దేశించి జీవుని సకల వ్యవహారాలు ఉండటమనే సంబంధాన్ని తెలుపుతాయి. భగవంతుడి పేరైన తత్‌శబ్దం కూడా వాడటం (తత్ ప్రకట విలాసం) కూడా ఈ కీర్తనలోని ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని తెలియజేస్తుంది. కీర్తనలో దధసేకు బదులు 'ధత్సే అని యుండబోలు'నని టిటిడి ప్రచురణలో ఉంది. (5వ సం. -22 కీ.)

ఉత్తమ కవితా ప్రపంచంలో పదకవితా పితామహుడు అన్నమయ్య అంటే భావుకులకు వేంకటేశుడి చిరునవ్వుగా తోస్తాడు. ఆ చిరునవ్వు సుగంధాల పూలతోట ఈ కీర్తన.



## *84. సతతం శ్రీశం*

(కీర్తన సంఖ్య 165 సంపుటము 01)

**సతతం శ్రీశం**
**హితం పరాత్పర మీడే**

**1.గదాధరం మేఘగంభీరని-**
**నదం పరమోన్నతశుభదం**
**మృదుతరగమనం మేదినీధరం**
**హృదయనిలయ మహ మీడే**

**2.నందకధరం జనార్దనం గో-**
**విందం చారుముకుందం**
**నందగోపవరనందనకందం**
**యిందురవినయన మీడే**

**3.గరుడగమన మురగశయన మధికం**
**పరమపదేశం పావనం**
**తిరువేంకటగిరిదేవ మతులం మ-**
**హీరమణం స్థిర మీడే ॥**

**తాత్పర్యము :**

ఎప్పుడూ లక్ష్మీ నాథుని, నాకు హితము కలిగించే వాడిని, శ్రేష్ఠులకందరికి శ్రేష్ఠుడైన వానిని వేంకటేశుని ప్రార్థిస్తాను.

1. కౌమోదకి అనే గదను ధరించిన వానిని, నిండు మేఘములా గంభీరముగా మాట్లాడు వానిని, బాగా ఉన్నతమైన శుభాలను ఇచ్చు వానిని, మెత్తని నడక (నడవడిక) కలవానిని, భూదేవిని వరాహావతారంలో ధరించిన వానిని, నా హృదయము ఇల్లుగా కల వేంకటేశుని నేను ప్రార్థిస్తాను.

2. నందకమను ఖడ్గాన్ని ధరించిన వానిని, రాక్షస జనులను హింసించువానిని, గోవులను రక్షించువానిని, అందమైన మోక్షము నిచ్చువానిని, నంద గోపుని ఉత్తమ పుత్రుడైన నల్లని మేఘ శరీరుని, సూర్య చంద్రులు కన్నులుగా కల వేంకటేశుని నేను ప్రార్థిస్తాను.

3. గరుత్మంతునిపై విహరించువానిని, ఆదిశేషునిపై శయనించువానిని, అధికుని, గొప్పదైన మోక్షము ఇచ్చువానిని, పావన రూపుని, శుభమైన వేంకట పర్వతముపై ఉన్న దేవుని, సాటి లేని వానిని, భూదేవికి ఇష్టమైన వానిని, స్థిరమైన వానిని, వేంకటేశుని నేను ప్రార్థిస్తాను.

**విశేషాలు :**

శంఖ, చక్ర, గదా, పద్మాలు హరి నాలుగు చేతులలో ఉంటాయి. ఇవి శబ్దస్పర్శరూపరసగంధాలకూ, ధర్మార్థ కామమోక్షాలకూ ప్రతీకలు విశ్వమనే చెట్టుకి వేదాలు ఆకులవంటివి. ఈ మహావృక్షంపై ఉన్న రెండు పక్షులలో. ఒకటి కమ్మని పండ్లను తింటుంది. మరొక పక్షి అది చూసి ఆనందిస్తుంది. ఆనందాన్ని ఆస్వాదించే పక్షి సుపర్ణం. అదే ఆ దేవదేవుని దివ్యవాహనం గరుత్మంతుడు. పంచభూతాలతో కూడిన పార్థివ శరీరానికి ప్రతీక పాంచజన్యం. లోకాన్నంతా ఆనందనిలయంగా మార్చే దివ్యమైన ఆయుధానికి సంకేతం నందకం అనే ఖడ్గం.

పరబ్రహ్మ నోట వెలువడే వాక్కుకి ప్రతీక కౌమోదకి గద. ప్రపంచంలోని తియ్యని నాదాలకు ఆమోదమై, భూమికి మోదమై, ఉండే దివ్యాయుధం కౌమోదకి. పోయ్ గై ఆళ్వారును శ్రీవారి శంఖు పాంచజన్యం గా, భూతత్తాళ్వారును శ్రీవారి గద కౌమోదకి గా, పేయాళ్వారును నందక ఖడ్గంగా, తిరుమలశై యాళ్వారును సుదర్శన చక్రంగా, కులశేఖరాళ్వారును కౌస్తుభమణిగా చెబుతుంటారు. అన్నమయ్యను నందకాంశ సంభూతునిగా చెబుతుంటారు.



## *85. సదయ మానస సరోజాత (6-162)*

**సదయ మానస సరోజాత మాదృశవశం**
**వద ముదాహం త్వయా వంచనీయాకిం**

**1.జలధి కన్యాపాంగ చారు విద్యుల్లతా**
**వలయ వాగురి కాంత వనకురంగ**
**లలిత భవదీక్షావిలాస మనసిజబాణ**
**కులిశ పాతైరహం క్షోభనీయాకిం**

**2.ధరణీ వధూపయోధరకనక మేదినీ**
**ధర శిఖర కేళితత్పర మయూర**
**పరమ భవదీయ శోభన వదన చంద్రాంశు**
**తరణికిరణైరహం తాపనీయాకిం**

**3.చతుర వేంకటనాథ సంభావయసి సం**
**ప్రతి యథా తత్ప్రకారం విహాయ**
**అతిచిర మనాగత్య హంత సంతాపకర**
**కితవ కృత్యై రహం ఖేదనీయా కిం**

**తాత్పర్యము :**

దయాజలంతో కూడిన మనస్సనే సరోవరానికి పద్మం వంటి వాడా! ఓ వేంకటేశ్వరా! నేను సులభంగా వశమయ్యేదానిని, చిన్నపాటి పనులచేత సంతోషించే దానిని. అటువంటి నేను నీచేత మోసగింపదగినదానినా? చెప్పవయ్యా!

1. లక్ష్మీదేవి కన్నుల చివర మెరిసే అందమైన మెరుపు తీగల వలయాలు కలిగిన, వలలోపల ఉన్న అందమైన లేడివంటి వాడా! నీ చూపులే విలాసముగా కలిగినవాడా! మన్మథ బాణాలనే వజ్రాయుధాలచేత నేను బాధపెట్టదగినదాననా?

2. భూదేవి యొక్క స్తనాలనే బంగారుకొండల శిఖరాల మీద ఆనందపు విహారములో ఆసక్తి కలిగిన నెమలి వంటి వాడా! నీఅందమైన ముఖమనే చంద్రుని కిరణాలనే సూర్య కిరణాల చేత నేను తాపముపొందదగినదానినేనా?!

3. ఓ చతురుడైన శ్రీనివాసా! ఇప్పుడు నన్ను ఆదరించు. ఏ విధంగా తగినదో ఆ విధంగా విడిచి ఆలస్యము కాకుండా నన్ను ఆదరించు. అయ్యో ! తాపము కలిగించు వాడా! మోసపు పనులచేత నేను బాధపెట్టతగినదానినా?

**విశేషాలు :**

దయాజలంతో కూడిన మనస్సనే సరోవరానికి పద్మం వంటి వాడా

ఒకరిని మంచి విశేషణాలతో పొగిడి , తరువాత ఆయన చేసిన చెడ్డపని చెబితే– "ఇట్లాంటి మంచి వాడివి. ఇలా చెడ్డ పని చేయటం తగునా "అని ధ్వని వస్తుంది. ఉత్తమ కవిత్వంలో ఇది వ్యంగ్య మర్యాద. నాయిక స్వామి వారిని "దయా నిధీ !" అని పొగిడింది. తరువాత నన్ను మోసం చేసావంటోంది. అంటే దయాపరులు మోసం చేయకూడదని వ్యంగ్యంగా చెబుతోంది.

జలధి కన్యాపాంగ చారు విద్యుల్లతా

స్వామి వారి చూపులు చాలా బాగుంటాయని మెట్టుకు పై మెట్టు వర్ణనలతో కవి పొగిడాడు.

1. లక్ష్మీదేవి కన్నుల చివర మెరిసే అందమైన మెరుపు తీగల వలయాలు కలిగినవి స్వామి వారి చూపులు. లక్ష్మీదేవి అప్యాయంగా ప్రేమతో స్వామి వారిని చూస్తోంది. లక్ష్మీదేవి ఇచ్చే సంపదలు మెరుపులు కాని, ఆవిడ చూపులు మెరుపులు. ఆవిడ గారు అలా చూస్తుంటే స్వామి వారి కళ్ల చుట్టూ మెరుపు తీగల వలయాలు ఏర్పడుతున్నాయి. అటువంటి మెరుపు తీగల వలయాలు ఉన్న తన కళ్లనుండి ఇప్పుడు ఇంకో నాయికను అయ్యగారు చూస్తున్నారని కవి వర్ణన.

2. వలలోపల ఉన్న అందమైన లేడివంటి వాడా! మెరుపు తీగల వలయాలు ఉన్న తన కళ్లనుండి ఇప్పుడు ఇంకో నాయికను చూస్తుంటే – అయ్యగారి చూపులు – మెరుపుల వలలో ఉన్న అందమయిన లేడి కన్నుల చూపులులా ఉన్నాయట. అద్భుతమయిన వర్ణనల మెట్లు. పరమ భవదీయ శోభన వదన చంద్రాంశు నీ అందమైన ముఖమనే చంద్రుని కిరణాలనే సూర్య కిరణాల చేత నేను తాపము పొందదగినదానినేనా?! ఇటువంటి వర్ణన చాలా తక్కువమంది కవులు మాత్రమే చేయగలరు. ఒక విరహిణి అయిన నాయిక స్వామి వారిచేత తాపము (smile emoticon వేడి, బాధ) పొందుతోంది. ఆ సమయంలో నేను తాపము పొందదగిన దానినేనా? అంటూ స్వామివారి ముఖచంద్రునినుంచి వచ్చే కిరణాలను సూర్య కిరణాలంటోంది నాయిక.

యధా తత్ర్పకారం విహాయ

"ఏ విధంగా తగినదో ఆ విధంగా విడిచి ఆలస్యము కాకుండా నన్ను ఆదరించు" అని నాయిక వేడికోలు. ఏ విధంగా తగినదో ఆ విధంగా ఆలస్యము కాకుండా నన్ను ఆదరించు" అంటే మాములుగా ఉండేది. కాని అన్నమయ్య విహాయ విడిచి) అని మధ్యలో కలిపాడు.

తగినది ఏవిధము?

లక్ష్మీదేవితో కలిసి ఉండటం తగిన విధము. దానిని విడచి – అంటే "లక్ష్మీదేవిని విడచి నన్ను ఆదరించు" అని నాయిక వేడికోలు.

ఉపసంహారము

అన్నమయ్య వర్ణనలకు అందని మహాకవి. ఇంత అని – కొన్ని ప్రమాణాలతో, ఆలంకారిక గ్రంథాలతో ఆయన కవితాశక్తిని నిర్ణయించలేము. ఆలంకారిక గ్రంథాలకు లక్షణాలకు అందని ఎన్నో ఉదాహరణలు అన్నమయ్య కీర్తనల్లో ఉంటాయి. ఆ కవితాశక్తి

అలౌకికమైన దైవీ శక్తి. ఆయన అనుగ్రహం తోటే కొన్ని వర్ణనల వివరణలు తెలుస్తుంటాయి.



## *86. సీతాశోక విఘాతక*

ఆంజనేయ స్వామిని పొగుడుతూ అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన. (కీర్తన సంఖ్య 366 సంపుటము 01)

**సీతాశోక విఘాతక ఓ**
**పాతాళలంకాపతి విభాళా**

**1.హనుమంతరాయ అంజనీతనయ వో**
**వనధిలంఘన గాత్ర! వాయుపుత్రా**
**యినకులాధిప నిజహిత! జగన్నుత**
**వనజోదర సేవకా సత్వధనికా**

**2.ప్రళయాంతక రూప బలదీప రవిఫల**
**గిళన ప్రతాప సుగ్రీవ ప్రియా**
**కుళక దానవ సంకుల విదారణా**
**భళిభళి జగత్పతి బలుబంటా**

**3.పంకజాసన దివ్యపద వైభవ ఓ**
**లంకిణీ ప్రాణ విలంఘన**
**వేంకటేశ్వరు సేవావీర ! మహాధీర**
**కింకరరాయ ! సుఖీభవ**

**తాత్పర్యము :**

సీతాదేవి శోకమును నాశనము చేసినవాడా ! ఓ పాతాళ లంకాధిపతి అయిన మైరావణుని సంహరించినవాడా!

1. హనుమంత రాజా ! అంజనీదేవి కుమారుడా! సముద్రము దాటిన శరీరము కలవాడా ! వాయుదేవుని కుమారుడా ! సూర్య వంశములో జన్మించిన రామునికి ఇష్టమైన వాడా!లోకము చేత పొగడబడినవాడా! శ్రీ కృష్ణుని (శ్రీరాముని) సేవకుడా! ప్రయత్నము అను ధనము సమృద్ధిగా కలవాడా!

2. ప్రళయ కాలములోని యమునివంటి రూపము కలవాడా! బలము చేత ప్రకాశించువాడా ! సూర్యుడను పండును మ్రింగిన ప్రతాపము కలవాడా ! సుగ్రీవునకు ఇష్టమైన వాడా! గుంపులుగా వ్యాపించిన (సంకుల) రాక్షసులను చీల్చినవాడా! సెబాసు! సెబాసు! ప్రపంచానికి ప్రభువైన శ్రీరాముని గొప్ప సేవకుడా!

3. బ్రహ్మ దేవుని దివ్య పదవీ వైభోగము భవిష్యత్తులో పొందేవాడా! ఓ లంకను కాపాడే లంకిణి అను రాక్షసి ప్రాణములకు తీవ్రంగా అడ్డు తగిలిన వాడా! వేంకటేశ్వరుని ( శ్రీరాముని)సేవలో వీరావేశము కలవాడా ! గొప్ప ధైర్యము కలవాడా! శ్రీరాముని సేవకులలో శ్రేష్ఠుడా ! సుఖముగా ఉండుము.

**విశేషాలు :**

హనుమానంజనాసూనుః వాయుపుత్రో మహాబలః
రామేష్టః ఫాల్గుణసఖః పింగాక్షోஉ మితవిక్రమః
ఉదధి క్రమణశ్చైవ సీతాశోక వినాశనః
లక్ష్మణ ప్రాణదాతాచ దశగ్రీవస్య దర్పహ
ద్వాదశైతాని నామాని కపీంద్రస్య మహాత్మనః
స్వాపకాలే పఠేన్నిత్యం యాత్రాకాలే విశేషతః
తస్యమ అత్యు భయంనాస్తి సర్వత్ర విజయీ భవేత్

అను ద్వాదశ నామములలో కొన్ని ఈ అన్నమయ్య కీర్తనలో వచ్చాయి.



## *87. సుముఖ మంగళము*

(కీర్తన సంఖ్య 419 సంపుటము 16)

**సుముఖ! మంగళము శుభ మంగళము**
**శమదమగత! తే జయమంగళం**

**1.గంభీరగుణ! కమలారమణా**
**శంభురాణి నుత సకలలోకయుత**
**మాంభజ - తే జయమంగళం**
**అంభోధిశయన !హరినయనా**

**2.కనకాంబర !నిజఘనచరణాంబర!**
**దనుజ శరణ! హతదైత్యగణా**
**అనుపమచరిత్ర ! అనంత నిరత**
**సనకప్రియ! తే జయ మంగళం**

**3.చతురుకోంగా! సదయాపాంగ**
**గతనక్రాంబుజకర చక్ర**
**శ్రితశరణాగత శ్రీవేంకటపతి**
**చతుర !నమో తే జయమంగళం**

**తాత్పర్యము :**

చక్కనిముఖము గలవాడా! విద్వాంసుడా ! ప్రసన్నుడా ! (సుముఖ!)నీకు శుభము, క్షేమము. కామక్రోధాదులు లేక యడగియుండుట చేత క్లేశమునోర్చు గుణము చేత (శమ) బాహ్యేంద్రియ నిగ్రహముచేత (దమ) పొందదగినవాడా! నీకు జయ మంగళము.

1. లోతుగల (= బాగా పరిశీలిస్తే గాని అంతుబట్టని) గుణములు కలవాడా! ఉత్తమురాలయిన లక్ష్మీ దేవికి ఇష్టమైనవాడా! రామావతారంలో శివుని రాణి అయిన పార్వతి చేత పొగడబడినవాడా ! అన్ని లోకములు కూడుకొనియున్నవాడా ! నన్ను సేవించు. నీకు జయమంగళము. పాలసముద్రములో శయనించువాడా ! సూర్య నయనా !

2. పట్టువస్త్రములు ధరించినవాడా ! తనదయిన గొప్పదయిన పాదముచే ఆకాశమును వామనావతారములో ఆక్రమించిన వాడా ! రాక్షసులకు శరణము ఇచ్చినవాడా ! చంపబడిన రాక్షస సమూహములు కలవాడా! పోలికలేని చరిత్ర కలవాడా ! అంతులేని ఆసక్తి కలవాడా ! సనకుడు, సనాతనుడు, సనందనుడు మరియు సనత్కుమారుడు. అను వారికి ఇష్టమైనవాడా!

3. నాలుగు చేతులు కలవాడా! కడకన్నులయందు (కళ్ల చివర) దయను కురిపించువాడా! పద్మములాంటి చేతిలోని సుదర్శన చక్రముతో మొసలిని సంహరించినవాడా! ఆశ్రితులకు శరణము అనుగ్రహించువాడా! శ్రీ వేంకటేశ్వరా! నేర్పు కలవాడా ! నమస్సులు. నీకు జయ మంగళము.

**విశేషాలు :**

మాంభజ

"నన్ను సేవించు." అనే మాట ఒక చెలికత్తె స్వామి వారిని ఆట పట్టిస్తూ చెప్పినట్లుగా భావించుకోవాలి. "ఈ కీర్తనలోని సంస్కృతము కొంత వింతగొల్పును " అని ఈ కీర్తనపై రాళ్లపల్లి వారు, గౌరిపెద్దివారు వ్యాఖ్యానము చేసారు. వారి మాటలతో అందరం ఏకీభవించవలసిందే. రేకులపై కీర్తనను చెక్కుటలో వచ్చిన లేఖన దోషములు అవి. స్వామి పాదాలలో జన్మించిన గంగమ్మ, ఈ కీర్తనలోని పాదాల దోషాలను కడుగుతుంది అనుటలో ఆశ్చర్యమేముంది?

(తాళ్లపాక పెద తిరుమలాచార్యులు రచించిన సంస్కృత కీర్తన.)



## *88.* సేవే భావే శ్రీ బృందం

(తాళ్లపాక పెద తిరుమలాచార్యులు రచించిన సంస్కృత కీర్తన. (కీర్తన సంఖ్య 175 సంపుటము 15)

**సేవే భావే శ్రీ బృందం**
**శ్రీ వల్లభ చింతానందం**

**1.పటుకుతర్కనగ భంజన దీక్షం**
**కుటిల దురిత హర గుణ దక్షం**
**ఘటిత మహాఫల కల్పక వృక్షం**
**చటుల రామానుజ శమదమభిక్షం**

**2.కృద్ధ మృషామత కుంఠన కుంతం**
**బౌద్ధాంధకార భాస్వంతం**
**శుద్ధ వేదమణి సుస్వరస్వంతం**
**సిద్ధాంతీ కృత చిన్మయ కాంతం**

**3.చార్వాక గహన చండకుఠారం**
**సర్వాపశాస్త్ర శతధారం**
**నిర్వికార గుణ నిబిడ శ్రీ వేంక**
**టోర్వీధర సంయోగ గభీరం**

**తాత్పర్యము :**

సేవిస్తున్నాను... భావిస్తున్నాను. లక్ష్మీ బృందాన్ని, శ్రీ వల్లభుని చింతించుటలో ఆనందాన్ని భావిస్తున్నాను.

1. కుత్సితములైన తర్కములను కొండలను పగులగొట్టుటలో దీక్ష కలవారిని వక్రగతి కలిగిన పాపములను హరించే సద్గుణ దీక్ష కలవానిని, కల్ప వృక్షములాంటి మహా ఫలములను అనుగ్రహిస్తున్న విస్తారమైన రామానుజుల వారి శమ దమాదులను భిక్షగా అనుగ్రహిస్తున్న వారిని,

2. కోపగించిన మాయా వాదులకు కుఠారమైన వారిని, బౌద్ధమనే అంధ కారాన్ని తొలగించే ప్రకాశ వంతులకు శుద్ధమనే వేద మణి కాంతులు వచ్చే తేజోపుంజానికి సిద్ధాంతము చేసిన చిన్మయత్వాన్ని ఇష్ట పడిన వారికి,

3. గహనమయిన చార్వాక నాస్తిక వాదానికి ప్రచండ కుఠారమయిన వారికి, తప్పుడు శాస్త్రములకు ఎత్తిన కత్తి వంటి వానికి, ఎటువంటి సంసార వికారములేని గుణములతో నిండిన వారికి, శ్రీవేంకట నగ సంయోగంతో గంభీరములయిన లక్ష్మీ బృందాన్ని నేను సేవిస్తున్నాను.



## *89. హరి రసమ విహారి*

(కీర్తన సంఖ్య 045 సంపుటము 06)

**హరి రసమ విహారి సతు –**
**సరసోయం మమ శ్రమ సంహారి**

**1.దయా నిభృత తనుధారి సం**
**శయాతిశయ సంచారి**
**కయాప్యజిత వికారి**
**క్రియా విముఖ కృపాణధారీ ।**

**సదా మిథ్యాజ్ఞానీ సతు**
**మదాలి మతాభిమానీ**
**తదాశ్రిత సంధానీ సతు**
**తదా తదా చింతా శయనాని ।**

**పరామ అత సంపాది**
**స్థిరానందా స్వాదీ**
**వరాలాపవివాది శ్రీ –**
**తిరువేంకటగిరి దివ్య వినోది ॥**

**తాత్పర్యము :**

శ్రీవేంకటేశ్వరుడు సాటిలేని వేడుకల విహారము కలవాడు. అతడు సరసమైన వాడు. నా శ్రమను నశింపచేసే వాడు.

1.దయతో నిండిన శరీరము ధరించిన వాడు. సందేహములను మించిన సంచారములు కలవాడు. ఎవరి చేత జయింపలేని మార్పులు కలవాడు. శ్రీకృష్ణునిగా రాసలీల నృత్యము చేసేటప్పుడు తనకు ఇష్టమయిన నందక ఖడ్గాన్ని తాకని వాడు.

2. ఎప్పుడూ అతడు మాయను తెలుసుకొన్నవాడు. అతడు మదించిన ప్రియురాండ్ర అభిప్రాయములను ఇష్టపడేవాడు. ఆశ్రయించిన వారికి రక్షణ ఇచ్చువాడు. అప్పుడప్పుడు వారి విచారములను పోగొట్టే వాడు.

3. శ్రేష్ఠమయిన అమృతాన్ని (మోక్షము) ఇచ్చేవాడు. స్థిరమయిన ఆనందము అనగా బ్రహ్మానందమును ఆస్వాదించువాడు. చక్కని సంభాషణలు చేసేవాడు. శ్రీ వేంకట గిరి పర్వతముపై దివ్య వినోదాలతో శోభిల్లుతున్నాడు.

**విశేషాలు :**

ఈ కీర్తనలో దశావతార వర్ణనను ఇలా సమన్వయము చేయవచ్చు.

దయా నిభృత తనుధారి = దయ అను పొలుసుల చేత ఆవరింపబడిన శరీరం

కలిగిన వాడు (1. మీనావతారం). సంశయాతిశయ సంచారి = సంశయాలకు అతీతంగా సంచరించేవాడు. అమృత మథనం సంశయమైనప్పుడు, ఆ సందేహాలను దూరం చేస్తూ తాబేలు అవతారమెత్తినవాడు (2. కూర్మావతారం). కయాప్యజిత వికారి = వికారమైన వరాహావతారమెత్తినప్పుడు, ఆ వికారాన్ని అణచుకోలేక పోయినవాడు (3. వరాహావతారం). క్రియా విముఖ కృపాణధారీ = పనులలో ఉపయోగ పడని కత్తులను ధరించినవాడు. నరసింహావతారంలో కత్తులు ఆయనకు అవసరం లేకపోయినాయి. గోళ్లతోటే వ్యవహారం చక్కపెట్టాడు (4. నరసింహావతారం).

చరణం 2: సదా మిధ్యాజ్ఞానీ = దొంగ బ్రహ్మచారిగా అవతరించిన వాడు (5. వామనావతారం). సతు మదాలి మతాభిమానీ = పరశురామావతారంలో క్షత్రియులను సంహరించి, వారి స్థానంలో భ్రమర కీటక న్యాయంగా బ్రాహ్మణులను రాజులుగా చేసిన వాడు (6. పరశురామావతారం). తదాశ్రిత సంధానీ = ఆశ్రయించిన వారిని రక్షించిన వాడు (7. రామావతారం). సతు తదా తదా చింతా శయనానీ = అప్పుడప్పుడు మద్య సేవనంలో విచార గ్రస్తుడయ్యేవాడు ( 8. బలరామావతారం).

చరణం 3: పరామృత సంపాది = పర విషయ సంబంధమైన అమృత సమానమైన గీతను బోధించిన వాడు (9. కృష్ణావతారం). స్థిరానందాస్వేదీ = శాశ్వతమైన లోకానందముకై శ్రమించేవాడు ( 10. కల్కి అవతారం). వరాలాపవివాది = చక్కటి గానములచే వినోదం పొందేవాడు. శ్రీ – తిరువేంకటగిరి దివ్య వినోది = శ్రీ వేంకట గిరి పర్వతంపై లోకుల వినోదం కోసం– ఆనందం కోసం ఉన్నవాడు అయిన వేంకటేశ్వరుడు జయింపబడు గాక ! ధన్యవాదములు.



## *90 .హా సమీచీన మపహాసం*

(రేకు 374, 2-368)

**హాసమీచీనమపహాసం తే**
**దానై ప్రకాశితం దరిదంతు లోకే**

**1.ద్వారకా పట్టణే త్వం పురా చ స్వయదీక్షితన్తూ స్త్రియః**
**కేశముష్టిః కథం సారస కురువంతి సరసవేళాయాం ॥**

**2. వరశిశోరక్షణే త్వం పురా చ అహం బ్రహ్మచారి అథోచే స్తదేతి**
**గోపతరుణయః కిమితి వా తద్వసతి త్వం ॥**

**3. తత్తబృందావనే త్వం పురా చ శ్రియౌ వేంకటాద్రౌ ఇదం.**
**నివ్విభాసి ఇదం చిత్తమిత్యమరాశ్చ ది సేవంతి సర్వే ॥**

ఈ కీర్తన సంస్కరింప వీలులేకున్నదని శ్రీ గౌరిపెద్ది వారి మాట. వారి మాటతో ఏకీభవిస్తూ కేవలము లేఖన దోషాలున్న కీర్తనను మాత్రమే ఉదాహరిస్తున్నాను. అర్థ వివరణ సాహసము చేయుటలేదు.





